# ఆంధ్ర గ్రంథాలయం

సచిత్ర ఆంధ్రాంగ్ల త్రైమాసిక పత్రిక

సంపుటము ౨ జనవరి, ఏప్రిల్ ౧౯౪౧ సంచికలు ౧, ౨






సంపాదకులు

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

పాతూరి నాగభూషణం, డిప్. లిబ్.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము-బెజవాడ

కార్యస్థానము : పటమటలంక

ప్రకాశకర్త:
అడుసుమల్లి శ్రీనివాసరావు
సారస్వతనికేతనం
వేటపాలెం, గుంటూరుజిల్లా

# అభిప్రాయములు

'ఆంధ్రగ్రంథాలయం' ౧ వ సంపుటము 3, 4 సంచికలు విమర్శనార్థము మా కార్యాలయమునకు బంపబడినవి. ఇయ్యది ఆంధ్రదేశ గ్రంథాలయసంఘపక్షమున ప్రకటింపబడుచున్నది. ఆంధ్ర, ఆంగ్లభాషలలో మంచిమంచి వ్యాసములతో చెన్నారుచున్నది. అయినను తగినంతప్రోత్సాహ సాహాయ్యములను పాఠకులవలన పడయజాలకుంట శోచనీయము. గ్రంథాలయముల నెలకొల్పి తగురీతిని పరిపాలించుటకు సాయపడగల ఉపాయములు, నిబంధనలు, సలహాలు తెలుపబడినవి. భారతదేశమునంగల అనేక గ్రంథాలయములయొక్కయు, గ్రంథాలయసభలయొక్కయు, సంగ్రహావివరము లిందు బొందుపఱుపబడినవి. నిరక్షరాస్యుల విద్యావంతుల జేయగల విధానములు విశదము చేయబడియున్నవి. విద్యాభిమానులెల్లరు నాపత్రికను సర్వవిధముల నాదరింతురుగాక. —జ్ఞానప్రభ

## మావద్ద వెలకు దొరకు పుస్తకములు

| | రు. అ. పై. |
|---|---|
| బ్రిటిషుమహాయుగము 2 సంపుటములు | |
| కర్త—శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి | 6—0—0 |
| విశ్వరూపం: కర్త—శ్రీ కాశీపట్నపు కొండయ్య | 2—0—0 |
| జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి | |
| ఆంధ్రమహాపురుషులు - ప్రథమభాగము | 3—0—0 |
| సాహిత్య తత్త్వవిమర్శనము | 1—4—0 |
| విద్యార్థిప్రకాశిక | 1—4—0 |
| మాలపల్లి : కర్త—శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ | 3—0—0 |
| సఫలత : కర్త—శ్రీ వడ్లమూడి వేంకటరత్నం | 1—0—0 |

కార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము
పటమటలంక (వయా) బెజవాడ

ముద్రాపకులు
భారతీ ప్రెస్, తెనాలి

# ఆంధ్ర గ్రంథాలయం

సచిత్ర ఆంధ్రాంగ్ల త్రైమాసిక పత్రిక

సంపుటము ౨ జనవరి, ఏప్రిల్ ౧౯౪౧ సంచికలు ౧, ౨





సంపాదకులు

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

పాతూరి నాగభూషణం, డిప్. లిబ్.

ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము - బెజవాడ

కార్యస్థానము : పటమటలంక

# విషయసూచిక (Contents)

# స్వవిషయం

'ఆంధ్రగ్రంథాలయం' మొదటిసంపుటము ప్రకటన పూర్తియై చాలకాలమైనను రెండవ సంపుటమును ప్రారంభించుట కింతవరకు మా కవకాశము లభించ దయ్యె. యుద్ధఫలితముగ పెరిగిన కాగితపువిలువయు, వలసినప్పుడు తగినకాగితము లభింపమియు, మా ఆర్థికపుటిబ్బందికితోడు వ్యాసములు వగైరా అనుకున్న వేళకు అందకపోవుటయు దీనికి కారణములు. మొదటిసంపుటమునకు అచ్చుఖర్చులకైన బాకీతీర్చకనే రెండవసంపుటమును ప్రారంభించవలసి వచ్చుటచే కూడ వెనుక ముందు లాలోచించుచు కొంతకాలము గడచినది.

### తోడి పత్రికలు

ఆంగ్లపత్రికలమాట యటుంచి తెలుగుపత్రికలైనను తమసోదరిని కొంత ఆద రించియున్న మాకిప్పటికన్న నెక్కుడు ప్రోత్సాహము లభించియుండెడిది. జన సామాన్యముయొక్క బాగుకొరకు ప్రయత్నించు సకలోద్యమములలో మిన్నయగు గ్రంథాలయోద్యమ విషయమై మాకు సాయపడవలసిన పత్రికలవారు మూకీ భావము వహించుటవలన మేమెంతయు నిరుత్సాహపడితిమి. తెలుగుదేశములోని ప్రముఖములగు పత్రిక లన్నింటికిని విమర్శనార్థము మా పత్రికను మొదట పంపి యుంటిమి. ఇందు 'గృహలక్ష్మి', 'విజ్ఞానం', 'ఆర్షపత్రిక' తప్ప తక్కిన యేపత్రిక గాని దీనినిగూర్చి నాలుగుమాటలైన వ్రాసినదిలేదు. ఎవరుగాని వ్రాసియున్నను మాకు వానిప్రతుల బంపినదిలేదు. కొన్నిపత్రికలలో విమర్శనార్థము చేరినగ్రంథ ముల పట్టీలోనైనను మా పత్రికపేరు చేర్చబడలేదు. ఎడతెగని ప్రచారముతప్ప ఆధారములేని మా ప్రయత్నమున కికనుండియైన తోడిపత్రికలు తోడుపడగలవని ఆశించుచున్నాము.

### గ్రంథాలయ పత్రికావసరము

ఏ ఉద్యమానికి గాని స్వంత పత్రిక ఒకటి ఉండడం అవసరం. దారితెన్ను గానక తంటాలుపడు పరిస్థితిలో ఏప్రయత్నముగాని ఎక్కువ కాలము సాగుటకు వీలులేదు. అనేక తావులలో వేఱువేఱు పరిస్థితులలో ఎన్నోచిక్కుల నెదుర్కొని పనిచేయవలసిన పరిస్థితి గ్రంథాలయ సేవకులది. అగుటవలన ఆయా సందర్భముల కనువగు రీతిని తమ కార్యముల నడపుటకు తోడుపడు విధానముల గూర్చి వారు తెలిసికొన వలసిన అవసర మెంతేని గలదు. నేటి గ్రంథాలయ సేవ కులలో పలువురు తమపనిని క్రమముగ నిర్వహించుటకు తగినంతగ చదువు కొన్నవారు కారు. చదువున్నవారిలో సహితము గ్రంథాలయ నిర్వహణమునకు

సంబంధించిన జ్ఞానమంతగ లేదు. అనుభవపరులిందులో కొంద రుండ వచ్చును. కాని వారిఅనుభవము సహితము తప్పులుచేయుచు దిద్దుకొనుచుండుటతో సరి పోవును. గ్రంథాలయ నిర్వాహకులకు సశాస్త్రీయముగ శిక్షణనిచ్చు నిమిత్తము ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారిటీవలనే ఏర్పాటుచేసి యున్నారు. అయినను ఎక్కువమంది గ్రంథాలయసేవకు లీయవకాశమును వినియోగించు కొన జాలకున్నారు. ఇట్టిపరిస్థితులలో అనుభవపూర్వకమగు వ్యాసములద్వారా గ్రంథాలయ సేవకులకు సశాస్త్రీయమగు గ్రంథాలయ విజ్ఞానము నందుబాటులో నుంచుటకును, వేరువేరు స్థలముల సాగుచున్న గ్రంథాలయ సేవాకార్యముల వెల్లడించుటద్వారా వారిలో నుత్సాహమును రేకెత్తించి పనులు చురుకుగ జరుగునట్లు చేయుటకును అవకాశముండును. ఈపనికై ఇతరులమీద ఆధారపడుటకు వీలులేదు. కనుక ఎన్నిశ్రమల కోర్చియైనను 'ఆంధ్రగ్రంథాలయం'ను నిర్వహించుట గ్రంథాలయోద్యమ సేవకుల విధిగ పరిగణించుచున్నాము.

## గ్రంథాలయ సేవకుల తోడ్పాటు

ఈపత్రిక క్రమముగ వెలువడుటకు గ్రంథాలయ సేవకులందరు తోడ్పడవలెను. ఒక్కరుగ నెవ్వరుగాని ఈకార్యమును నెరవేర్చుట దుస్తరము. కాన గ్రంథాలయముల నిర్వాహకులును, ఉద్యమాభిమానులును దీనిప్రచారమునకై పూనుకొన వలెను. ఎవ్వరెవ్వరి శక్తిసామర్థ్యముల ననుసరించి వారీపత్రికకు చందాలను విరాళములను రాబట్టుటకు ప్రయత్నించుట మొదట చేయవలసినపని. గ్రంథాలయ సేవకులు తమ కార్యక్రమసమాచారములను ఎప్పటికప్పుడు తెలియజేయుచు గ్రంథాలయశిక్షితులును, గంథాలయశాస్త్రమును చదివినవారును, గ్రంథాలయ నిర్వహణమునకు సంబంధించిన వివిధ విషయములనుగూర్చి మనదేశపరిస్థితుల కనుకూలపడు విధమున వ్యాసములను వ్రాసిపంపుచు— ఇట్లు ఎవరికి చేతనైన సాయమును వారు చేయుచునున్న మాపత్రిక సకాలమున వెలువడుచు ఉద్యమాభివృద్ధికి చాలగ తోడ్పడగలదు.

## వయోజనవిద్య

ఇటీవల వయోజనవిద్యావిషయ మొక ప్రత్యేక ఉద్యమముగ బయలుదేరినది. రాష్ట్రీయప్రభుత్వములు జాతీయవాదుల చేజిక్కుటతో దీనికి గొప్పబలము చేకూరినది. జాతీయవాదులచేతినుండి ప్రభుత్వములు జారిపోయిన తదుపరికూడ దేశశ్రేయోభిలాషులగు యువకు లెక్కువగ నీ కార్యక్రమమునకు బూనిరి. వయోజనవిద్యాప్రచారము గ్రంథాలయముల ప్రధానకర్తవ్యముగ చాలకాలముక్రితమే గుర్తింపబడినది. గ్రంథాలయములు లేకుండ వయోజనవిద్యావ్యాప్తి జరుగుటసంభవమని తెలిసియే బీహారు మున్నగురాష్ట్రములలోని ప్రభుత్వములు తమ వయో

జన విద్యా ప్రచార కార్యక్రమమున గ్రంథాలయముల నిర్మాణమునకు బాగుగ తావొసగినవి. వయోజనవిద్యకు గ్రంథాలయములకు గల అవినాభావసంబంధమును బట్టియే మొదటినుండియు మా పత్రికలో గ్రంథాలయ విషయములతో పాటు వయోజనవిద్యకు సంబంధించిన సంగతులనుకూడ చేర్చి ప్రకటించుచున్నాము. ఈ విషయమై కృషి చేయు వారెవ్వరైనను వ్యాసములనుగాని, వార్తలనుగాని మాకు పంపుచో సంతోషముగ స్వీకరింతుము. వీనిని మాపత్రికలో ప్రకటించుటకు ప్రయత్నింతుము. ప్రస్తుత మీయుద్యమమున కండగనుండు పత్రిక ప్రత్యేకముగ లేని కొరతను దీర్చు సంకల్పము మాకుగలదు. కాన వయోజన విద్యావ్యాప్తిని వాంఛించు వారెల్లరు ఈపత్రిక నాదరింతురని యెంచెదము.

## గ్రంథ సమీక్షలు

గ్రంథాలయముల నిర్వాహకులు తమతమ గ్రంథాలయములకు పుస్తకముల కొనవలసి వచ్చినపుడు ఏగ్రంథములు కొనదగనివో ఏవి కొనదగినవో తెలియక ఇబ్బంది పడుటయు, ఆలోచనలేక సంపాదించిన గ్రంథములవలన గ్రంథాలయాదర్శము సరిగ నెరవేరకపోవుటయు పరిపాటిగ నున్నది. ఈ యిబ్బందులు కలుగకుండ నుండుటకై వేరువేరు విషయములనుగూర్చి పరిశోధన చేసిగాని, మఱొక విధముగగాని దెలిసికొన్న వారిచే ఆయా విషయములకు సంబంధించిన గ్రంథపట్టీల తయారుచేయించ వలసినవిధి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముపై గలదు. దీనికి నిపుణుల సాహాయ్యమవసరము. ఇవిగాక తెలుగునను ఆంగ్లమునను నిత్యము వెలువడు సద్గ్రంథములపై విమర్శనములుకూడ ఎప్పటికప్పుడు వెలువడుచో గ్రంథ భాండాగారులు వీనిని చదువుకొని తమకుపయుక్తముగ నుండు గ్రంథముల వీని ఆధారముపై నెన్నుకొనుటకు వీలుకలుగును. కనుక గ్రంథకర్తలును, గ్రంథ ప్రకాశకులును తమనూతన ప్రచురముల నెప్పటికప్పుడు మాకుబంపుచో వానికి సమర్థులైనవారిచే సమీక్షలు వ్రాయించి మా పత్రికలో ప్రచురపఱతుము.

## కృతజ్ఞత

ఇంతదనుక నీపత్రికానిర్వహణ విషయములో మాకు సాయపడిన సంపాదకులకు, వ్యాసకర్తలకు, విమర్శకులకు, ముద్రాపకులకు, చందాదారులకు మేమెంతయు కృతజ్ఞులము. మాపత్రిక నాశీర్వదించుచు తమ అభిప్రాయముల కోరినంతనే వ్రాసిపంపిన పెద్దలకు మావందనములు. వీరందఱితోడ్పాటును మాకు లభింపజేసిన సర్వేశ్వరునికి మా ప్రణామములు అభిమానులసహాయము, పెద్దల ఆశీర్వచనములు ముందుకాలములోకూడ మాకు కొల్లలుగ లభింపజేసి మా పత్రిక చిరకాలము నిర్విఘ్నముగ కొనసాగునట్లనుగ్రహించుటకై పరమాత్ముని మఱియొకసారి ప్రార్థింతుము.

---

# గ్రంథాలయ సూక్తులు

'మధురకవి' శ్రీ నాళము కృష్ణరావు

## గ్రంథములు

కలఁత లడఁగించు, కష్టముల్ తొలఁగఁ ద్రోయు,
పాపములఁ బాపు బన్నముల్ పాఱఁద్రోలు,
మాంద్యమును మాన్చు, దుఃఖముల్ మఱవఁజేయు;
కావ్యములు మానవుల పాలి కల్పలతలు.

కావ్యములు కావ్యమాత్రముల్ కావు తలఁప
అవి పురాతన ప్రస్తుత భవిత్వకాల
మానవుల జీవితంబుల మానసముల
భావముల నాశయంబుల వ్యక్తపఱచు.

తరములనుబట్టి విబుధులు దాచియున్న
జ్ఞానభండారములు గ్రంథసంపుటములు
ధరణి వెలసినయందాక తఱుగఁబోని
వారసత్వపు హక్కులై వఱలు మనకు.

సృష్టి మొదలుగ మనుజు లార్జించినట్టి
నిస్తులం బగు మాన్యముల్ పుస్తకములు;
సతము సద్గ్రంథపఠనంబు కతనఁ గాదె
పృథివి నాగరికత జెంది వృద్ధి గాంచు.

అమిత ధనధాన్యభాగ్య భోగముల కన్న
అమల వాఙ్మయ రామణీయకము ఘనము;
శేముషీవంతుల పవిత్ర జీవిత ప్ర
శస్త రత్నపుంజంబులు పుస్తకములు.

పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె
యందు నిఱుపేదకాపు నై యుందుఁ గాని,
పుస్తకంబులు లేనట్టి భూరిసౌధ
మందు చక్రవర్తిగ నుండ నభిలషింప.

గ్రంథములు పెక్కు తనచెంతఁ గలిగియుండి
అనయమును వాని చదువని యట్టివాఁడు,
దివ్వె కరమున ధరియించి తిరుగు గ్రుడ్డి
వానివిధమున పరిహాసపాత్రుఁ డగును.

మంచిగ్రంథము జదువఁ గాంక్షించువాఁడు
కోరఁ డాప్తుల హితులను కూర్మిసఖుల;
దినదినంబును హితము బోధించుచుండు
పుస్తకంబులె తన కూర్మి నేస్తగాండ్రు.

### గ్రంథాలయములు

ఆలయంబులఁ బోలె గ్రంథాలయముల
విమలభక్తిని జనులు సేవింపవలయు;
ఎందు వెదకిన నందని యీశ్వరుండు
కాపురము సేయు నిరతంబు కావ్యవాటి.

తనువు రక్తము జీవంబు ధారవోసి,
ఋషివతంసులు పెక్కువేలేండ్ల తపము
సలిపి ఆర్జించినట్టి విజ్ఞానధనము
దాచియుంచిన పేటి గ్రంథాలయంబు;

పాటకజనంబు పెంపొందవలయు నన్న
మేలి సాధన ముచితగ్రంథాలయంబు,
ప్రవిమలం బగు సద్గ్రంథపఠనవాంఛ
తుచ్ఛవాంఛల నెల్లను తొలఁగఁద్రోలు.

గాలి నీరును లేకున్న గడపవచ్చు,
గ్రాసమును లేక ఎట్టెటో గడపవచ్చు;
గడపవచ్చునె మన మొక్క గడియ యైన
గ్రంథభాండారములు లేని గ్రామమందు?

గ్రంథనిలయంబు గల నరకంబునందు
నైన నివసింపఁ గాంక్షింతుఁ గాని, నేను

గ్రంథనిలయంబు లేని స్వర్గంబునందు
నిముస మైనను నివసింప నిచ్చగింప.

దేవళంబులు సత్రముల్ సావడులును
చెఱువులును వీట లేకున్న కొఱంత లేదు;
దివ్య మగు నొక్క గ్రంథమందిరము లేని
వీడు వీడు గా దది పాడుబీడు గాని.

గ్రంథనిలయంబునందలి గ్రంథములకు
గుణమె కాని ప్రధానము, గణము కాదు
ఎన్నియో చెత్తపొత్తము లున్నకన్న
ఉత్తమగ్రంథములు కొన్ని యున్న చాలు.

ఏను గ్రంథాలయంబున కేగినపుడు,
గ్రంథములు నాకు కన్పట్టు కనులయెదుట
ఉర్వీజనులకు బోధించి యుద్ధరింప
వేడ్క దివినుండి వచ్చిన విబుధులనఁగ.

# బాలవాఙ్మయం

[ శ్రీ చింతాదీక్షితులుగారి రేడియో ప్రసంగము ]

విద్యావిధానాన్ని బాగుచెయ్యాలెననీ, అందరినీ అక్షరాస్యులను చెయ్యాలెననీ, దేశమందంతట ఉత్సాహము చెలరేగుతోంది. దొరతనములు అందుకై నడుములు బిగించినవి. ఈసందర్భములో బాలుర కుచితమైన వాఙ్మయము మనకు కద్దా అని విచారిస్తే లేదనిచెప్పాలి. ఇట్టి లోపములు తీరిననేతప్ప విద్యాబోధ సరియైన పునాదులమీదపడే అవకాశంలేదు. ఈలోపము తీరడానికి (1) ప్రాచీన వాఙ్మయాన్ని ఉద్ధరించవలసియున్నది. (2) నవ్యకవులు నూతనసృష్టి చేయవలసియున్నది. మన ముద్ధరించవలసిన ప్రాచీన బాలవాఙ్మయస్వరూప మెట్టిదో కొద్దిగా చూదాము. శిశువు జన్మించినదిమొదలు బాల్యదశ వీడేవరకూకూడా వాని మనస్సుకు రంజకంగా ఉండే వాఙ్మయము వానికి అందుబాటులో ఉండాలి. తెలుగు తల్లులు తమబిడ్డలకు ఉగ్గుపాలతోపాటు కావ్యరసమున్నూ పోశారనడానికి జోలపాటలూ, లాలిపాటలూ, నిదర్శనము.

జోలపాటలు

రామలాలీ మేఘశ్యామలాలీ
తామరసనయ నా దశరథతనయలాలీ
అద్దాలతొట్టిలో నీవు అమరిఉండగా
ముద్దుపాపడంచు నిన్ను మురిసిచూచారు ॥రామలాలీ॥

ఇందు ఒకేదేవుణ్ణి ఉద్దేశించి పాడడముండవచ్చు. లేదా పసిపాపల చిన్నబుద్ధులకుకూడా అర్థమయ్యే విషయములతో కూడిఉండవచ్చు.

ఉదాహరణము

(1) హాయివారమ్మాయి నీళ్లకెళ్లింది
పాలైన యివ్వవే ఓకుక్కపిల్లా.

(2) అల్లవారింటికీ చల్లకెడితేను
అల్లవారికుక్క బొంయిమన్నాది
నాకాళ్లగజ్జెలు ఘల్లుమన్నాయి
నాచంకలోబిడ్డ కేరుమన్నాడు

(3) పిల్లెమ్మవెళ్లింది పల్లెల్లుదాటి
అబ్బాయివెళ్లేడు రచ్చలుదాటి

కుక్కపిల్లలూ, పిల్లిపిల్లలూ, ధ్వన్యనుకరణములూ, బాలురను ఆకర్షించేవేకదా. పిల్లలను ఆడించేటప్పుడు పాడే చందమామపాటలు, గుమ్మడిపాటలూ, దాదం దక్కచ్చి మొదలయినవికూడా వారిని ఆకర్షించేవే.

కొందరు పిల్లలుచేరి ఆడుకొనేటప్పుడు పాడేపాటలు వారి చిత్తవృత్తుల కనుగుణమైవుంటవి.

(1) కాళ్లగజ్జి కంకాళమ్మ మొదలైనవి.
(2) గుడుగుడు గుంచం గుండారావం పాములపట్టం మొదలైనవి.
(3) ఒకాకావో చెలియా, రెండూలోగిళ్లూ మొదలైనవి.

ఇవి ముఖ్యముగా అర్థములేని అనుప్రాసప్రధాన మయిన పాటలుగా ఉంటవి.

### కిండరుగార్టన్ పద్ధతిపాటలు

కిండరుగార్టెన్ మార్చ్సుకు అనుగుణమయిన పాటలుకూడా ఉన్నవి.

(1) చినచిన దొంతుల్ చిటారిదొంతుల్
లక్కమేడల్ లవంగమొగ్గల్
చిన్నీ మీరేటివారే, చిలకా మీరేటివారే మొ॥

(2) బుజబుజరేకుల పిల్లుందా
బుజ్జారేకుల పిల్లుందా
తాడి మేడి పిల్లుందా
తామరగిరీ మొగ్గల్లు.

### కట్టుకథలు

ఇక కథావాఙ్మయము ఎట్టిదంటే ప్రథమమున తల్లులుగాని, ముసలమ్మలుగాని చెప్పే చిన్నికట్టుకథలు. మొట్టమొదట మనయిళ్లలో శిశువులు వినే చిన్నకథ చీమకథ. అట్టివే నల్లి, పేను, వగయిరా జంతుకథలు. ఇవిగాక యంత్రాలకు సంబంధించిన మజిలీకథలూ, పంచతంత్రకథలూ, యదార్థకథలూ, క్రమక్రమంగా పిల్లలు నేర్చుకుంటున్నారు. ఈపాటలలోనూ, ఈకథలలోనూ అద్భుతరసము ప్రధానముగా ఉంటుది. బాలుర నాకర్షించే రసముకూడా అద్భుతరసమే కాకుండా బాలుర చిన్నబుద్ధులు గ్రహించగలిగే హాస్యరసముకూడా వాటిలో కద్దు. మచ్చుచూపుతాను.

(1) వదినా వదినా వల్లంకిపిట్టా
గదిలోపెట్టా గంజినీళ్లోయ్యా
నీకొడుకుట్టా నాపేరెట్టా
అన్నయ్యకొట్టా, నువ్వేడ్వా, నేనవ్వా.

(2) బావా బావా పన్నీరు
బావను పట్టుకు తన్నేరు
మూలామంచం వేశారు
మూడుగుద్దులు గుద్దేరు
నులకామంచం వేశారు
నూరూగుద్దులు గుద్దేరు.

(3) బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది
అత్తతెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామతెచ్చిన మల్లెపువ్వులు ముడువనన్నది
పడమటింటి కాపురమ్మూ చేయనన్నది
మొగుడుకొడితే మొత్తుకుంది
బిడ్డపుడితే ఎత్తుకుంది.

**కొన్ని పసిడితునకలు**

ఇంతేకాకుండా ఈబాలవాఙ్మయంలో ఏదేశపు సారస్వతానికైనా వన్నెదెచ్చే దివ్యకవిత్వపు పసిడితునకలు దొరుకుతవి. మచ్చుకు-

(1) ఆటమాణిక్యమే పాటమాణిక్యం
నట్టింట అమ్మాయి రత్నమాణిక్యం

(2) ఆడుకొని అబ్బాయి వచ్చేకాబోలు
అందెళ్ళ చప్పుళ్లు పందెళ్ళలోన
చదువుకొని అబ్బాయి వచ్చేకాబోలు
సరస్వతీచప్పుళ్లు సావిళ్ళలోన.

(3) అందరిమామల్లు మేనమామల్లు
అమ్మాయి మామల్లు చందమామల్లు.

(4) ఏడవకు ఏడవకు వెర్రినాగన్నా
ఏడిస్తె నీకళ్లు నీలాలుగారు
నీలాలుకారితే నేచూడలేనూ
పాలయినగారవే బంగారుకళ్లు.

మాతృప్రేమ నంతనూ కొద్దిమాటల్లో యిమడ్చడమే యీపాటలలోని ప్రతిభకు లక్షణం. ఇంకా ఈపాటల్లో పరిశోధకులకు పనికివచ్చేటట్టులు అనేకం వున్నవి. ఈ పాటలూ కథలూ కొన్ని నన్నయ్యకుకూడా పూర్వమందు పుట్టి నేటివరకూ నిలిచి ఉన్నవి.

2

(1) కథలలో ఈగకథ మిక్కిలి ప్రాచీనమైనది. ఈగకు "ఈ" అనేపేరు ఎప్పుడు వాడుకలోఉండేదో అప్పటినుంచీ ఈకథ తెలుగుదేశంలో వ్యాప్తిజెందిఉన్నది. ఈ క్రింది గేయభాగములు పరిశోధనార్హములేమో నిర్ణయించాలి.

(2) అగడం, పగడం, కవిలికిదంతం, గిరగిరచక్రం, గింజప్ప, ఆహ్వా, ఊహ్వా, కళింగ పాపడు కడ్డీ కడ్డీ కడ్డీ—ఎవరీ కళింగపాపడు ?

(3) బోడిగుండు, బొప్పాసిగుండు
తిమ్మరాజుగారి దివిటీగుండు

—ఎవరీ తిమ్మరాజు ? దివిటీగుండంటే ఏమిటి ?

(4) ఏడవకు ఏడవకు వెర్రినాగన్నా
ఏడిస్తె నీకళ్లు నీలాలుగారు

(5) పిల్లిపల్లీ పిల్లి పిల్లలమర్రీ
మర్రిక్రిందావాడు తొర్రినాగన్నా !

—ఎవరీనాగన్న ? ఆంధ్రులకు పూర్వకాలంలో నాగన్న అనేపేరు సాధారణంగా ఉండేదికాబోలు.

(6) కొండామీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలువిరిగె

—ఎవరీ కొక్కిరాజు ? సారంగధరుడని కొందరనేమాట వాస్తవమేనా ?

(7) చందామామ యిల్లూకట్టి
జాజిపూల తోటలోను
అమ్మానేను చిన్నాదాన్ని
అల్లుడువస్తే అంపాబోకు
ఢిల్లీకోట చల్లాగుంటె
దినానికి టంకం నేదెస్తా.

ఆంధ్రులకూ ఢిల్లీ సామ్రాజ్యానికీ సంబంధమున్నూ దినానికి టంకం సంపాదించే ముగ్ధలసామర్థ్యమున్నూ యిందు గ్రహించవలెను.

కట్టుకథలలో ఒక విశిష్టగుణమున్నది. అది బాలుర జ్ఞాపకశక్తిని వృద్ధి చేయడానికి ఏర్పాటైనది. శబ్దసంబంధంవల్లనూ అర్థసంబధంవల్లనూ గ్రహణధారణశక్తులు పెద్దవి కాగలవని సైకాలజి చెప్పుతోంది. ఇట్టిశబ్దార్థసంబంధాలీకథలలో గోచరిస్తవి. ఉదాహరణమునకు ఈగ కథ.

ఒక ఈగ ఇల్లలుకుతూ తనపేరు మరచిపోయిందట. సర్వదేశాలలోను సర్వ చిక్కులూ విడగొట్టే పేదరాలిపెద్దమ్మ దగ్గరికి వెళ్లుతుంది. తనకు తెలియదు కొడ్డు

కును అడగమంటుంది. ఈవిధంగా ఒకరినిబట్టి ఒకరిని అడుగుతూపోయింది. చిట్ట చివరకి ఈగ గుర్రంకడుపులో పిల్లదగ్గిరికివెళ్ళి అడుగుతుంది. ఏమసీ—పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా, కొడుకుచేతిలో గొడ్డలీ, గొడ్డలికొట్టేమానా, మాను మీదుండే పక్షుల్లారా, పక్షులుతాగే నీళ్ళల్లారా, నీళ్లలోవుండే చేపల్లారా, పట్టే పల్లెవాడా, వండే వంటలక్కా, తినేరాజా, రాజెక్కే-గుర్రమా, గుర్రంకడుపులో పిల్లా, నాపేరేమిటిఅని. గుర్రంపిల్ల నవ్వుతుంది.— ఈ ఈ ఈ అని. అప్పుడు ఈగకు తనపేరు జ్ఞాపకం వస్తుంది. ఈగకు ప్రాచీన రూపం "ఈ"అని పరిశోధకులు చెప్తా తారు. ఒకమారు పిల్లవాడు ఇట్టికథ వింటే ఇక మరచిపోడు.

## బాలవాఙ్మయం కర్త తల్లిహృదయం

బాలవాఙ్మయంలో చాలాపాటలకూ కథలకూ తల్లిహృదయమే కర్తృత్వం వహిస్తుంది. ఒక్కొక్కపట్టున బాలుర ఊహాశక్తి లయజ్ఞానముకూడా కారణమై ఉండవచ్చు. మరిన్ని బాల్యముకోల్పోని కవుల కల్పనాశక్తికూడా యిందుకు కారణమై ఉండవచ్చును.

ఇట్టి ప్రాచీనవాఙ్మయాన్ని పునరుద్ధరించి పాఠశాలలో ప్రవేశపెట్టవలసియున్నది. ఇంతేకాకుండా దీని ననుసరించి నూతన వాఙ్మయసృష్టికూడా జరగవలసియున్నది. బాలవాఙ్మయానికి తగిన వస్తువు దొరకదేమోనని మనము భయపడనక్కరలేదు. పురాణపురుషులు పెక్కురు బాలురు మనకున్నారు. వారి బాల్యచరిత్రలు కథావస్తువుగా మనము గ్రహింపవచ్చును.

## అధిష్ఠానదేవత బాలకృష్ణుడు

బాలవాఙ్మయానికి అధిష్ఠానదేవత బాలకృష్ణుడు. తెలుగుదేశంలో బాలవాఙ్మయం కొంతవరకు బాలకృష్ణక్రీడలపై ఆధారపడిఉన్నది. జోలలూ, మేలుకొలుపులూ, ఆటలూ, పాటలూ, కొంటెపనులు వర్ణించే కథలూ, గేయాలూ, బాలకృష్ణుణ్ణి ఉద్దేశించినవి పెక్కులున్నవి.

మిగిలిన బాలవీరులు—ధ్రువుడు, ప్రహ్లాదుడు, చిరకారి, మార్కండేయుడు, రాముడు, బలరాముడు, పరశురాముడు, వామనుడు మొదలయినవాళ్లు ఉన్నారు. ఉచితమైన బాలభాషలో వీరిచరిత్రలు వ్రాస్తే బాలవాఙ్మయం కొంత ఏర్పడుతుంది.

## సూరి, సీత, వెంకీ కథ

మరిన్ని, ఇతరదేశపు బాలవాఙ్మయాలతో మనము ఈ కాలంలో పరిచయము సులభముగా సంపాదించవచ్చు. స్టీవెన్‌సన్, హాథారన్, గ్రిమ్, ఆండర్‌సన్ మున్నగువారు వ్రాసిన కథలూ, స్లేడ్‌పుస్తకములు మనము ఆదర్శప్రాయంగా వుంచుకొని మనవాఙ్మయాన్ని వృద్ధిచేసికోవచ్చు.

నేను ముగ్గురు తెలుగు పిల్లల బాల్యజీవనమును " సూరీ - సీతీ - వెంకీ " అనే పేరుతో కొన్నికథలుగా వ్రాశాను. ఒక కథాభాగం వినిపిస్తున్నాను.

"ముగ్గురూ వెళ్ళి నడవలో కూర్చున్నారు. సూరి రెండోతరగతి వాచకము, సీతి ఒకటోతరగతి వాచకమూ, వెంకి పలకా పలకపుల్లా పట్టుకున్నారు."

సూరి పుస్తకం జాగ్రత్తగా అట్టవేసుకుంది. కొత్తబట్టలమీది బొమ్మలు అట్టల మీద అంటించుకొంది. పుస్తకంలో ఒక నెమలికన్నూ దానిదగ్గరే పువ్వారమూ పెట్టింది. "సీతోయి చూడవే చూడవే, ఈ నెమిలికన్నే ఎంతపువ్వారం తినే సిందో. ఒకపిల్లనైనా పెట్టదు—పాడు" అందిసూరి. సీతి తనపుస్తకంలో నెమిలి కన్నున్న పేజీతీసి "నాపువ్వారం కొంచెంతింది నా నెమిలికన్ను చూడే, అక్కా- చూడే. ఎంత చిన్నపిల్లనిపెట్టిందో! చూడే ఒసే" అంటూ సీతి ఒకచిన్న నెమిలి వెంట్రుక సూరికి చూపింది.

"అది పిల్లా ఏమిటమ్మా" అందిసూరి.

"కాదా ఏమిటమ్మా" అందిసీతి.

"నాకదియ్యవూ" అంది వెంకి. వెంకిని మభ్యపెట్టి సీతి కన్ను దాచేసుకుంది. సీతిపుస్తకము అంతా నలిగి చిరిగిఉంది.

"అక్కయ్యా ఈపాఠం చెప్పవుటే నాకు" అందిసీతి.

"ఏంపాఠం" అని సూరి అడిగింది.

"కుక్కపాఠం" అంది సీతి.

"కుక్కపాఠ మేమిటి అసయ్యం. ఇంకా పాఠాల్లేవూ" అంది సూరి.

"పిల్లిపాఠం, ఏనుగపాఠం, సోమరిపిల్లవాడిపాఠం ఉన్నాయి" అంది సీతి.

"అవేంపాఠాలే పాడుపాఠాలు. కథలు లేవూ" అని సూరిఅడిగింది.

"సృగునికథ, హరిశ్చంద్రునికథ, ఎడ్వర్డుకథ, ఫ్రాంక్లినుకథ, ఈకథలున్నాయి" అంది సీతి.

"అవేంకథలే, ఎంచక్కటి కథ లేమీలేవూ మనం చెప్పుకునీలాంటివి" అంది సూరి.

"ఏమోనమ్మా నాకు తెలియదు" అంది సీతి.

"పోనీ పద్యంచదువు" అంది సూరి.

"చివరున్నాయే పద్యాలుచదవనా—"

"క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజమరయ దైవము రెండున్
సూత్రపడ గూడెనేనియు—"

"ఏమోనమ్మా ఆపద్యాలు నాకు తెలియవు. అవేంపద్యాలోగాని" అంది సూరి.

"సూరోయి, ఇదేం నాలుగోవాచకం" అంది సీతి.

"ఆసిదాంగా ఇంకా నీపుస్తకం అనుకుంటున్నాను" అంది సూరి.

"పోనీ నీపుస్తకంలో కథలుచదవవే" అంది సీతి.

"నాపుస్తకమూ ఆలాగేఉందమ్మా పాడు" అంది సూరి.

"ఒకటిచదవ్వే పోనీ" అంది సీతి.

"అయితే చదువుతా విను" అని సూరి ఇలా చదివింది.

"పూర్వకాలంబున నుజ్జయిని నా బట్టణం బొండుకలదు......"

"బొండు బొండు బొండేమిటే సూరీ" అంది సీతి.

"వినవే మరి" అని సూరిచదవడం సాగించినది.

"అందు వీరసేనుండను భూతలేంద్రుండు రాజ్యము సేయుచుండెను. ఆతనికి జంద్రకళయను పేరం బరగు కళత్రంబు సకలగుణోపేత..."

"పేత పేత పేతేమిటి పీత" అంది సీతి.

"పోనీ అమ్మా నేచదవను" అని సూరి పుస్తకము మూసేసింది.

నేను వ్రాసిన లక్క-పిడతలలోంచి ఒకగేయం.

బాజాలురా నాన్న బాజాలు
బాజాలువచ్చేయి బాజాలు
బాజాలతోవచ్చె పల్లకీ అదుగో
పల్లకీలోఉంది పార్వతీదేవి
పార్వతీదేవికీ జేజేలుపెట్టు
బాజాలురా నాన్న బాజాలు
బాజాలువచ్చేయి బాజాలు.

ఇంకా బాలవాఙ్మయాన్ని సృజించిన, సృజిస్తున్న గ్రంథకర్తలు మనలో ఉన్నారు. గురజాడ అప్పారావుగారి ఆడపిల్లలపాట చిత్తగించండి:—

"ఆటల పాటల పేటికలారా
కమ్మనిమాటల కొమ్మల్లారా
కలువలకన్నెల కన్నెల్లారా
పిల్లలగన్న తల్లుల్లారా

విన్నారమ్మ ఈకథను:—

కొండల నడుమను కోనొకటుంది
కోనకి నడుమ కొలనొకటుంది
కొలని గట్టున కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

ఏయేఋతువుల పూచేపువ్వుల
ఆయాఋతువుల అందించి
బంగరు దుర్గను బక్తితో కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ. ”

పసితనమందు పిల్లలకు యిట్టి సారసత్వముతో పరిచయము కలిగినప్పుడే వారిజీవితవృక్షానికి సరియైన దోహద మేర్పడుతుంది.

“ఫక్కున సూర్యుడు నవ్వేడంటే
పట్ట పగలు ఈలోకముకు
ఫక్కున చంద్రుడు నవ్వేడంటే
చల్లని వెన్నెల జగములకు
ఫక్కున పాపాయి నవ్వేడంటే
పరమానందం నీకూ నాకూ
అవునా కాదా అలివేణి.”

(19—9—38 ఆంధ్ర వార పత్రికనుండి)

# గ్రంథాలయ నిర్వహణము *

శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు
శ్రీ శారదా గ్రంథాలయ భాండాగారి, అనకాపల్లి

"విద్యానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్" అను న్యాయానుసారము జ్ఞానాభ్యుదయకారణమగు గ్రంథాలయ నిర్వహణమందలి శ్రమ గ్రంథాలయ నిర్వాహకులకే గోచరము.

గ్రంథాలయనిర్వహణము వెన్నమీగడ లారగించి పువ్వులపాన్పున పరుండుట కాదు. గ్రంథాలయనిర్వహణము ఆదర్శముగ నుండవలెనన్నచో పాలకవర్గమువారు ఆదర్శప్రాయులుగ నుండవలెను. అంతియేకాక వారిచే గ్రంథాలయ నిర్వహణ నిమిత్తము ప్రత్యేకముగ నేర్పాటుచేయబడిన గ్రంథభాండాగారి సమర్థుడుగను, ఆదర్శపురుషుడుగను నుండవలెను. పాలకవర్గమువారు గ్రంథ భాండాగారిని జీతమిచ్చి పోషించునౌకరుగ చూడరాదు. అతడు పాలకవర్గమందు చేర్చబడక పోయినప్పటికిని గ్రంథపాలనాకార్యక్రమమున నీతనికి సంపూర్ణ స్వాతంత్ర్యముండునుగాన పాలకవర్గమువా రీతని సలహాల ననుసరించియే నిబంధనలు చేయవలసియుండును.

## గ్రంథభాండాగారి

గృహమునకు గృహిణి, నౌకకు సరంగు, దేవాలయమునకు అర్చకుడు, సంస్థానమునకు ప్రధాని, పశువులకు కాపరి, భూమికి రైతు ఎట్టివారో గ్రంథాలయమునకు గ్రంథభాండాగారి అట్టివాడు. రమణీయములగు భవనములనిర్మించి అందు పట్టీల ప్రకారము పుస్తకముల సర్దవచ్చునుగాని సరియగు గ్రంథభాండాగారులు లేనిదే అవి గ్రంథాలయములనబడవు. గ్రంథభాండాగారి పుస్తకములను సర్దుబాటు చేయువాడుగ నుండినంతమాత్రముచే చాలదు. అతడు పలుకుబడిగలవాడుగ కూడ నుండవలెను. అనేక సద్గ్రంథముల పఠించినందువలన కలుగు జ్ఞానము గ్రంథభాండాగారి సహవాసమువలన కలుగవలెను. గ్రంథాలయము సజీవమైనదని చెప్పుటకు గ్రంథభాండాగారి ప్రాణవాయువువంటివాడు కావలెను.

గ్రంథాలయ పరిసరములయొక్కయు, పాఠకుల యొక్కయు, పాలకుల యొక్కయు, గ్రామము యొక్కయు పరిస్థితుల గ్రహించి ఆదర్శమునకు భంగము

* రాజమహేంద్రవరమున శ్రీ గౌతమీగ్రంథాలయభవనమున కూడిన 22వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలో చదివిన ఉపన్యాసభాగము.

కలుగనంతవరకు గ్రంథాలయాభివృద్ధికి అనువగు మార్గముల అమలు పరచుటకు తగువ్యవహారజ్ఞానము గ్రంథభాండాగారి కలిగి యుండవలెను. భిన్నభిన్న ప్రవృత్తులుగల వ్యక్తులు అనేకమంది గ్రంథాలయమునకు వచ్చుచుందురుగాన వారిలో తనప్రవృత్తికి విరుద్ధముగ నున్నవారిని నిర్లక్ష్యముచేయక ఆదరించి వారుకోరుగ్రంథముల నిచ్చుచు వారితో పరిచయము కలిగించుకొని వారిని సత్ప్రవర్తకులుగా దిద్దుబాటుచేయవలెను. అట్లని వారితో కాలముగడుపుచు తనవిధ్యుక్తధర్మమును మరువరాదు.

గ్రంథాలయమునకు వచ్చువారిని ఆకర్షించి జ్ఞానవంతులుగ చేయునట్టి చిత్రములతోను సూక్తులతోను గ్రంథాలయమును అలంకరించవలెను. హెచ్చుమంది గ్రంథాలయమునకు వచ్చునటులచేయుటయే గ్రంథభాండాగారియొక్క ముఖ్యవిధి. గ్రంథాలయమునకు వచ్చినవారందరూ అచ్చట ఉన్నంతసేపు నిర్విచారముగ నుండునటుల చేయుటకు వారినాకర్షించు మంచి వార - మాస పత్రికలు తెప్పించుచుండవలెను. దేశపురోభివృద్ధికి ముఖ్యులగు పిల్లలను ఆకర్షించి బుద్ధిమంతులుగ చేయుకొరకు అందమగు పటములతోకూడిన చారిత్రక పుస్తకములను, కథలపుస్తకములను తెప్పించవలెను. గ్రంథాలయమందు ఇతరపుస్తకములకంటె విమర్శక గ్రంథములు హెచ్చుగా నుండవలెను. విమర్శనాదృష్టితో గ్రంథముల చదివినవారు చేయు సూచనలను రికార్డుచేయవలెను. గ్రంథభాండాగారి తెలుసుకొన్న విషయములను గ్రంథాలయమునకు వచ్చువారికి తెలుపుచుండవలెను. ప్రతిమాసమందును గ్రంథాలయమందు చేర్చబడిన పుస్తకములపట్టికను ప్రచురణ చేయుచుండవలెను. దీనిని నోటీసుబోర్డుకు అంటించవలెను. పుస్తకముల పేర్లనుబట్టియు, గ్రంథముల తరగతులనుబట్టియు విభజనచేసి వరుసగవ్రాసి చదువరుల కొసంగు చుండవలెను. పత్రికలయందలి ముఖ్యవిషయములను (సారాంశములను) నల్లబల్లపైవ్రాసి గ్రంథాలయమునకువచ్చువారికి కనబడునట్లు ఉంచవలెను. పాఠకులు గ్రంథములను భద్రముగ చదువునటుల ప్రోత్సహింపవలెను. ఉపయోగమున కనుకూలముగనుండు పద్ధతిని పుస్తకముల నేర్పాటుచేసి నెలకొకసారి పుస్తకముల నన్నిటిని పరిశీలించి క్రమసంఖ్యప్రకారము సరిగావుంచుచు చెదలుమొదలగు పురుగులవల్ల చెడకుండుటకు కర్పూరమాత్రలు మొదలగు రక్షణ ద్రవ్యములను గ్రంథపేటికలయందు జల్లుచుండవలెను. తనతోడిసేవకులను హింసించక ఉత్సాహపరచి గ్రంథాలయాభివృద్ధికి పాటుపడునటులచేసి వారితో తానుకూడ పనిచేయవలెను.

పాలక వర్గమువారికిని తనకును అభిప్రాయభేదములు కలిగినప్పటికిని స్పర్థవహించి గ్రంథాలయ పురోభివృద్ధికి భంగము కలిగించరాదు. భావికాలప్రవర్తనకుపయుక్తమగు గ్రంథములను, ఎంతధనము వెచ్చించినను దొరకని పుస్తకము

లను, తాళపత్రగ్రంథములను కడుభద్రముగ జాగ్రత్తపరచి గ్రంథభాండాగారి వాటిని అర్హులగువారి కేయిచ్చి పుచ్చుకొనుచుండవలెను. చిన్నవారలకొర కుపయోగింప బడు పుస్తకములను తప్పక కొనవలెను. వారే గ్రంథాలయమున కర్హులైన శిష్యులు. వారివల్ల గృహములభివృద్ధిపొంది దేశక్షేమము కలుగును. ఒక్కొక్క గ్రంథాలయములో నొక్కొకవిధమగు జ్ఞానమునిచ్చెడు పుస్తకములు చాల యుండవలెను.

పూర్వగ్రంథములను ఆధునికగ్రంథములను చదివి వాటి మూలాధారముల తెలిసికొనుట గ్రంథాలయ సమితి సభ్యులకంటె గ్రంథభాండాగారి ముఖ్యవిధి. సంఘముయొక్క గుణములనుబట్టియు, విద్యావిషయమును బట్టియు, నివాసుల వృత్తులబట్టియు గ్రంథాలయముయొక్క పలుకుబడి యుండును. గ్రంథాలయమును ఆదర్శముగ నడుపుటకును, చదువరుల కుపయోగపడు నంశములు తలపునకువచ్చి నపుడు చెప్పుటకును గ్రంథభాండాగారి సందేహపడకూడదు. గ్రంథవిమర్శ చేయుచు చదువరులకు కావలసిన విషయముల తెలియచేయవలెను. గ్రంథాలయములోని కార్యమునంతయు శ్రద్ధతో నిర్వహించవలెను.

## పాలకవర్గము

గ్రంథాలయ పాలకులు అహంభావమును, మనస్పర్థలను విడనాడి గ్రంథాలయముద్వారా విజ్ఞానము వెదజల్లు సదుద్దేశముతో శ్రద్ధగా పనిచేసినయెడల త్వరలో గ్రంథాలయము అభివృద్ధిలోనికివచ్చి ఆదర్శముగ వెలయగలదు. 'నువ్వు దగ్గు, నేను పక్క లెగురవేయుదును' అను న్యాయానుసారము పనిఅంతయు ఒకని నెత్తినిరుద్ది పీడు తాత్కాలికముగ హోదాలు చెలాయించుటకు వచ్చుచుండిన ఫలితముకూడ అటులేయుండును.

అనుకూలమగుదినములను నిర్ణయించి నెలకు 4 దినములు గ్రంథాలయమునకు సెలవులుయిచ్చి ఆ సెలవుదినములలో వరుసగా తొలిదినమున గ్రంథాలయము పరిశీలించుటయు, మలిదినమున కొత్తచందాదార్లను చేర్చుటకు గ్రామమందు సంచారము చేయుటయు, మూడవదినమున బకాయిచందాదార్లను కలిసికొని సొమ్ము వసూలు చేయుటయు, నాల్గవదినమున కాలాతిక్రమణముపొందిన పుస్తకములు వసూలు చేయుటయు జరిగించవలెను.

పురాణపఠనముద్వారాను, ఉపన్యాసముల మూలముననను, ఆదర్శ పురుషుల జయంత్యుత్సవములు జరుపుటవలనను, పోటీపరీక్షలు జరిపించుట వలనను, మ్యాజిక్ లాంతరు ప్రదర్శనమువలనను, రాత్రిపాఠశాలలు నెలకొల్పుటవలనను వయోజనులను, బాలురను విజ్ఞానవంతులుగ చేయవలెను. గృహపరిశ్రమలకు సంబంధించిన ప్రదర్శనముల జరిపించి స్త్రీలోకమునకు విజ్ఞానమును వెదచల్లవలెను. నవరాత్రములందు సంగీతకచేరీలు మున్నగువాని నేర్పరచి ప్రజల నాకర్షించవలెను.

గ్రంథాలయ యాత్రలు సాగించి గ్రంథాలయ ఉద్యమవ్యాప్తికి తోడ్పడవలెను. మరియు యాత్రలందు సమీపమునగల పురాతన చారిత్రక ప్రదేశముల దర్శించి అందలివిశేషముల రికార్డుచేయుటయు, తాళపత్రగ్రంథముల సేకరించుటయు, వానిని కేంద్రగ్రంథాలయ భవనములందు భద్రపరచుటయు జరుగవలెను. యాత్రావిశేషములను పత్రికలయందు ప్రచురణ చేయించు చుండవలెను.

ప్రతి గ్రంథాలయమువారును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమందు సభ్యత్వమును పొంది ఆదర్శప్రాయమగు కట్టుబాట్లతో గ్రంథాలయోద్యమమును కొనసాగించవలెను. దీపావళి సంక్రాంతి భిక్షులకు బయలుదేరి గ్రంథాలయమునకు మూలధనమును చేకూర్చి తద్వారా ప్రతి గ్రంథాలయమునకు స్వంతభవనమును నిర్మించవలెను. గ్రంథాలయముగల గ్రామముయొక్క వివరమును వ్రాయించి వచ్చువారికి కనబడునటుల గ్రంథాలయ భవనమున ప్రదర్శించవలెను. గ్రామప్రజలకు దేశభాషాజ్ఞానమును, పిమ్మట ఇతరభాషా పరిచయమును, జీవితానంద సంధాయకములగు కళలందును, స్వతంత్ర జీవనాధారంబులగు పరిశ్రమలయందును అభిరుచిని కలిగించవలెను.

## ప్రజలు

గ్రంథాలయనిర్వహణమున ప్రజలుకూడ భాగస్వాములే. వారికి అవకాశము కలిగినపుడు కాలమును వృథాపుచ్చక గ్రంథాలయమునకు వచ్చి పత్రికాపఠనమును, సద్గ్రంథపఠనమును చేయుచుండవలెను. గ్రంథాలయమందు జరుగు ప్రతి సభకు హాజరగుచుండవలెను. వారివారి గ్రామములయందలి ఉన్నత భవనములకు మిన్నయగు ఆలయమును శ్రీశారదాదేవికి నిర్మించవలెను. అందరు చందాదారులుగాచేరియు, విరాళముల సమృద్ధిగనొసగియు, గ్రంథాలయసేవజేసియు జీవితముల సార్థకముచేసికొనవలెను.

## గ్రంథాలయ సేవకులు

మనతెలుగు దేశమందలి గ్రంథాలయ సేవకులందరూ సంవత్సరమున కొకసారి అయినను ఉద్యమవ్యాప్తికి అర్హమగు వేరువేరు ప్రదేశములందు సమావేశమై వారివారి అనుభవములను ఒకరికొకరు "బోధయన్తః పరస్పరమ్" అనున్యాయానుసారము తెలుపుకుంటూ మనదేశమందలి అన్ని గ్రంథాలయములయందు ఒకే మోస్తరు రిజిస్టర్లుఉంచి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమందు ప్రతి గ్రంథాలయమును చేర్చి సక్రమమార్గమున ఉద్యమవ్యాప్తిగావించి తద్వారా ప్రజలలో విజ్ఞానమును వెదజల్లి తమవిధులను నిర్వర్తించుచుందురుగాక యని ప్రార్థించుచు ముగించుచున్నాడను.

గ్రంథాలయోద్యమవ్యాప్తిమూలమున ధర్మయుగస్థాపనకు భగవానుడనుకూలించుగాక!

# ౨౨ వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ
# రాజమహేంద్రవరము

## ప్రారంభోపన్యాసము

గ్రంథాలయ సేవకమహాశయులారా !

నేటి యీ గ్రంథాలయ మహాసభకు నన్ను సభాప్రారంభకునిగా నుండ నాజ్ఞాపించిన ఆహ్వానసంఘమువారి సాహసమెంతయు కొనియాడదగియున్నది. ప్రథమమున ఈపనికి నియోగింపబడిన శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు ఆంధ్ర సారస్వతాకాశమండలమున విజ్ఞానకాంతిని వెదజల్లుచున్న సుప్రసిద్ధ కవితారాగణము లలో నొకరు; ఆంగ్లేయ విద్యాధికులు. అట్టివారిచే ప్రారంభింపబడవలసిన ఈ మహా సభను నాబోటి అనామకుడు ప్రారంభించుట నాటకములలో ఎవనిచేతనో రాజుపాత్ర ధరింపజేయునట్లుగా నున్నది. అయినప్పటికిని మీకంటె ఎక్కువసాహసము జూపి ఇందుల కంగీకరించినందులకు మీమన్ననకు పాత్రుడననే భావింపవలసి వచ్చుచున్నది.

ఈ గ్రంథాలయోద్యమము మన ఆంధ్రదేశమున నుద్భవించిన ప్రారంభదినము లలో అనగా నిప్పటికి ముప్పదిసంవత్సరములకు పూర్వము నా స్వగ్రామమగు నిడదవోలులో ఒక గ్రంథాలయమును (ఇప్పటి చంద్రారెడ్డి గ్రంథనిలయమును) స్థాపించియుండుటవల్లను, ఆరోజులలో పల్లెగ్రామములలో గ్రంథాలయముల నెల కొల్పుటకు ప్రోత్సహించుచు, ఆరోజులలో జరుగుచు వచ్చిన గ్రంథాలయసభ లలో చురుకుగా పాల్గొనుచుండుట వల్లను, నేడు ఆంధ్రదేశమునందలి గ్రంథాలయ స్థాపకులలోను సేవకులలోను అగ్రగణ్యుడుగా ప్రఖ్యాతివహించిన నాప్రియమిత్రుని షష్టిపూర్తి మహోత్సవము చేయుచున్నామో ఆ యుత్తమపురుషుడగు శ్రీ నాళం కృష్ణరావుగారిచే నెలకొల్పబడిన శ్రీ వీరేశలింగం పుస్తకభాండాగారమునందు కొంతకాలము లైబ్రేరియను పని చేసియుండుటవల్లను, ఈయుద్యమములో అప్పటి నుండి యిప్పటివరకునూ నడుముకట్టుకొని పనిచేయుచున్న నన్నెరిగినమిత్రులు కొందరుండుటవల్లను యీపనికి నన్ను నియోగించిరని యూహించుచున్నాను. మేమీ గ్రంథాలయోద్యమములో పనిచేయ మొదలుపెట్టిన నాటికి ఇప్పుడు చురు కుగా పనిచేయుచున్న గ్రంథాలయసేవకులు పుట్టియుండక పోవుటచేతను, వీరు ఉత్సాహముతో పని ప్రారంభించునప్పటికి మేము కార్యరంగములోనుండి నిష్క్ర మించి కారణాంతరములచే కాలుకదప వీలులేక పోవుటచేతను ప్రస్తుత యువకులగు

గ్రంథాలయసేవకుల స్మృతిపథములో నాబోటివాళ్లుండుటకు తావులేదు. ఇది పూర్వగాథ.

దేశములో ప్రచురితములగుచున్న మత సాంఘిక రాజకీయాది వివిధ ఉద్యమము లకును గ్రంథాలయోద్యమము జీవనువంటిదని యంగీకరింపక తప్పదు. గ్రంథాలయముల మూలముననే దేశమునం దుత్పన్నములయ్యే యుద్యమములన్నింటిని సజీవములుగా, ప్రతిభావంతములుగా, స్థిరములుగా నుంచుట కెంతయో యవకాశము కలదు. దీనికొక యుదాహరణము చూపవచ్చును. భీమవరముతాలూకాలో నేమి, మరి యితరప్రదేశములలో నేమి యేగ్రంథాలయము లెక్కువగా సేవచేయుచున్నవో ఆయా ప్రదేశములలోని ప్రజలు రాజకీయోద్యమములో ముందంజ వైచుటయేగాక విద్యావిజ్ఞానములయం దెంతయో యున్నతస్థితికి వచ్చియున్నారని చెప్పవచ్చును. ప్రజలలో వయోజనవిద్యావ్యాపనమునకుగాని, బాలవిజ్ఞానవ్యాపనమునకుగాని గ్రంథాలయములద్వారా మనము విద్యాలయములకంటెను బాహుళ్యముగా విజ్ఞానవ్యాపకము చేయగలమను నమ్మకము నాకు గలదు. దేశమున కనేకవిధముల మహోపకారము చేయగల యీ గ్రంథాలయస్థాపనముపట్ల ధనవంతులలో మనమిత్రుడు కృష్ణరాయనివంటి కొలదిమందిలో తప్ప తక్కినవా రెవ్వరును యీ యుద్యమమునకు తోడ్పడకపోవుట విచారకరము. ప్రతిగ్రామములోను దేవాలయము, విద్యాలయము ఎంత ప్రధానములో గ్రంథాలయములుకూడ అంతటి ముఖ్యసంస్థలేయని యిప్పటికైనను గుర్తించి ప్రతిగ్రామమందును గ్రంథాలయముల నెలకొల్పి వాటియభివృద్ధికి పాటుపడవలసియున్నారము. పల్లెగ్రామములలో ఎవరంతటవారు చందాల పూర్వకముగా డబ్బిచ్చి పోషింపలేకపోయినను కొలగారపుపాటలు, పచ్చగడ్డి అమ్మకముపాటలు మొదలగువాటిద్వారా వచ్చు ఊరి ఉమ్మడి సొమ్ములో కొంతభాగమును యీ గ్రంథాలయముల నెలకొల్పుటకు మనము గ్రామీయులను ప్రోత్సహింపవలసియున్నది. గ్రంథాలయములు నెలకొల్పబడి బాగుగా పనిచేయుచున్న గ్రామాదులలో జాతి కుల మత భేదము లంతగా పాటింపక ఆ సరస్వతీనిలయమునం దేక మనస్కులై యన్యోన్యముగా కలిసి పని చేయుచుండుట మన మెరుగుదుము. గ్రామపంచాయితీలున్న ప్రదేశములలో తప్పక ఆ పంచాయతీ యాజమాన్యమున నొక్కొక్క గ్రంథాలయమును నెలకొల్పి దానిని పోషింపవలసిన యావశ్యక మెంతయేని కలదు. జిల్లాబోర్డు పరిపాలనము క్రింద కొన్ని పుస్తకభాండాగారములు స్థాపింపబడి పనిచేయుచున్నను బోర్డువారు గ్రంథాలయముల కివ్వవలసినంత సహాయప్రోత్సాహముల కలిగింపకుండుట విచారకరము. ప్రాథమిక విద్యావ్యాప్తి ఎంత ముఖ్యావసరమో గ్రంథాలయములను విరివిగా నెలకొల్పి తన్మూలమున విద్యావ్యాపక మభివృద్ధిచేయుట తమ కనీసధర్మమని

జిల్లాబోర్డు గ్రహించిననాడే ప్రత్యేకవ్యక్తులు చేయు ప్రచారసహకారములకంటె ననేకరెట్లధికముగా గ్రంథాలయములు అభివృద్ధిపొందుట కవకాశము కలుగగలదని నమ్ముచున్నాను. దేశములో దాతలు చాలామంది ధర్మసత్రములు నిర్మించి దేశోపకారము చేయుచున్నారు. అట్టి దాతలచేతనే ఆ సత్రములలో కొంతభాగమును గ్రంథాలయముల నెలకొల్పుటకు వినియోగింపవలసినదిగా మనము వారిని ప్రోత్సహించవలసియున్నది.

దేశమునందలియు విదేశాలయందలియు రాజకీయ పరిస్థితులు మారిపోయి, నాగరికత యొకమూల నిర్మూలమును మరియొకప్రక్క నిర్మాణమును జరుగుచున్న యీరోజులలో, దూరశ్రవణ దూరదర్శన యంత్రములు విలసిల్లుచున్న యీదినములలో, మనదేశమున కొంతవరకైన వాటిసహాయమునుపొంది వాటిద్వారా విజ్ఞానవ్యాప్తికి పాటుపడవలసిన యవసరమెంతేని కలదు. కాబట్టి సాధ్యమైనంతవరకు గ్రంథాలయములలో రేడియోయంత్రముల నెలకొలిపి తద్వారా స్వదేశ విదేశముల యందు జరుగుచున్న కార్యకలాపముల దెలుసుకొనవలసినదనియు, రేడియోసెట్లను ధనవంతులు దానపూర్వకముగా నొసంగునట్లు వారిని ప్రోత్సహింపవలసియున్నదనియు మనవిచేయుచున్నాను.

గ్రంథాలయోపయోగములను చెప్పవలెనన్న సంవత్సరములకొలది చెప్పవచ్చును. దాదాపుగా ముప్పదిసంవత్సరములనుండి సాగించుచున్న యీయుద్యమముయొక్క యుపయోగములనుగూర్చియు ప్రాముఖ్యతనుగూర్చియు చెప్పుకొనుచునే యుంటిమి. ఈచెప్పుటతో తృప్తిచెందక ప్రతి యొక్కరు ఒక గ్రంథాలయమునైనను స్థాపించి, దాని యుపయోగములను గ్రామీయులచే అనుభవింపజేసిననాడే మన గ్రంథాలయసేవకులు ధన్యులయ్యెదరని మనవిచేయుచున్నాను.

గ్రంథాలయముల పాలన, నిర్మాణము, వ్యాపకము మున్నగు వివిధవిషయములనుగూర్చి నాకంటె యనేకవిధముల అనుభవజ్ఞులును పూజ్యులునగు నేటి సభాధ్యక్షులు శ్రీరామచంద్రకవిగారు మున్నగు మహామహు లెందరో విపులముగా నుపన్యసింపనున్నారు. ఈ గ్రంథాలయోద్యమమునకును నేడు షష్టిపూర్తి మహోత్సవము జరుపబడుచున్న శ్రీకృష్ణరాయలయొక్క జీవితచరిత్రమునకును అవినాభావసంబంధముండుటవలన యిట్టి ఆనందసమయమున నీ ఆంధ్రదేశగ్రంథాలయసభ కూడ జరుపుచుండు టెంతయు బాగుగానున్నది. నాకీగౌరవమును కలుగజేసినందులకు గ్రంథాలయసంఘము వారికి నా మనఃపూర్వక వందనముల నందజేయుచున్నాను.

నిడదవోలు వెంకట్రావు

# అధ్యక్షోపన్యాసము

## (తెనుఁగునాటి పొత్తపుగుడి పేరోలగము)

## వేఁడిక

కడతఱుల యెల్లలనుమించి, కడ యెఱుఁగని
యెఱుకయే పొడగాఁ తగి, ఎల్లయెడలఁ
తన్నె కనుఁగొనుచుఁ జా, హాయిఁ తనరుచుండు
తొలిమి వెలుంగుఁ గొలుతుఁ డెందంబునందు.

పొత్తపుగుడి తోఁబుట్టువులారా,

నేనేమో పొత్తపుగుడి కొలువు కొంత చేసితినని, ఈ పేరోలగమున-సుమారు వేయియేండ్ల క్రిందట నే తెనుఁగునాటి మన్నన పట్టు లన్నింటిలోఁ గన్నకై- వన్నెకాంచి- ఇప్పటికిని ఆవాసి వీసర పోవక వెలయుచున్న రాజమహేంద్రవరమున, నన్ను గద్దె యెక్కించిన మీ కెల్లరకును మేలుమఱవమి కేలుమోడ్పులు ! తొలి గ్రంథాలయమహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు తమ ఉపన్యాసమున, రాజమహేంద్రవరమందలి వీరేశలింగ గ్రంథాలయమునకు తా మధ్యక్షులుగా ఉండుటచే తమకా అధ్యక్షపదవి లభించినది కాఁబోలు నని తెలిపియున్నారు. నే నేమనుకొనవలయునో ! నాకు హెచ్చుగా మనికిపట్టుగా ఉండు విశాఖపట్టణము తెనుఁగునాటి మొకటి మన్నన పట్టలలో ఒకటిగా పేరొందకున్నను, మన యీ పొత్తపుగుడి కడంకకు అదే నిక్కమగు మొదటి మనికిపట్టు. అది తొలుతనుండియు పొత్తపుగుడులకు పేరుపొందిన పట్టణమే. అందుచేతనే అందలి ఆర్ష గ్రంథాలయమునుబట్టి కీ. శే. మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులుగారు ఆంధ్రదేశగ్రంథాలయ పితామహులేమో ! అని అనుకొనినారు శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావు పంతులుగారు. ఆపట్టణపు గొప్పఁదనమునకు ముఖ్యకారణ మొకటి కలదు. అది ఏమందురా? వినుఁడు. విశాఖపట్టణమందే పడమటి తీరున సరిగా తెనుఁగునాటి మొట్టమొదటి పొత్తపుగుడి బయలుదేఱి, ౧౮౮౬ నుండి ౧౯౦౬ వఱకు ఇరువదియేండ్లు కట్టుదిట్టముగా పనిచేసి, కీ. శే. కొక్కొండ వేంకటరత్నశర్మగారు మొదలగువారి మెప్పుపొందుటయే. అట్టి పొత్తపుగుడి కొన్ని కారణములచే ఎంతయు సన్నగిల్లినను రూపుమాయనీయక దానిని మా ధర్మాశ్రమమునకు చేర్చి, నిలువఁబెట్టితిని. పొత్తపుగుడి కడంక మేలుబంతిగా సాగింపవలయు ననుతలంపున మాక్రొత్త హిందూపఠనమందిరము కట్టుటకు ప్రేరకుండనై పాటుపడితిని. చిన్ననాఁట నుండియు తెనుఁగు పొత్తములమీఁద మక్కువ ఎక్కువగుటచే పొత్తపుగుడి కొలువులో విశాఖపట్టణముజిల్లాలోనే కాక తక్కినచోట్ల కూడ వానిపై మక్కువ చూపుచు, తోడివారికి హెచ్చరికచేయ కడంగుచుంటిని. ౧౯౧౮ లో ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ జరిగినపుడు దానికి కార్యదర్శిగా ఉంటిని. కాంగ్రెసుపనిలో చిక్కియుండినపుడుకూడ వీలగునెడల పొత్తపుగుడి పనిచేయుచుంటిని. మొదటి విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయమహాసభకును, స్థాయిసంఘమునకును, నాతోడి కొలువరులు నన్నే అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. ఈ నడుమ నేను బెజవాడలో ఉండవలసివచ్చినపుడు సుమారు 3 ఏండ్లు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ కార్యనిర్వాహకసంఘమునకు అధ్యక్షుఁడనుగా ఉండి, గ్రంథాలయసర్వస్వము ప్రకటించుట, గ్రంథాలయ యాత్రలు చేయుట, సభల కధ్యక్షత వహించుట మొదలగు పనులలో పాల్గొంటిని. ఇపుడు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమున ఒక ఉపాధ్యక్షుఁడనుగాను, మరల విశాఖపట్టణముజిల్లా గ్రంథా

లయ సంఘమునకు అధ్యక్షుఁడను గాను ఉన్నాను. కాన, నా కొలువునుగూర్చి తెలిసిన నాతోడి పొత్తపుగుడి కొలువరులు నాకు ఈ మన్నన ఇపుడు చేసినారనుకొందును. ఇందువలన మన్నన తెచ్చునది కొలువే అని గుర్తింపనగును. కాని, మీరు నాకిచ్చిన యీ పెద్దతికపు కొలువు మీ తోడ్పాటుతోడనే కాని సరిగా కానేరదు. కావున, మీలో ఒకఁడనగు నాకు తోడ్పడి, జరుగవలసిన పని చక్కఁగా జరిపించెదరుగాక ! అని మిమ్ముందఱను వేఁడుకొనెదను. నా నుడివిక మొదలిడుటకు ముందు మిమ్ము మఱొక కోరిక కోరుకొనెదను.

“ఏనెఱుంగ దీనిఁ; ఇది అందు చేఁకల్ల.— అనెడుమాటలెపుడుఁ అనకుఁడీరు;
ఎఱుఁగఁ చదువవలయు; ఎఱుఁగవలెఁ గ్రహింప; నిగ్గుదేల్చుకొనఁగ నేర్వవలయు.”

ఇది నారదమహర్షి భావము. దీనిని బ్లావట్ స్కీ అమ్మగారు ‘దివీల్ ఆఫ్ ఇసిస్.’ అనుపొత్తముతుదిని చేర్చిరి. అదే నేనిపుడు విన్నవించితిని. మనకు తెలిసినది మిక్కిలితక్కువ; తెలియనిది మిక్కిలి యెక్కువ. కాన, తెలియనిది తెలిసికొనుటకు ఎన్నో పొత్తములు చదువవలె; కాని, అవిఅన్నియు మనకుదొరకవు; దొరకినవి చదివినను చదివినదైన ఆకళింపునకు తెచ్చుకొనఁగలిగియుండవలె; అందలినిగ్గు తేల్చుకొనఁగలిగియుండవలె. అపుడుగాని కొంతయేని మనకు తెలియదు. అట్టిచో, ఉన్నపొత్తములుకూడ చదువకయే, అవి చదివినవారివలన తెలిసికొనకయే, ఏదికాని కల్లఅనరాదు.

## ఎఱుక మనకు ఎట్లు కలుగును?

౧ గురువులవలన; ౨ స్వయంకృషివలన; 3 అనుభవమువలన. నోటితో చెప్పినవారేకాక, ఎఱుక కలిగించు పొత్తములు వ్రాసినవారును మనకుగురువులే. దేశాటనము, పరిశోధనము మొదలగునవి పైవానిలోనే చేరును. అనుభవములో, ఆధ్యాత్మికానుభవము మిక్కిలి గొప్పది; అదే నిక్కపు టెఱుక పట్టు. నిజమునకు తక్కినవన్నియు దానికి మెట్లే. ఎఱుకఁగడింపఁదలఁచువారు గురువులకొఱకు అరయుదురు; కాని, తగినవారుదొరకుట అరిది. దేశాటనముగాని, పరిశోధనముగాని, అందఱును చేయఁజాలరు. ఆధ్యాత్మికానుభవము కోటిలో ఒక్కరికేని కలుగునో! కలుగదో! కాన స్వయంకృషివలన సులువుగా అందఱును ఎఱుకకలిగించు తెరవులు పొత్తపుగుడులే. పలుపలుకులేల? ఎఱుకయే ఎన్నరానిపసు; ఎఱుకయే ఎల్లప్పుడునుండుకలిమి; ఎఱుకయే ఎడతెగనిహాయి. అట్టి అప్పసపు టెఱుక సమకూర్చెడి యీవి మ్రాఁకులు పొత్తపుగుడులుగాక మఱేవి?

శ్రుతి, స్మృతి, సిద్ధులదివ్యదృష్టి, సజ్జనులసత్ప్రవర్తనము—అను నాలుగు ఎఱుకదొనలని మనువనె.

ఎఱుకకలిగించుటలో సులువగు మేటి తెరవులు పొత్తపుగుడులె అయినపుడు వానినిగూర్చి బాగుగా ఎఱుంగనగు.

## పొత్తపుగుడి కడంక

ఇది క్రొత్తదికాదు; ఎప్పుడో పుట్టినది; పెరిఁగినది; నడుమతగ్గినది; మరల తలయెత్తినది; ఇపుడు పడమటినాడులలో బాగుగా సాగుచున్నది; ఇండియాలో బరోడాసంస్థానమున ప్రశస్తముగా జరుగుచున్నది; మనతెనుఁగునాటను కొంతవఱకు పని చేయుచు, కొంత మేలు చేకూర్చుచున్నది. అయినను, ఇంకను మనపెద్దలు పలువురు దీనికి వలయుసాయమీయకున్నారు; దొరతనమువారి తోడ్పాటును కడు తక్కువగాఉన్నది. అందువలన మనపొత్తపుగుడికడంక రావలసినంత పైమెట్టునకు రాఁజాలకున్నది. చేయవలసినంత మేలు చేయఁజాలకున్నది. ఇట్టిచో, ఈపాటి మంచి ఉనికిలోనికేని తెచ్చి, దానిని నిలువఁబెట్టుచున్న నాతోడి పొత్తపుగుడి కొలువరులకెల్లరకును—ఈ పేరోలగమున ఉన్న మీకును, ఇక్కడకురాఁజాలని వారికినిగూడ—జేజేలుచేసెద. అందు, మంచిమేలుకోరి, తెనుఁగునాటిపేరు కోరి—తమకును పేరుతెచ్చుకొనకోరిన కోరియుందురుగాక!—తెనుఁగునాటి పొత్తపుగుడికడంకకే

కాక—ఇండియాపొత్తపు గుడికడంకకెల్ల మేటిప్రాపై కీ. శే. సూరి నరసింహశాస్త్రిగారితోడ్పాటుతో తొలుత ఎంతో పాటుపడి, పిదప ఎక్కటిబంటుగా నైతము డబ్బును-ఉసురును ధారపోసి, ఇపుడు కొంతవిశ్రాంతి కొనుచున్న శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి తమకడంక నెగ్గించుటకు వలయు ఆయురారోగ్యవైభవములు సమకూర్ప ఎల్లవేలని ఎల్లయెడల వేఁడెద. ఆం. దే. గ్రం. సం. కార్య నిర్వాహకులనుగూర్చియు, గ్రంథాలయ నిర్వాహకులనుగూర్చియు, అటులే వేఁడెద.

## తెనుఁగుతోడి పొత్తు

పొత్తపుగుడికడంకకు నాటిపలుకుతోడిపొత్తు హెచ్చుగా కావలె. ఏనాటివారికి ఆనాటిపలుకులో వ్రాసినపొత్తములవలననే ఎఱుక కలిగించి, హాయిపొందు వెరవు చూపవలె. కాన, తెనుఁగునాటి గ్రంథాలయోద్యమము ఫలవంతమగుటకు తెనుఁగుతోడ్పాటు కావలె. కావున, మనపలుకు తల్లిని మనమందఱమును మన్నించి, మంచిస్థితిలోనికి తెచ్చుటకు ప్రయత్నింపవలె. తెనుఁగు వ్రాఁగమికిలోటు లేనిదను పేరు తేవలె. తెనుఁగుతల్లిని తక్కిన మేటిపలుకులతో పాటు గద్దె ఎక్కింపవలె. వలయుపొత్తములన్నియు తెనుఁగులో వ్రాయవలె; వ్రాయింపవలె; అందు తెనుఁగుతనమునకు పెద్దరిక మీయవలె- అనఁగా తప్పనిసరిగా కావలసినపుడే వెఱపలుకులనుడులు వాడవలెఁగాని, అక్కఱలేని చోట్ల కూడ అవి వాడరాదు. అప్పుడే తెనుఁగుసరిగా తెనుఁగనిపించుకొనఁదగియుండును. సంస్కృతము, ఇంగ్లీషు మొదలగు అక్కఱమాలిన నుడులతోనిండిన పొత్తములలోని తెనుఁగు తెనుఁగనిపించుకొనదగదు.

## పొత్తపుగుడినుడులు

ఏఉద్యమమేని బాగుగా పనిచేయునపుడు దాని వ్రాఁగమియు బాగుగా పెరుఁగును. అందు క్రొత్తనుడులు వచ్చును. మన పొత్తపుగుడికడంక అట్టిదే. దీనితో కొంతవిడి వ్రాఁగమి ఏర్పడినది. అందు ఎవరికితట్టిన నుడులు వారువాడినారు, వానిలో కొన్ని నిలిచియున్నవి, కొన్నిపోయినవి. నేను పొత్తపుగుడి కొలువరినైనను, అంతకంటె హెచ్చుగా తెనుఁగుపలుకు తల్లికొలువరిని. కాన నా నుడివికలో నాకుతట్టినదనుబట్టి, సంస్కృతపు నుడులకుమాఱు నాటినుడులకు కొంతవఱకు పెద్దరిక మిచ్చెదను. ఇంతకుముందు ఎవరును ఇటు చేయకపోవుటచే ఇదిమీకు క్రొత్తగానుండును. అందులకు తెనుఁగు పెంపు కోరవలసిన మీరు నన్ను మన్నింతురుగాక! మచ్చుగా నేను వాడిననాటి నుడులు కొన్ని తెలిపెద.— పొత్తపుగుడి=గ్రంథాలయము; పేరోలగము=మహాసభ; కడంక=ఉద్యమము; నుడివిక=ఉపన్యాసము; మనుగడ=చరిత్ర; పలుకు=భాష; కొలువరి=సేవకుఁడు; తెల=విషయము; మేలెఱుక=దివ్యజ్ఞానము; వ్రాఁగమి= వాఙ్మయము; గుట్టుచదువు=గుప్తవిద్య.

## వ్రాఁతమనుగడ

పొత్తపుగుడులకు పొత్తములతో పొత్తు తప్పదు. పొత్తములకు వ్రాఁతతో పొత్తు తప్పదు. కాని, దాని మనుగడ యిప్పటికిని సరిగా తెలియరాకున్నది. ఇప్పటి తూర్పుపడమర నెఱవాదులలో పెక్కురువ్రాసిన వ్రాఁతలంబట్టి, వ్రాఁత ఏడేనిమిదివేల యేండ్లనుండియే వాడుకలోనికి వచ్చినట్లు కావచ్చును. కాని, సరిగాపరికించి చూచుచో, వ్రాఁత చిరకాలము క్రిందటనే ఉండినట్లు తేటపడును. అంతేకాదు; అది మానిసితోడనే పుట్టినట్లు "నుదుటఁ వ్రాసిన వ్రాఁతకన్నఁగలదా నూఱేండ్లు చింతించినఁ" అనుమాటయే చాటుచున్నది. నుదుటివ్రాఁత బ్రహ్మలిపి; అది మనకు తెలియునుకదా! అని ఎవరేని అనవచ్చును. కాని మనకు తెలియదను కారణముచేత మాత్రము, అది వ్రాఁత కాకపోదు. అదే అననేల? మనలో మిక్కిలి తెలివిగలవారికికూడ తెలియని వ్రాఁతలు పెక్కులుకలవు.

వ్రాఁత ౧ బొమ్మలవ్రాఁత, ౨ గుర్తులవ్రాఁత, 3 వ్రాలవ్రాఁత—అని ముత్తెఱంగు. అందు మఱి కొన్నిమార్పులును ఉండును. బొమ్మల వ్రాఁతయే వ్రాఁతకు మొదటిరూపమని పాశ్చాత్య పండితులు పలువు రనుచున్నారు. కాని వేల్పులేమందికి వ్రాలు నేర్పినట్లు తెలియవచ్చుచున్నది. అవి నానాఁటికి మాఱి, ఇపుడు పలుపలుకులకు గుర్తులుగా ఉన్నవి.

యూరపువారికి గ్రీకులు తొలిగురువులు. వారు ఫోయినీషియా వారివలన వ్రాలు నేర్చుకొని, అవి వారే కనిపెట్టినారని తలంచిరి. కాని, తరువాత పరిశోధింపఁగా వారికంటె ఎంతో ముందే ఈజిప్టువారు, అక్కడులు మొదలగువారు వ్రాఁత కనిపెట్టినట్లు తెలియవచ్చినది. అది నిజమునకు ఇండియానుండియే పైకి వెళ్ళినది. అట్లాంటియనులకు వ్రాఁత బాగుగా వాడుకలో ఉండినట్లు మేలెఱుకవారు తెల్పుచున్నారు.

## తెనుఁగువ్రాఁత

ఇండియాలో హెచ్చుగా వాడువ్రాఁత బ్రాహ్మీవ్రాఁత; దానినుండి గుహావ్రాఁత పుట్టినది; దానినుండి చాళుక్యులవ్రాఁతయు, వేంగివ్రాఁతయు ఏర్పడినవి. వానినుండి వరుసగా పడమటి చాళుక్యుల వ్రాఁతయు, తూర్పుచాళుక్యుల వ్రాఁతయు పొడమినవి. వాని కలగలుపు వ్రాఁతనుండి ప్రాఁతతెనుఁగు వ్రాఁతయు, దానినుండి ఇప్పటి తెనుఁగు వ్రాఁతయు పుట్టినవి. పైకలగలుపు వ్రాఁతనుండియే కన్నడపు వ్రాఁతయు పుట్టుటచే, దానికిని మన తెనుఁగువ్రాఁతకును పొత్తు కానవచ్చుచున్నది. ఇప్పటి తెనుఁగువ్రాలు గుండ్రపాటివి. చేయి బాగుగా నలఁగినవారు తాటాకుల మీఁదఁగాని కాగితముల మీఁదఁగాని పట్టివ్రాసిన తెనుఁగు వ్రాలు ముత్యాలకోవలవలె ముద్దులు మూటఁగట్టుచుండును. కాని, ఇపుడట్లు వ్రాయఁగలవారు ఎక్కడనో కాని కానరారు. మనవ్రాఁత చక్కఁబఱుచుకొనుటకు ఇపుడేని మనము కడంగఁదగదా?

## కొన్ని ప్రాఁతపొత్తములు

ఇప్పటికి వ్రాఁతమనుఁగడను గూర్చి కొంత తెలిసికొంటిమి. ఇఁక, పొత్తపుగుడులకు ప్రాపులగు ప్రాఁతపొత్తములను గూర్చి కొంత తెలిసికొననగు.

“జక్” పొత్తము— ఇది టూకీజగము మనుఁగడ అని ఒకరితలంపు; సృష్టిసూత్రగ్రంథమని ఒరుల తలంపు; ఎప్పటిదో సరిగా తెలియదు; ఇందు కొంత ఈజగము పుట్టకముందే ఉండెనని కొందఱు తలంచుచున్నారు. దీని చెడని పొరటలు ఎట్టివో ఎవరును చెప్పఁజాలరని ఒకరి తలంపు; అవి ఎప్పుడును చెడని తెఱంగున తయారుచేసిన తాటాకులని ఒరుల తలంపు. అంతేకాదు, వానిలో గొప్ప మహిమ కలదఁట! ఎవరేని ఒక ఆకు చేతితో పట్టుకొన్నవెంటనే దానిలోని విషయములు కంటఁగట్టినట్లు అగపడుటయే కాక, అప్పుడే ఆపట్టుకొన్నవారి భాషలో వీలగునంత తేటతెల్లముగా చెప్పినట్లు వినవచ్చునఁట! అసలుపొత్తము గుట్టుచదువు జట్టుపెద్దదగ్గఱ ఉన్నదఁట! అది ఎవరును పైవారు చూడలేదఁట!

“దాని నకలొకటి తోఁబుట్టుజట్టువారి మ్యూజియములో ఉన్నది; ఈ నేలమీఁది మిక్కిలి ప్రాఁతపొత్తమదే కావచ్చును; అదే బ్లావీట్స్కీఅమ్మయు ఆమె శిష్యులు పెక్కురును చూచినారు” అని ఆనీబెసంటమ్మయు, లెడ్బీటర్ యోగియు తెలిపియున్నారు.

దీనిలోని కొంతభాగమునకు బ్లావట్స్కీఅమ్మ చేసిన వ్యాఖ్యానమే “సీక్రెట్ డాక్ట్రిన్”- గుప్తవిద్య- అను మేటిపొత్తము; ఇంగ్లీషువచ్చిన వారందఱును చదువఁదగినది; పెక్కువేల పొత్తముల నిగ్గు దీనిలో కలదని ఆమెవ్రాసిన మాట ముమ్మాటికి నిజము; ఇది చదువుటవలన మనయెఱుక ఎంతయు హెచ్చునని చెప్పఁగలను.

అట్లాంటియనుల మేలిపొత్తములు— ఇవి తొంటి ద్రవిడదేశమునకు చేరిన అట్లాంటియను తెగల వారితోవచ్చి, ఆర్యులకబ్బినవి. ఇవి అథర్వవేదము, శైవగ్రంథములు మొదలగువానికి మూలములు కానోపును.

తొంటి జైనబౌద్ధుల పొత్తములు— ఇవి వేదకాలమునకు ముందే ఉండినవి. ఇవి వారిమఠముల పొత్తపుగుడులలో దొరకవచ్చును.

వేదసంహితలు— ఇవి మొదట కంఠస్థములే అని కొందఱతలంపు; గ్రంథస్థములనియు కొందఱ తలంపు.

బ్రాహ్మణములు, ఆరణ్యకములు— ఇవి సంహితల తరువాతి వేదభాగములు.

మనుస్మృతి— ఇది మిక్కిలి తొంటిస్మృతి; పడమటినాడుల స్మృతులకెల్ల ఇదే మూలము.

జెండ్— అవెస్తా— ఇది పారసీకుల వేదము.

తొంటి యీజిప్టు పొత్తములు— మతము, వైద్యము మొదలగువానిని గూర్చి తెలుపునవి. ప్యారిసులోని "బిబ్లియోథికా నేషనలే" పొత్తపుగుడిలో మిక్కిలి ప్రాఁతపొత్తమని చూపించు పాపిరస్ పొత్తమును, న్యూయార్కులోని 'ఆస్టర్ లైబ్రరీ' లోని యీజిప్టుమందుల పాపిరస్ పొత్తమును వీనిలోనివే. పెంటౌరు వ్రాసిన యీజిప్టుమహాకావ్యము థీబ్సులో ఒకగుడిగోడలపై వ్రాసియుంచినారు. దాని పాపిరస్ నకలొకటి బ్రిటిష్ మ్యూజియమునకు చేరినదఁట.

బాబిలోనియా మహాకావ్యము— ఇది అక్కడులకాలమున సుమీర్ దేశమునకు ఎరిక్ ప్రోలు రాజధానిగా ఉండినపుడు, ఇష్దుబార్ వీరుని చరిత్రము తెలుపుచు వ్రాసిన మిక్కిలి ప్రాఁతపొత్తము; అంతయు దొరకలేదఁట.

అంకెల పొత్తము— ఇది చాల్డియనుల తొల్లింటిపొత్తము.

కబల— ఇది చిన్నఆసియాలోని సిద్ధులగుప్తవిద్య; మొదట కంఠస్థముగానే ఉండె.

తాల్ముద్—ఇదియు చిన్న—ఆసియాసిద్ధుల గుట్టు చదువుపొత్తమే.

సిఫ్రా—జెనియౌటు—ఇది జన్పొత్తమునుబట్టి వ్రాసిన హీబ్రూలగుట్టు చదువుపొత్తము.

సోహర్ (వెలుఁగుపొత్తము)—ఇది రబ్బిసైమియోన్ వ్రాసిన గొప్పగుట్టు చదువుపొత్తము.

ఎఱుకపొత్తము—ఇది సోలొమన్ వ్రాసినది.

లోలోపొత్తములు—చీనాతొలికాఁపుల మిక్కిలి ప్రాఁతవ్రాఁతలు; వీనిలో ఒకటి రెండు మాత్రము దొరకినవఁట.

షి—కింగ్, షు—కింగ్—చీనావారి ప్రాఁతపొత్తములు.

స్తన్—గ్యూర్—ఇది టిబెట్టువారి ప్రాఁతపొత్తము.

హిందూపురాణములు—ఇవి జన్పొత్తమునుబట్టి వ్రాసినవని కొందఱనుచున్నారు.

పొపొల్—వుహ్—ఇది అమెరికాలోని గొతెమలనాటియందలి క్విచెతెగవారిగుట్టు చదువుపొత్తము.

ఇవిగాక, ప్రాఁతతమిళపొత్తములు మొదలగునవి ఇంకను పెక్కులుకలవు. పైని తెలిపిన పొత్తములలో పెక్కింటినిగూర్చి మనకు తెలియదు. నిజమునకు, ప్రయత్నించినఁగాని మనఊరిలోఉన్న పొత్తములనుగూర్చికూడ మనకు తెలియనిచో, పైపొత్తములమాట చెప్పనేల? తెలిసినపొత్తములే చదువనిచో తెలియనివానినిగూర్చి ఎత్తుటఏల? ప్రయత్నించినను కొన్ని మనకుదొరకవు; దొరకినను, కొన్ని మనకు తెలియవు; కొన్ని మనము కొనలేము. ఇట్లు పెక్కుతెఱంగుల ఉన్నపొత్తములలో కొన్నియైనను మనము చదువఁజాలకపోవుట తటస్థించుచున్నది. ఇట్టిచో మంచివని తెలిసినపొత్తములైనను పనిపట్టి చదివినఁగాని మనయెఱుక పెంపొందుట ఎట్లు? కాన, ఆపొత్తములను వాడుకొనుటయే బుద్ధిమంతులపని.

## పోయిననొన్ని ప్రాంతపొత్తములు

వేదభాగములు—కొన్ని యిపుడు కానరాకున్నవని కొందఱనుచున్నారు. అవి ఋషులు దాఁచియుంచినారని కొందఱు తెలుపుచున్నారు.

స్మృత్యాదిభాగములు—మనుస్మృతి, దండనీతి మొదలగు పొత్తములలో తగ్గిపోయినవి.

పెక్కు హెర్మిస్ పొత్తములు—ఇవి ౧౧౦౦, ౧౭౦౦, ౨౦,౦౦౦ అని వారువారు చెప్పుచున్నారు.

మనిథోపొత్తములు—3,౬౦౦; వీనిలో ఏవేని ఎందేని ఇపుడు కలవో లేవో తెలియదు.

శారీరనిర్మాణశాస్త్రము—ఇది యీజిప్టు మొదటివంశములోని రెండవ ఱేఁడగు అథోథి వ్రాసినది.

జ్యోతిషసిద్ధాంతజాతకభాగములు—ఇవి నెకోరాజు వ్రాసినవి.

భూగోళశాస్త్రము—ఇది బ్లంటసన్, సిక్కరన్—అనువారు వ్రాసినది.

పొగలవైద్యశాస్త్రము—మిక్కిలి పేరుపొందిన యీజిప్టుమహావైద్యుఁడైన ఇయాచస్ వ్రాసినది.

దివ్యగ్రంథము—ఇది యీజిప్టుదేవతలనందఱను గూర్చియు తెలుపు రహస్యజీవితచరిత్ర; ఓరసిమోహస్ అను మాఱుపేరుగల అపోలోనిడేస్ వ్రాసినదని థియోపిలస్ తెలిపినాఁడు.

గుప్తవిద్య—ఇది అనేకరహస్యములను, యుగములలెక్కలను తెలుపుపొత్తమనియు, దీనిని గూర్చి తనకు తెలియుననియు, అమ్మియానస్ మార్సెలినస్ నుడువుచున్నాఁడు.

న్యూమాపొత్తములు—ఇవి అతనిగోరీలో దొరకఁగా కాల్చివేసిరఁట!

ఇట్లు లెక్కకుచిక్కని పొత్తములెన్నియో అన్ని తెఱంగుల యెఱుకకు ఆటపట్టులయినవి పలునాడులలో పలుచందముల పోయినవి. ఇటులైని వానిలో కొన్నిటినిగూర్చి పొత్తపుగుడి మనుగడలో తెలియవచ్చును.

ఈనడుమ ఎల్లనాడులలోను ఉన్న వేలువేలురకముల పొత్తముల మొత్తము సుమారు 3,౭౦,౦౦,౦౦౦ అని అంచనావేసినారు; ఇప్పటికి వానిలో మఱికొన్ని చేరియుండును. పుట్టిన పొత్తములన్నియు నిలిచియుండినచో, ఇంకను ఎన్ని అయి ఉండెడివో!

## పొత్తపుగుడి మనుగడ

మనకిప్పటికి పొత్తములను గూర్చి కొంత తెలిసినది. కాన, ఇపుడు పొత్తపుగుడి మనుగడను గూర్చి ముచ్చటించుకొనవచ్చును.

తలఁపులను తెలుపుటకు పలుకులవలెనే వ్రాఁతయు ఒక వెరవని మన మెఱుంగుదుము. గుర్తులు వ్రాఁతలోనివే అనియు మనకు తెలియును. కాన, మొట్టమొదటి పొత్తపుగుడి ఎల్లఱేఁడే పెట్టినాఁడనగు. జగత్పొత్తమే గుర్తుల పొత్తమగుచో ఎల్లఱుని పొత్తపుగుడిలోని పొత్తములు గుర్తుల పొత్తములగుట వింత కాదు. ఒక్కొకచుక్క ఒక్కొకపొరట; కొన్నిచుక్కలగమి ఒకపొత్తము; అట్టి పొత్తముల మొత్తమే ఎల్లఱుని చుక్కల పొత్తపుగుడి. అందలి పొత్తములు చదువఁగలవారికి జగము మనుగడ కంటఁగట్టినట్లు కానవచ్చును. కాని, అట్టివారు మనలో ఏరీ? కాన, అది మందికి పనికివచ్చునది కాదు.

నింగిమీఁద ఎట్లో నేలమీఁదను అట్లే — అను హెర్మెస్ మాట మగఱాలమాట. ఎఱుక హెచ్చిన కొలఁదిని దాని విలువయు హెచ్చుగా ఎఱుఁగ వీలగును. మొదట మింటిమీఁద జరుగనిదేదియు మంటిమీఁద జరుగదని అది తెలుపుచున్నది. నిజమునకు నింగివలెనే నేలయు ఎల్లని పొత్తపుగుడియే. ఒక్కొకవస్తువు ఒక్కొక పొరట; ఒక్కొక తెఱంగు ఉరువులగమి ఒక్కొక పొత్తము; అట్టి పొత్త

ములమొత్తమే కడలితోడి నేలపొత్తపుగుడి; ఇది అరయిక పస గలవారికి బాగుగా పనికివచ్చును; తక్కినవారికి అంతగా తోడ్పడదు.

అయినను, ఇట ఒకమాట చెప్పవలె. ఎల్లఱైన నింగినేల పొత్తపుగుడులు కొంచెముగానో హెచ్చుగానో వాడుకొని అందలి పొత్తపు తీర్పరుల తోడ్పాటుకూడ పొంది, ఎఱుక గడించుకొనినవారు వ్రాసినవే మన మేలిపొత్తములగుటచే, మనలో కొందఱైన తగినవారు అటుచేయ కడంగుట కడుంగడు మంచిది.

ఇంక, మందిపొత్తపుగుడులను గూర్చి పరికింతము. ఇందు, మొదట వెలినాడుల వానిని గూర్చియు, పిదప ఇండియావానిని గూర్చియు, తుదకు తెనుఁగునాటివానిని గూర్చియు, ముచ్చటించుకొందము. అందు వాని ప్రాఁతమనుగడ తొలుత కైకొందము. ఈమనుగడ తెలుపుటలో చరిత్రతోపాటు, పెద్దలమాటయు ప్రమాణముగానే గ్రహింతును- అని మీరు గుర్తింతురుగాక !

## వెలినాడుల పొత్తపుగుడి మనుగడ - ప్రాఁతది

మే. + అట్లాంటిస్ ఖండము— ఇదే కుశద్వీపము. సుమారు కోటియేండ్లు ఉండినను, తమలోనే కొందఱు ఇది ఉండినట్లు తెలుపుచు పొత్తములు వ్రాసినను, మొత్తముమీఁద పడమటి తెల్లనెఱవాదులు దీని ఉనికినిగూర్చి నమ్మకున్నారు! మేలెఱుకవారు, సుమారు ౧౦ లక్షల యేండ్లక్రిందట ఇప్పటి యూరోపియను నాగరకతను మించిన నాగరకత, అట్లాంటిక్ పెన్కడలిలో మునిఁగిపోయిన- ఆఖండమున వెలయుచుండెనని, తెలుపుచున్నారు. అంతేకాదు. అందు పొత్తపుగుడు లుండినట్లును, అవి ఇపుడు కడలికడుపులో ఉన్నట్లును, అవి పైకి తీయఁగలిగినమగవారు ఉండి, తీయుచో, వారి సందేహములెల్ల తీఱుననియును వారు తెలుపుచున్నారు. ఇప్పటికి పోయిన తక్కిన యెల్లపొత్తముల విలువకంటె అట్లాంటిస్ ఖండపు పొత్తముల విలువయే ఎన్నోరెట్లు హెచ్చఁట! అవి ఎప్పుడేని పైకివచ్చునేమో!

మే. మంగోలియా— ఇది ఇప్పటికి సుమారు ౨౫ వేల యేండ్లక్రిందట, సుమారు ౩౦—౪౦ వేల యేండ్లు సాగిన ఆర్యుల మహాసామ్రాజ్యమునకు పట్టుకొమ్మగా ఉండిన "మంబల్లా" మహానగరమునకు మనికిపట్టగు దేశము. అపుడు అక్కడ పొత్తపుగుడు లుండెనని తలంపనగు.

మే. టిబెట్టు— ఇదే త్రివిష్టపమని కొందఱందురు. ఇందు అడవులలోని నేలమాలియలలో ఎప్పుడో పెద్దపొత్తపుగుడులు పెట్టినారఁట! మఱియు, తమంతటతాము ఆకులమీఁద అచ్చుపడు వ్రాఁతలుగల "కాఙ్ బామ్" అను చెట్టుపొత్తపుగుడి వెలసినదఁట!

మే. ఇష్మోనియా (రాతిప్రోలు)—దీనిదగ్గఱి నేలమాలెలో దాఁచిన పొత్తపుగుడికలదఁట! అందు, లెక్కలేనిపొత్తములును, వ్రాఁతకాగితపు చుట్టలును, కలవఁట!

మే. పాలస్తీను—ఇందలి పొత్తపుగుడులలోని పొత్తములనుండి క్రైస్తవమతారంభమునుగూర్చిన విషయములు న్యూయార్కులోని ఏ. ఎల్. రాసన్‌పండితుఁడు వ్రాసికొనెనఁట! అవి తరుణమువచ్చినపుడు పైకివచ్చునఁట!

చాల్డియా—ఇది ఇప్పటి మెసొపొటేమియా; టైగ్రిస్ యూఫ్రటీస్ నదుల నడిమిలోయ. ఇక్కడకు తొంటి చోళదేశమునుండి కొందఱు చేరి, తమదేశముపేరే దీనికిపెట్టిరి. కాన, 'చోళదేశ' పదమే నాఁటికి మాఱి, 'చాల్డియా' అయినదని తలంపనగును. ఏటిలోయలుమందికి మంచి మనికిపట్టులగుటచే పెక్కురు వానిపై కన్నువేసి, అందుచేర కడంగుదురు. గంగా, సింధు, నీల(నైల్) నదుల లోయలు మొదలగునవి ఇట్టివే. కాన, చాల్డియాలోయలో మొట్టమొదట తురేనియనులును, పిదప అక్కేడియనులును, పదంపడి చోళదేశమువారును, తరువాత ఆర్యన్—సెమిటిక్ తెగలును చేరి, అక్కడనిలిచి, పెద్దఱికము

---

+ మే. ఇది మేలెఱుకవారి పొత్తములనుబట్టి తెలిసినదనుటకు గుర్తు.

చేసి, పేరుపొంది, తఱికడుపులోపడి-రూపుమాసినట్లు చాల్డియామనుగడ అరయఁగా తేలినది. మంది డిందినను వారిపనులు మఱికొన్ని వేలయేండ్లవఱకును మనుననియు అదేచాటుచున్నది.

దవ్వుచూపునకు దొదవ్వులనుండు తెల్లనెఱవాదులు పెక్కురు, చాల్డియాలో క్రిందిపట్టున తేటేండ్లుగాఁ ఉండిన సుమేరియనులే-తమ్ము తలదిమ్ముపడునట్లుచేయు యూరోపియన్ మహానాగరతకు తొలుదొలుత సంచకరువుబిచ్చము పెట్టినవారని వారిని బట్టులవలె పొగడుచున్నారు. ఇంతకుముందు తొంటియీజిప్టువారిని వీరికంటెముందటివారు ఇట్లే పొగడియుండిరి. తమకంటికగపడినఁగాని ఏదియు నమ్మమనువారి సిద్ధాంతములిట్లే మాఱుచుండును. పడమటినెఱవాదులకు పలువురకు దవ్వుచూపులేదనుటకు కతమిదే. వారిసిద్ధాంతములె నమ్ముచు, నిజమెఱుంగకడంగక, ఇంగ్లీషు చదువుకొనిన మనవారు కొందఱు తప్పుత్రోవ త్రొక్కుచున్నారు. పడమటినెఱవాదులలో నేర్పరులు తమసిద్ధాంతములు తాఱుమాఱగుచుండుట కనిపెట్టి, ఇటీవల తమకు తెలియని తెలలనుగూర్చి 'మాకేమియు తెలియదు.' అని చెప్పఁదొడగినారు. అది కొంత మేలే. ఎఱుకగల పడమటినెఱవాదులు—కల్నల్ ఆల్ కాట్టు, బ్లావట్ స్కీ—అమ్మ, ఆనీబెసెంటమ్మ మొదలగువారు—పెద్దలమాటలను నమ్మి, ఇండియా గొప్పఁదనమెఱింగి, తప్పుదారినిపట్టిన మనవారికి ఎఱుకకలిగింప పాటుపడి, కొందఱను ఆతప్పుదారినుండి తప్పించి, మంచిదారికి మరల్చినారు. వారుచేసిన మేలును దివ్యజ్ఞాన సమాజసభ్యులము కాని వారముకూడ మఱవరాదు.

చాల్డియాలో పైవాటాకు "అక్కడ్"+ అనియు, క్రిందివాటాకు "సుమేర్" అనియు పేర్లు. "అక్కడ్" కొండలపట్టు; అక్కడివారికి అక్కేడియనులని పేరు. అక్కడులను పేరుకలదు. అది సుమేరుదేశమును ఏలినవారి పేరని చాల్డియా మనుగడవలన తెలియుచున్నది. అక్కడ్ వాటాలో కొంత కాలముండుటవలన ఈ పేరు రానోపును. నిజమునకు అక్కడులు తొలిచోళదేశస్థులతోవచ్చిన ఆర్యులని బ్లావట్ స్కీ-అమ్మ తలంచినట్లు కానవచ్చుచున్నది. అక్కడ్ వాటమే పిదప అస్సీరియా అయినది. దాని మొదటిరాజధాని సిప్పర్; రెండవది నినెవే. "సుమేర్" పల్లపుపట్టు; అందలివారే సుమేరియనులు. సుమేర్ వాటాకు సుమేరియా అనియు, బాబిలోనియా అనియు, తరువాత పేర్లువచ్చినవి. దీని వరుసగా ఉరికి, ఉర్ (ఊరు) బాబిలు (బాబిలన్)—అను ఊళ్ళు రాజధానులయ్యె. ఇందే మొదటి సామ్రాజ్యము వెలసె.

అక్కడులు ౬, ౭ వేలయేండ్లక్రిందటివారు కావచ్చునని పడమటి నెఱవాదులనుచున్నారు. మేలెఱుక వ్రాఁతలనుబట్టి సుమారు ౧౫ వేలయేండ్లక్రిందటనే వారక్కడకు వెళ్ళినట్లుకనఁబడుచున్నది. సామ్రాజ్యమేర్పడుటకు కొంతకాలము పట్టియుండుగాక! సుమేరియనుల నగరులలోను, గుడులలోను, కొన్ని పొత్తపుగుడులు బయలుపడినవి. వానిలోనిమట్టిపలకలమీఁద మిక్కిలి చిన్నవ్రాలు కలవు; అందే కొన్ని అద్దములును కనఁబడినవి; వానితోచూచిన చిన్నవి పెద్దవిగా కానవచ్చును; కాన, అవి ఆచిన్న వ్రాలు చదువుటకే వాడిరని తలంపనగును. ఆపొత్తపుగుడులు ఇప్పటికి సుమారు ౫,౯౪౦ ఏండ్లక్రిందటి వనుచున్నారు. గోట్టములమీఁద కొన్నివ్రాఁతలుకలవు.

సుమేరియనుల తరువాత, మొదటిసార్గను—అను సెమిటిక్ తెగ ఱేఁడు చాల్డియాలో "సిప్పర్" రాజధానిగా రాచఱికముచేసె; అతఁడు పెట్టిన పొత్తపుగుడి అతని తరువాత ౩౨౦౦ ఏండ్లకు దొరకె; అది ఇప్పటికి సుమారు ౫౭౪౦ ఏండ్లక్రిందట ఉండినదఁట; అందలి జ్యోతిషసిద్ధాంత జాతకభాగములను గూర్చిన పెక్కుపొత్తములు పెక్కురు వ్రాసికొనిరని తెలియవచ్చుచున్నది.

నినవే— ఇది అలెగ్జాండ్రియావలెనే పొత్తపుగుడివలన పేరుపొందిన ప్రోలు. ఇందలి పొత్తపుగుడిలోని వ్రాఁత మట్టిపలకలు ౧౯౦౧ లోనే ౧౦,౦౦౦ లకు మించెననియు, అది నానాఁటికి

+ 'అక్కడ్' 'ఎక్కడు' కానోవునని నామిత్రులగు శ్రీగొబ్బూరు వేంకటానందరాఘవరావు గారికి తట్టినది.

హెచ్చుచున్నవనియు వ్రాసినారు. ఈపొత్తపుగుడి అస్సీరియా ఱేఁడగు అస్సుర్-బనిపాలుని యేలుబడికాలమున (క్రీ. పూ. ౬౬౮-౬౨౬) ఏర్పడినది. ఇది దొరకుటవలన అలెగ్జాండ్రియా పొత్తపుగుడి పోయినలోటు చాలవఱకు తీఱినట్లు తలంచుచున్నారు.

చాల్డియా (సుమేరియా)—అస్సీరియాలవారికంటె చెడని హెచ్చువ్రాఁతలను మనకిచ్చిపోయినవారు మఱొకరులేరని ఒక ఫ్రెంచి అస్సీరియాతీర్పరి తనసంతసమును వెల్లడించినాఁడఁట!

ఈజిప్టు— ఇది అలెగ్జాండ్రియా పొత్తపుగుడివలన జగమందంతటను పేరుమోసినదేశము. అందలి పొత్తములు ౪ లక్షలని కొందఱును, ౭ లక్షలని కొందఱును తెలుపుచున్నారు. అవి సైపెరన్ పాపిరస్— అను చెట్టుబెరడునుండి తయారుచేసిన కాగితముమీఁద వ్రాసిరఁట. పాపిరస్ అనఁగా కాగితము; దానినుండియే "పేపరు" నుడి వచ్చినది. పాపిరస్సు ఎప్పుడును చెడని నాణెమగు కాగితమఁట: ఇప్పటి నేర్పరులు దానివంటి కాగితము తయారు చేయఁజాలకున్నారు. ఈజిప్టువారు మిక్కిలి తెలివిగలవారు; కాన, అన్ని తెఱలను గూర్చియు పొత్తములు వ్రాసిరి; అందు గుట్టువదువు పొత్తములు పెక్కులుండెను; అవి తరువాత వెలసిన క్రైస్తవ మహమ్మదీయ మతములవారికి విరుద్ధములగుటచే ఆమతస్థులు వానితోపాటు క్రీ. పూ. ౪౮ లోను, క్రీ. వె. ౩౯౦ లోను, ౬౪౦ లోను కాల్చివేసిరి. అయినను ఆ పొత్తపుగుడిలో నుండినవారు కొన్ని పొత్తములు దాఁచియుంచిరని కొందఱు తెలుపుచున్నారు.

థీబ్స్‌నగరములోని అమన్‌రాగుడి, ఈజిప్టు వ్రాఁతల సెనుపొత్తపుగుడి; అది రెండువేలయేండ్లయీజిప్టు మనుగడను తెలుపునఁట.

మే. నిజమునకు, ఈజిప్టు సుమారు ౫౦ వేల యేండ్ల క్రిందటనే అట్లాంటియనుల యేలుబడిలో మొట్టమొదట మంచి నాజూకునాడయ్యెననియు, సుమారు ౭౭ వేల యేండ్లక్రిందటి నీటిముంపువలన మిన్నఁటుచుండిన ఆనాజూకుతనము రూపుమాసెననియు, పిదప కొంతతడి నీగ్రోయిడులును, ఆవెనుక మఱికొంతతడి అట్లాంటియనులును, ఆపిమ్మట ఆర్యులును (పాండ్యదేశస్థులతో వచ్చినవారు) ఏలిరనియు, మే లెఱుక వ్రాఁతలవలన తెలియవచ్చుచున్నది. కాన, హైని చెప్పినది తుదిరాచఱికము నాఁటిది. అదియు మేలెఱుకవ్రాఁతలనుబట్టి సుమారు పదునైదువేలయేండ్ల క్రిందటినుండి వచ్చినట్లు తేలును. అంతకుముందు వెలసిన అట్లాంటియనుల రాచఱికముననే ఈజిప్టులో పొత్తపుగుడులుండె ననుకొనఁగు. కాని, అవిఏమైన మిగిలియున్నవో లేవో తెలియదు.

బాక్ట్రియా— ఇదే బాహ్లికము; ఆర్యుల వలసపట్టు; ఇక్కడనుండియే కొందఱు ఇండియాకు వచ్చిరి; మఱికొందఱు ఇరాను (పారసీక) దేశమునకు వెళ్ళిరి. జెండ్-అవెస్తా ఇక్కడనే పుట్టినట్లు కానవచ్చును. కాన, ఇక్కడ అపుడు పొత్తపుగుడులు కొన్నియేని చిన్నవైన ఉండెననుకొననగు.

చీనా— ఇది తొంటినాడులలో ఒకటి. ఇందు నాజూకుతనము కొన్ని వేల యేండ్లక్రిందటనే వెలసినట్లు ఆనాటి మనుగడ తెలుపుచున్నది. సుమారు ౪ వేల యేండ్లక్రిందటనే దీనిలో పొత్తపుగుడులు బయలుదేఱె ననుకొనవచ్చును క్రీ. పూ. ౨౧౩లో షిహ్‌వంగడపు తొలిఱేఁడు లెక్కలేని పొత్తములు కాల్పించెనఁట.

పారసీకము— ఇందు సామ్రాజ్యములు వెలసి, సాగె; కాన, దీనిలో పొత్తపుగుడులుండెననుటకు సందియపడ నక్కఱలేదు.

గ్రీసు— ఇది యిప్పటి పడమటి నాజూకుతనమునకు మొదట నడిసన్ననాడు. ఇఁక దీనిలో పొత్తపుగుడులు లేకుండుటెట్లు ?

ఇటలీ— రోమన్‌మహాసామ్రాజ్యము పెంపొంది-పేరుకాంచిన ఈదేశమున గ్రంధాలయములుండెనని వేఱే చెప్పనక్కఱలేదు. పిదప ౧౪౧౭ లో అప్పటి క్రైస్తవగురువు ౩౪౦ పొత్తములతో వాటికన్

పొత్తపుగుడి పెట్టె; ౧౪౫౫ నాటికి అందు ౧౦౦౦ పొత్తములుచేరె; అది నానాటికి పెరిగె- లుకల్లస్ మొదటిమంది పొత్తపుగుడిపెట్టె. ఆగస్టస్ చక్రవర్తికాలమున గ్రంథాలయోద్యమము రాజ్యాంగమున ప్రత్యేకశాఖ అయ్యె; పొత్తములు అఱలలో ఉంచుటయు, మహాపురుషుల బొమ్మలు పొత్తపుగుడులలో పెట్టుటయు అప్పుడే మొదలయ్యె.

బాగ్దాదు—ఇందు ఖలీఫులు పొత్తపుగుడులు పోషించుచుండెడివారు. "అరేబియన్ రాత్రులు" మొదలగుపొత్తములు అప్పుడుపుట్టినవే.

స్పెయిను—ఈదేశము కొంత కాలము మహమ్మదీయుల యేలుబడిక్రింద ఉండె. అపుడు కార్డోవా సుల్తాను 3 వ అబ్దుల్‌రహిమాను పెట్టిన పొత్తపుగుడి మిక్కిలి పేరుపొందె; అందు ౪ లక్షల పొత్తములుండెడివి.

గ్రనడాలో ౧౦ వ శతాబ్దిని మూరులయేలుబడి మిన్నంటుచుండె. అపుడచ్చటి పొత్తపుగుడిలో ౬ లక్షల పొత్తములుండెనని చెప్పుదురు. అందు ౮౦ వేలు అరబ్బీవ్రాతపొత్తములు; అవి పెక్కులు వ్రాతపొత్తముల తర్జుమాలు. అట్టి గొప్పపొత్తపుగుడిని కార్డినల్ క్సిమేన్స్ మంటలపాలుచేసెనట!

జపాను—ఇందు ౮ శతాబ్ది మొదలు ౧౧ శతాబ్దివఱకు పద్యగద్యకావ్యములు వ్రాసిరట; అది వానికి బంగారుతళి; ఆషికాగనగరమందు మొదటిపొత్తపుగుడి ఏర్పడినదందురు; ౧౨ వ శతాబ్దిని ఒక పొత్తపుగుడియు, ౧౮౬౨లో మఱొకటియు వెలువడినవి.

ఐర్లాండు—ఇచట ౧౦౨౦ లో తొలి పొత్తపుగుడి పుట్టినదట. పిదప థామస్‌డేవిస్ పొత్తపుగుడులు నెలకొల్పె. ౧౮౮౪ లో ౨ మంది పొత్తపుగుడులు వెలసె. ౧౭౦౩ నుండి కార్నిజిట్రస్టువారి సాయమువలన పొత్తపుగుడులు పెరిగినవి.

బెల్జియము—ఇక్కడ ౧౪౨౫ లో మొదటిపొత్తపుగుడి లోవైన్‌యూనివర్సిటీలో ఏర్పడెనట. పిదప, ఎరీషియన్ ఫ్యూటయేసన్ ప్రయత్నమున ఘెంటులోను-లోవైనులోను మంది పొత్తపుగుడులు వెలసె. ౧౭౭౨ లో మేరీథేరిసా తనపూర్వులగు బర్గండీప్రభువుల పొత్తపుగుడి మందికిచ్చివేసె. ౧౮౦౦ ప్రాంతములలో పెద్ద పొత్తపుగుడులు మ్యూనిసిపల్ వారి పెద్దఱికముక్రిందికి వచ్చె. అప్పటికి లోవైను పా. గు. లో ౧,౫౦,౦౦౦ పొత్తములుచేరె. ౧౮౩౭ లో బ్రూసెల్స్‌నగరమున రాయల్ లైబ్రరీ ఏర్పడినది; దీనిలో బర్గండీవారి పొత్తములెల్ల చేరినవి. ౧౮౫౦-౬౨ నడుమ ఒక్క గ్రంథాలయముకూడ ఏర్పడలేదట! ౧౮౬౪లో 'టీచింగ్ లీగ్' అనుసంస్థ ఏర్పడి, ఫ్రెంచివారికొఱకు సంచార గ్రంథాలయము లేర్పాటుచేసె. పిదప ఫ్లెమిష్‌వారికొఱకు విల్లెమ్‌ఫాండ్స్, డేవిస్‌ఫాండ్స్ అను ౨ సంస్థలు బయలుదేఱె. ౧౯౧౧ లో మూడుసంస్థలును కలసిపోయె. ౧౯౧౪ లో పా. గు. ౧౪౦౪; ౧౯౨౯లో ౨,౧౮౮. వీనికన్నింటికిని దొరతనపువారితో పొత్తుకలదు.

స్వీడను—౧౮౩౦ ప్రాంతమున మంది. పా. గు. చట్టముపుట్టె; కాని, దానినిబట్టి పని జరుగలేదు. ౧౮౩౫ లో కారల్‌స్టాండ్ పట్టణమున ఒక గ్రంథాలయసంఘ మేర్పడె. ౧౮౬౦ లో సిల్‌జస్టామ్- అను గ్రంథాలయాభిమాని అమెరికాకు వెళ్ళివచ్చినపిమ్మట పా. గు. కదంక మొదలయ్యె. ౧౯౦౫లో దొరతనమువారు విరాళములీయ ఇయ్యకొనిరి. ౧౯౨౬ లో ౧౧౮౧ మంది గ్రంథాలయములకు గ్రాంటు లిచ్చిరి. స్టాక్‌హోమ్ గ్రంథాలయమునకు వాలెన్‌బర్గ్ దంపతులు రు ౪ లక్షలు విరాళమిచ్చిరి; మఱొక సంస్థనుండి రు ౨,౫౦,౦౦౦ వచ్చె. గోటెన్‌బర్గ్‌లైబ్రరీ ప్రత్యేకముగా శాస్త్రపరిశోధనమున కేర్పడినది.

బ్రిటను—ఇంగ్లాండులో ౧౫వ శతాబ్దిని ఏర్పడిన 'లాలైబ్రరీ' మిక్కిలిప్రాతది. ౧౬ వ శతాబ్దిలో ఇన్నర్ టెంపిల్ పా. గు. ఏర్పడినది. ౧౮౫౦ లో మంది పా. గుడులేర్పఱచుటకు చట్టముపుట్టె ౧౮౮౬ లో పా. గు. ౧౪౬. ౧౯౧౦ లో ౫౫౬; అందు ౧౬౩ కార్నిజీట్రస్టుసాయమున ౧౯౦౦లో ఇంగ్లాండు-స్కాట్లాండులలో ఏర్పడిన పట్టణగ్రంథాలయములు.

డెన్మార్కు—ఇట పా. గు. క. ౧౮౫౦ లో మొదలిడిరి. పిదప, అది దొరతనమువారి క్రిందికివచ్చె.

అమెరికాసంయుక్త రాష్ట్రములు—ఇందు రాజధానియగు వాషింగ్టన్ నగరమున ౧౮౧౪ కు ముందే రు ౧౫౦౦లకు ౧౦౦౦ పొత్తములు కొని, కాంగ్రెసు పా. గు. ఏర్పాటుచేసిరి. కాని, అది కొన్నాళ్ళకే కాలిపోయినది. ౧౮౧౫ లో రు ౭౨వేలకు ౭వేల పొత్తములుకొని, మరల అది నిలిపిరి. ౧౮౫౧ లో పొత్తములు ౫౫వేలయ్యె; కాని, మరల వానిలో ౩౬వేలు అగ్నిపాలయ్యె. పిదప, రు౩లక్షలకు ౬౦ వేల పొత్తములుకొని, అందుచేర్చిరి. ౧౮౭౧ లో ౪౦వేల పొత్తములతో స్మితోనియన్ ఇన్‌స్టిట్యూటు పా. గు. దానితో చేరె. ౧౮౯౭ లో కాంగ్రెసు లైబ్రరీకి కట్టిన గొప్పమేడ విలువ రు ౧౯,౦౪,౧౦,౦౦౦; దానిచోటు ఖరీదు రు ౧౬,౫౫,౦౦౦. ౧౯౧౬ లో దాని పెద్దకు ఏఁడాది జీతము రు ౧౯,౫౦౦; దానిలో పనిచేయువారు ౫౨౩ రు; ఒకసారి ౧౦౦౦ మంది చదువుకొనుటకు వలయు చక్కని యేర్పాట్లుచేసిరి; అందలి పొత్తములు ౨౧,౨౮,౨౫౫; పటములు ౧,౨౯,౦౦౦; వార్తాపత్రికలు ౮౯౪; తక్కిన పత్రికలు ౬,౬౭౯. తరువాత, పొత్తములు ౨౫ లక్షలయ్యె.

క్రొత్తతీరున పా. గు. నడపుటకు దారిచూపి, ౧౮౭౩ నుండి ౧౯౦౪ వఱకు తాను పనిచేసి చూపిన దిట్ట డాక్టరు మెల్విడేవీ మేటి పా. గు. కొలువరి.

ఇండియానెపోలిస్— అను పట్టణమున సుమారు ౭౫ ఏండ్లక్రిందట ఒక పా. గు. పెట్టిరి; మఱి నాలుగేండ్లలో అది మంది పా. గు. అయినది. అప్పటికి అందలి పొత్తములు ౩,౬౪౯; పిదప మఱి ౮ వేలు చేరె. ౧౮౭౨ లో చార్లెస్ ఈవాన్స్ దానిలో పొత్తపుతీర్పరి అయ్యె. ౧౮౯౨ లో ఏలీజా గోర్డన్ బ్రౌనింగు అను నవలామిన్న ఆపనిలో ప్రవేశించి, ౧౯౧౨ వఱకు పాటుపడె. అప్పటికి పొత్తములు ౨,౧౨,౦౦౦; లక్షలకొలఁదిమందికి అది మేలుచేయుచుండె.

ఇట్లే ఫ్రాన్సు, జర్మని, రష్యా మొదలగు నాడులలోకూడ పా. గుడులుండి యుండును.

మతపువెఱ్ఱిచే పలువురు ఎన్నో పొత్తములను, ఎన్నో పా. గుడులను పాడుచేసిరి; ఎన్నో అజ్ఞానుల అశ్రద్ధవలన పాడైనవి; ఎన్నో మంటల పాలయినవి; ఎన్నో మంటిపాలైనవి; ఎన్నో నీటిపాలైనవి; ఎన్నో పురుగుల పాలయినవి; ఎన్నో ఎలుకలపాలయినవి. ఇట్లు పొత్తములు పాడుగాక నిలిచియున్నచో అవి మనకు ఎంతయో ఎఱుకకఱపి, ఎంతో పనికివచ్చెడివి. డయోక్లెటియస్ రహస్యకళలను గూర్చి తెలుపు పొత్తపుగుడులు తనకు వీలగునవెల్ల కాల్చివేసె. వానివలెనే సెవరస్సు, లియో ఇసరెరస్ మొదలగు మతపువెఱ్ఱి మొఱకులు అలెగ్జాండ్రియా, కాన్‌స్టాంటినోపిలు మొదలగుచోట్ల లక్షలకొలఁది పొత్తములు రూపుమాపిరి. ఇవి దేవునికి మానవునికిని గల పొత్తు తెలిపి, ఇరువురనుచేర్చి పోయికూర్చు వెరవులుచూపు మతముపేర జరగిన ఘోరములు! ఇంతకు దీనికి వింతపడ నక్కఱలేదు. మతపు వెఱ్ఱిచే ఒడలెఱుఁగక, తోడివారిని చిత్రవధలుచేసి- కాల్చివేయుటకు వెనుకదీయక- మనుష్యులమని చెప్పుకొనుటకు సిగ్గుపడని ఘోరరాక్షసులకు, ఉసురులేని పొత్తములు పాడుచేయుట- గుడిమ్రింగు వానికి గుడిలోని లింగము పిండివడియమగునట్లేకదా? ఎఱుకమాలిన ఆ కఱకు మొఱకుల దుడుసుచేఁతల వలన ఎంత యెఱుక ఎగిరిపోయెనో ఎవరికెఱుక?

పోయినవి పోఁగా, మిగిలియున్న తొంటినడితఱుల పొత్తములు సైతము చదువక, దొరకెడి యెఱుకకూడ గడింప కడంగక, తమయెఱుక కొఱవడఁజేసికొని, అట్టి యెఱుకతో తామే తెలివిగలవారమనుకొని — అదే పైవారికిని గుఱిగా చేయఁజూచు మొఱకు లన్నినాడులలోను ఇప్పుడును ఉన్నారు. అట్టివారినిగూర్చి మనము మెలఁకువతో మెలఁగవలె; మనమును వారి యెమఱుపాటునకు లోఁబడకుండునట్లు కాచుకొనవలె. అటుచేయనిచో, మనయెఱుకయు సరిఅయినది కాఁజాలదు; పెరుఁగఁజాలదు.

## పెఱనాడుల పొత్తపుగుడి మనుగడ—ఇప్పటిది

పొ. గు. కదంక పడమటినాడులలో ఇపుడు బాగుగా సాగుచున్నదని ఇంతకుముందే మన మనుకొంటిమి. కాన, దానివలన వలయునది నేర్చుకొనుటకు దాని మనుగడ టూకీగానైనను తెలిసికొననగు.

ఇంగ్లాండు— బ్లూమ్స్బరీ జాతీయకేంద్ర గ్రంథాలయము లండనునగరమున కార్నీజీ దాన సాహాయ్యమున ఏర్పడినది; ఇందలి పొత్తములు ౫౦ లక్షలు; దీనినుండి ౧౫౦ పొ. గుడులకు పొత్తములు వెళ్ళుచుండును. అంతేకాదు. ఏభోగట్టా అడిగినను తెలిపెదరు. ప్రతిదినమును సుమారు ౪౦౦ దరఖాస్తులు వచ్చుచుండును. ౧౯౩౩ లో తయారైన క్రొత్తభవనములో ఇది ఇపుడు వెలయుచున్నది. దీనిలో నవలలు ఉంచరు.

బ్రిటిష్ మ్యూజియములో పలుదేశములనుండి వచ్చు పొత్తములు—చిత్తరువులు—నాణెములు మొదలగునవి ఉండును; పొత్తములు ౪౦ లక్షలకు మించియుండును.

ఇట్లే ఆక్స్ఫోర్డు, కేంబ్రిడ్జి మొదలగు నగరములలోను - పట్టణములలోను గాక, పల్లెలలోకూడ పొ. గుడులు వెలసి, కార్నీజీట్రస్టువారుచేయు డబ్బుసాయమువలన బాగుగా పనిచేయుచున్నవి—అనఁగా ఎవరికి ఏపొత్తము కావలసిన వారికి అది అందఁజేయుచున్నవి. నడ పొ. గుడులు పెక్కులు పనిచేయుచున్నవి. ౬౦౦ పొత్తములుపట్టు న. పొ. గు. కారొకటి ఆనడుమ తయారు చేసినారట.

స్కాట్లాండు— ఇందు పొత్తపుగుడిలేని పల్లె లేదఁట!

ఐర్లాండు— దీనిలో కార్నీజీట్రస్టువారి సాయమున పొ. గు. పని బాగుగనే సాగుచున్నది. అందు దక్షిణైర్లాండులో మఱింత బాగుగా జరుగుచున్నది.

ఫ్రాన్సు— 'బిబ్లియోథికే నేషనల్' పొ. గు. ౪౦ లక్షల పొత్తములతో ప్యారిసునగరమున వెలయుచున్నది. తక్కినచోట్లను మంచి పొ. గుడులు కలవు. ఈదేశమున పొ. గుడులకు సొమ్ము హెచ్చుగా వెచ్చింతురు. దొరతనమువారును, మ్యునిసిపాలిటీలవారును తమ పొ. గుడులు పల్లెలవారికి బాగుగా పనికివచ్చునట్లు చేయుచున్నారు.

జర్మని— బెర్లిన్ స్టేట్ లైబ్రరీలో ౨౩ లక్షల పొత్తములును, మ్యూనిచ్ స్టేట్ లైబ్రరీలో ౧౬ లం. ౭౦ వేలును, ట్రాస్బర్గ్ యూనివర్సిటీ లైబ్రరిలో ౧౩ లక్షల పొత్తములు కలవు. మనదేశమునుండి వెళ్ళిన పొత్తములు జర్మనీ పొ. గుడులలో పెక్కులు కలవు. మనవారు మనదేశమున దొరకని పొత్తములు జర్మనిలో వ్రాయించి రప్పించుకొందురు.

పట్టణగ్రంథాలయములు పెంపొందించి, అవి పల్లెలకు పనికివచ్చునట్లు చేయుటకు ప్రయత్నించుచున్నారు. పెక్కు పట్టణముల పొ. గుడులు అప్పుడే అటుచేయ పూనుకొనినవి.

ఇటలీ— రోము నగరమునందలి వాటికన్ లైబ్రరీలో ఇప్పుడు అచ్చుపొత్తములు ౫ లక్షలు; వ్రాఁత పొత్తములలో లాటినువి ౩౭,౦౦౦; గ్రీకువి ౪,౨౬౦; తూర్పునాడుల పలుకులవి ౪,౦౦౦; చరిత్ర గ్రంథములు ౬౦,౦౦౦. ఈ గ్రంథాలయ స్థితినిబట్టి మొత్తముమీఁద ఈ ఉద్యమమెట్లు జరుగుచున్నదో ఊహించుకొననగును.

రష్యా— సోవీట్ దొరతనము వచ్చినపిదప జార్ దొరతనమునాఁటి కంటె పొ. గు. క. మిక్కిలి విరివిగా పెరిఁగినది. అమెరికా సంయుక్తరాష్ట్రములను మించుటకు పోటీ చేయుచున్నట్లు నగరములలోను, పట్టణములలోను, పల్లెలలోనుకూడ పని చుఱుకుగా చేయుచున్నారు. వానకురియునపుడు కూడ పొత్తములకొఱకు వచ్చుటయు, ఇచ్చుటయు జరుగుచుండునఁట! పొత్తముల లెక్కలో ఇది తక్కిన అన్నినాడులను మించినట్లు కానవచ్చుచున్నది. లెనిన్ స్టేటు పొ. గు. లో ౬౦ లక్షల పొత్తములును, లెనిన్గ్రాడ్ మంది పొ. గు. లో ౪౯,౩౨,౯౪౩ పుస్తకములును కలవఁట. అన్ని

గ్రంథాలయములలోని గ్రంథముల మొత్తము ౧౦ కోట్లుంటు! సంచారగ్రంథాలయములు ౧౨,౦౦౦.

సినిమా రేడియోల సాయముతోడి పా. గు. కదంకవలన రష్యా, ఇపుడు శాస్త్రీయముగా సేద్యము చేయు దేశములలో ఒకటిగా ఎన్నికకు రాఁగలిగినది.

స్వీడన్— ఈదేశమునకు కలపవర్తకము చేసికొనవచ్చి - డబ్బుగడించిన స్కాట్లాండు దేశస్థుఁడగు డిక్సన్ అను దాత గ్రంథాలయనిధి ఒకటి ఏర్పఱుపఁగా, దానివలన ౫ గ్రంథాలయములకు ధన సాహాయ్యము జరుగుచున్నది.

హెల్సింబర్గ్ ప్రోలి పా. గు. వారును, డెన్మార్కులోని హెల్సింగోర్ లైబ్రరీవారును, ఒండొరులకు వలయు పొత్తములు ఎరవిచ్చిపుచ్చుకొనుచుందురు.

ఆస్ట్రియా— వియన్నా నగరములోని 'నేషనల్ లైబ్రరీ' లో ౧౨,౫౦,౦౦౦ పొత్తములు కలవు.

యూరపుఖండములోని డెన్మార్కు, హాలెండు, బెల్జియము మొదలగు నాడులలోకూడ పా. గు. క. పైని తెలిపిన నాడులలో దానికంటె వెనుకపడలేదు. ౧౫వ శతాబ్దిలో అచ్చువచ్చిన పిదప మొత్తముమీఁద గ్రంథాలయోద్యమము బాగుగానే సాగుచున్నది. కొన్ని నాడులలో దొరతనమువారు తోడ్పడుచున్నారు; కొన్ని నాడులలో డబ్బుగలవారు సాయపడుచున్నారు; కొన్ని నాడులలో మ్యూనిసిపాల్టీలవారు పనిచేయుచున్నారు. కొన్ని నాడులలో రెండు మూఁడు సాయములును జరుగుచున్నవి. దొరతనమువారి సాయమునకు ఉదాహరణము చూడుఁడు.— జుగోస్లోవేకియాలో ౧౯౧౯ లో అచ్చటి దొరతనమువారు గ్రంథాలయశాసన మొకటి చేసిరి; దానివలన ప్రతిపట్టణములోను, ప్రతి పల్లెలోను, గ్రంథాలయము లేర్పడవలసివచ్చుటచే, ౫ ఏండ్లలో అక్కడి పా. గుడులు ౪౫౦ నుండి ౨,౨౪౨ వఱకు పెరిఁగి, మందికి ఎఱుక కఱపి, ఎంతయు తోడ్పడుచున్నవి.

దక్షిణాఫ్రికా—ఇది బోయరుయుద్ధము తరువాతనే పైకివచ్చినది. అయినను,దీనిలోకూడ పా. గు. క. చక్కఁగా సాగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. దీనికి కారణమేమని వింతపడనక్కఱలేదు. స్వాతంత్ర్యము చేయఁజాలనిది ఏదియు లేదు. అదే అభివృద్ధికి ముఖ్యకారణము. అది లేనివారన్నో అడుగంటి పోయెదరు.

అ. సం. రాష్ట్రములు—సోవీట్ రష్యానుగూర్చి ముచ్చటించునప్పుడు అది అ. సం. రాష్ట్రములతో పోటీచేయుచున్నట్లు చురుకుగా పనిచేయుచున్న దనుకొంటిమి. కాని, ఇందు జరుగుపనినిగూర్చి కొంత వివరముగా తెలిసినఁగాని ఆపోటీ ఎట్టిదో తేటపడదు. ౧౯౨౮ లో పా. గు. ఖర్చు రు. ౧౦,౬౦,౩౧,౪౬౮; అనఁగా తలకు ఏఁడాదికి రు ౧ చొ॥ ఖర్చగుచున్నది. కార్నీజీ కార్పొరేషనువారు ఇందలి గ్రంథాలయములకు డబ్బు సాయము చేయుచున్నారు. పా. గు. లో చదువుకొని-బాగుపడి-కోటీశ్వరుఁడైన కార్నిజీ పైనాడుల పా. గు. కే సాయపడినపుడు తన నాటివానికి తోడ్పడుట వింతకాదు. కాని, ఏఁడీ అట్టిదాత మఱొకఁడు? కోట్లకొలఁది మందికి ఎడతెగక తోడ్పడుభాగ్యము ఆయనకే కలిగినది.

వాషింగ్టన్ నగరములోని కాంగ్రెస్ లైబ్రరీని గుఱించి ఇదివఱకు కొంత తెలిసికొంటిమి. ఇప్పుడది మఱింత పెంపొంది పనిచేయుచుండును. యేల్ నగరములోని స్టెర్లింగ్ మెమోరియల్ పా. గు. లో ౩౫ లక్షల పొత్తములు కలవఁట. ఇట్లే న్యూయార్కు, చికాగో, ఫిలడెల్ఫియా మొదలగు నగరములలోను, పట్టణములలోను, పల్లెలలోను, పా. గుడులు పనిచేయుచున్నవి. ఆనడుమవచ్చిన లెక్కలనుబట్టి, ౫,౯౫౪ మంది పా. గు. కలవనియు, ౪,౫౦,౬౯,౮౯౭ గురు పొత్తములు చదువుచున్నారనియు, వీరిలో ౧౦౦కి ౯౩ గురు పల్లెలవారనియు తేలినది. గ్రుడ్డివారికొఱకు విడిగాపెట్టిన పా. గు. ౧౫. పిల్లలకొఱకు తగిన పొత్తములు వ్రాయించి, వానిలో మేలైనవానికి కానుక లిచ్చెదరు.

పిల్లలకు కథలు చెప్పెదరు; బొమ్మలు చూపెదరు; వారిచే ఆటలాడించెదరు; వారితో ముచ్చటించి, ఎలుక పెంచెదరు. స్త్రీలకు చదువుకొనుటకు వలయు సదుపాయములెల్ల చేసెదరు.

మహాసభలలో తీర్మానములు హెచ్చుగా చేయరు; ఆపని ఉపసంఘములే చేయును. ఒకయేడు మహాసభా సమావేశములు ౬ నాళ్లలో ౪ మాత్రమే జరిగె; ఉపసంఘముల సమావేశములన్నో ౭౭. ప్రభుత్వములవారును, ధనవంతులును గ్రంథాలయములకు తోడ్పడునట్లు మనకు తెలియును. ఇక్కడ స్త్రీలు సైతము పా. గుడులకు డబ్బిచ్చి తోడ్పడెదరు. ఇక్కడి పా. గు. వారు చదువరులకుచేయు సదుపాయములవలననే వారికి ఎంతో జ్ఞానాభివృద్ధి కలుగుచున్నది. దీనికి కార్నిజీయే పెద్ద తార్కాణ. పొత్తపుగుడియే, పల్లెకును-పట్టణమునకు-పాఠశాలకును-సర్వకలాశాలకును, గుండె- అని కీవ్ లాండ్ మంది పా. గు. తీర్పరి అగు లిండాఈస్టుమ్యాన్—అను నెఱవాది ఒకయేడు అ. సం. రా. గ్రంథాలయమహాసభకు అధ్యక్షత వహించినపుడు వక్కాణించె. ప్రార్థనాలయము తరువాతను, పాఠశాల తరువాతను, అమెరికావారికి మేలుచేయునది పా. గుడియే—అని రూజ్ వెల్టు—అధ్యక్షుండొకసారి తెలిపె.

కావలసిన పొత్తము లేదనక, అది ఎక్కడనున్నను రప్పించియిచ్చు మంచి ఉనికికివచ్చినవి యిచ్చటి పొత్తపుగుడులు! చదువందఱకును అబ్బుచో స్వాతంత్ర్యమునకు దారి ఏర్పడునని ఇచ్చటివారి నమ్మకము!! అన్ని తెలలనుగూర్చిన సంజాయిషీకూడ ఎప్పటికప్పుడు సిద్ధపఱచిఉంచు బాధ్యత పొత్తపు తీర్పరిది!!! ఇట్టి గట్టి కట్టడలతో ఇచ్చటి పా. గు. కొలువరులు పాటుపడుచున్నారు. అయినను, ఇపుడున్న పసలన్నియు సమకూర్చుకొని-పనిచేయుచోకూడ, పెట్టుకొనినగుఱి పట్టుచేరుటకు హెచ్చుకాలము పట్టుననుకొనుచున్నారట! ఈ ఉద్యమములో విరోధులతో సైతము కలసి పనిచేయవలయును గాన, తమ తెలివితేటలనుగూర్చియు, పొందికనుగూర్చియు జరుగు పరీక్షలో తాము నెగ్గవలయునట!!

ఇచ్చట గ్రంథాలయసంఘము సుమారు ౭౫ ఏండ్లక్రిందట ఏర్పడి, పనిచేయుచున్నది; సభ్యులు వేలకొలదిగా ఉన్నారు. గ్రంథాలయాభివృద్ధికొఱకు యాచించుటకుకూడ వెనుదీయరాదని పా. గు. కొలువరులు తలంతురు. ప్రపంచములోని జనులందఱును మిక్కిలి జ్ఞానవంతులుగాను, సౌఖ్యవంతులుగాను, శాంతివంతులుగాను, ధనవంతులుగాను అగుటకు తగిన వెరవులో పొత్తపుగుడులే అన్నిటికన్న మిన్నలని వారికి తేటతెల్లముగా తెలియుచున్నదట! వేయిమాటలేల? గ్రంథాలయములే జాతీయ జీవనమునకు రంగస్థలములు గాన, వానినుండియే ఉద్యమములెల్ల వెలువడుచున్నవట!! ఇదే ఇక్కడి వారి నిశ్చయము!!!

చోటు కలసివచ్చుటకు పత్త్రికలలోని విషయములు ఫిలిముమీఁది కెక్కించుచున్నారు; నవలలు మొ. పొత్తములు గట్టిగా చదివి వినిపించుటకు ఫిలిముతీయు 'లైబ్రోఫోను' యంత్రము కనిపెట్టినారు. మాటలాడు పొత్తములు గ్రుడ్డివారికొఱకు వాడుచున్నారు; వారు తాఁకి చదువుకొనుటకు ఉబ్బెత్తు వ్రాత పొత్తములెన్నో తయారగుచున్నవి; ఎల్లయెడలను పా. గుడు లేర్పాటు చేయుచున్నారు. మంది పా. గు. కొలువు ఇప్పటి అక్కఱలకు తగినట్లు ఏర్పాటుచేసి-తక్కిననాడులకు దారిచూపిన పేరు అమెరికా సం. రాష్ట్రములదే. అచ్చటివారు తమపనిలో, సినిమా-టాకీ-రేడియో-వైర్ లెస్-ఫొటోగ్రాఫి-బ్రాడ్ కాస్టింగ్-టెలివిజన్-ప్రదర్శనములు-మచ్చులు-బొమ్మలు-ప్లానులు-లాంతర్లు మొ. సాధనములుగా కైకొనుచున్నారు.

అయినను, సుమారు సగముమందికి పా. గు. తోడ్పాటులేదట! కనడాలోని స్థితియు అట్టిదే! ఈస్థితి తెలిసి, అమెరికా గ్రంథాలయసంఘమువారు ప్రతిమనుష్యునికిని పుస్తకసదుపాయము చేయపూనికొనినారట!!

ఎవరికి తగినట్లు వారికి జ్ఞానసాధనములు చేకూర్చుట ప్రభుత్వవిధి – అని ఇచ్చటివారి సిద్ధాంతము! పొ.గుడులు మేటియెఱుక తెల్పుగిడ్డులనియు వారి నమ్మకము!! ఇట్టి పొ. గుడులను మందికిపనికివచ్చు తెఱంగున వారిదగ్గఱకు చేర్పవలయుననుటయే ఇచ్చటి గ్రంథాలయోద్యమము పైనాడులకిచ్చు క్రొత్త సందేశము !!!

ఇప్పటికి పడమటినాడులలో పొ. గు. కడంక ఎట్లు నడచుచున్నదో చూచాయగా తెలిసినది. ఇఁక అది తూర్పునాడులలో ఎట్లు సాగుచున్నదో చూడనగు. ఐరోపా, ఆఫ్రికా, అమెరికా ఖండములలోని నాడులు పడమటి నాడులుగా మన మెంచినాము. కాన, తూర్పునాడు లనఁగా ఆసియా-ఆస్ట్రేలియాఖండములలోనివే. తూర్పు దీవులును వీనితో చేరును.

ఆసియా—ఇందు పెద్దనాడులు సైబీరియా, చీనా, జపాను, ఇండియా, పెర్ష్యా, అరేబియా, టర్కీలు. వీనిలో సైబీరియా సోవీట్ రష్యా దొరతనముక్రింద ఉన్నది. కాన, అందలి పొ. గు. కడంక తక్కిన ఆ దొరతనముక్రింది నాడులలో ఉన్నట్లే ఉండునని తలంపవచ్చును. టర్కీలోకూడ పడమటి నాడులలో వలెనే జరుగుచుండునని తలంపనగు. చీనాలో అమెరికా తీరున పనిచేయుటకు మొదలిడిరి. జపానులో బాగుగానే పని సాగుచున్నది. అరేబియా- పెర్ష్యాలలో పని సరిగా జరుగుచున్నట్లు కానరాదు. తక్కిన చిన్న నాడులలోని ఉనికియు అట్టిదే. ఇండియాలోను మొత్తముమీఁద పని బాగుగా జరుగుటలేదనియే చెప్పవలె. కాన, పడమటినాడులకు ఈ తూర్పునాడులు తీసికట్టులే. ఇండియాలోను- జపానులోను, పొ. గు. కడంక మొత్తముమీఁద స్వదేశపద్ధతులమీఁదనే జరుగుచున్నది. డచ్చి తూర్పుదీవులలోను, ఫిలిప్పైను దీవులలోను, పొ. గు. కడంక బాగుగా జరుగుచుండుటకు కారణము పడమటి నాడులతోడిపొత్తే.

ఆస్ట్రేలియా— ఇది పడమటి దొరతనముక్రింద స్వతంత్రత కలిగియున్నదగుటచే ఇందలి నాడులలో పొ. గు. కడంక కొంతకాలమునుండి బాగుగా జరుగ మొదలిడినది. మంది పొ. గు. మొత్తము ౧౫,౦౦౦ లకు మించియుండును; పొత్తములు 30 లక్షలకంటె హెచ్చుగా ఉన్నవి. మెల్బోర్నునగరపు పొ. గు. లో ౨ లక్షల పొత్తములు కలవు; అందు, 30,000 తలుపులులేని బీరువాలలో ఉండును. సిడ్నీ, అడిలెయిడీ మొదలగు నగరములలోను, పట్టణములలోను, పల్లెలలోను, పొ. గుడలు కలవు.

## ఇండియా పొ. గు. మనుగడ – ప్రాఁతది

ఇప్పటికి పైనాడుల పొ. గు. మనుగడను గూర్చి మనకు వలయునంత తెలిసికొంటిమి. కాన, ఇఁక ఇండియా పొ. గు. మనుగడను గూర్చియు తెలిసికొననగు.

ఇండియా అనఁగా సేతువునకు హిమవత్పర్వతమునకును నడుమనుండు దేశమని మనమిపు డనుకొనుచున్నాము. దీనినే ఆర్యులు భరతఖండమనిరి. ఇది భరతవర్షములోని దనియు, అది జంబూద్వీపములోని దనియు, సంధ్యావందనము చేయువారికి తెలియును. కాని, ఇండియా ఎప్పుడును ఇట్లే ఉండెననుకొనుట పొరపాటు. మొట్టమొదట వింధ్యము ఉత్తరపుటెల్లగా ఉండు దక్షిణదేశము మొదలుకొని బొంబాయిరాష్ట్రమును-సప్తసింధుదేశమును చేరినదే ప్రాఁతయిండియా. అపుడు క్రొత్తయిండియాలోని తక్కిన వాటా అంతయు కడలియే; మంచుకొండయు నాఁడు లేదయ్యె. సింహళి మపుడు దక్షిణదేశముతో కలసియుండెడిది. నిజమునకు ప్రాఁతయిండియా దక్షిణ లెమూరియాఖండపు నడుమ ఉత్తరముగా ఉన్న వాటా. కాన, అది ప్రాఁతయిండియానుండి విడిపోయిన పిదప అక్కడ లెమూరియనులలో ఏడవపిల్ల తెగవారు ఉండెడివారు. వారు ప్రోళ్ళు కట్టిరి; కాన, నాగరకులు. వారిలో భాషయు కొంతవఱకు పెంపొందె. లెమూరియాఖండము నానాఁటికి తగ్గిపోవునపుడు వింధ్య పర్వతమునకు ఉత్తరమునను-తూర్పునను ఉండిన కడలినుండి నేలపైకి రాఁదొడఁగె; మంచుకొండయు

దానితోడిదే. నేల ఒకవైపున కడలినుండి లేచునపుడు మఱొకవైపున అది కడలిలోనికి పోవును. కాన, అట్లాంటిస్ ఖండము బాగుగా పైకివచ్చునప్పటికి లెమూరియాఖండము బాగుగా మునిఁగిపోయె. ఇప్పటికి ౮-౧౦ లక్షల యేండ్లనాడును ఉత్తరహిందూస్థానము పైకివచ్చె; మంచుకొండ మఱింత పైకి వచ్చె. అట్లాంటిస్ ఖండము విస్తరించియుండినపుడు ప్రాంతమునుండియూ దానిలో చేరియుండెను. ఇప్పటికి సుమారు ౨ లక్షల యేండ్లక్రిందట ఉత్తరహిందూస్థానము మంది ఉండుటకు తగిన ఉనికిలోనికివచ్చె. దక్షిణదేశమునుండి సింహళము విడిపోయె.

లెమూరియాఖండము మునిఁగిపోయినపుడు మిగిలిన తూర్పుదీవులనుండి లెమూరియనులు కొందఱు ఉత్తరహిందూస్థానముచేరి, మంచుకొండల వరుసను వ్యాపించిరి. వారిలో కొందరు ఇప్పటి సంతాలు పరగణాలపట్టున రాచతికముచేసిన జాడలు కానవచ్చుచున్నవి. ఈతెగకు చెందినవారినే ఆర్యులు నిషాదులనిరి; వీరిని పడమటి నెఱవాదులలో మొదటివారు కొలారియను లనఁగా, ఇప్పటివారు ముండాలనుచున్నారు. అట్లాంటియనులలో రెండవపిల్లతెగవారగు త్లవత్లిలు సముద్రముమీఁదుగా వచ్చి, దక్షిణదేశమున ప్రవేశించి, అక్కడి లెమూరియనులతో నానాఁటికి కలసిపోయిరి; ఆరెండు తెగలవారిబిడ్డలే తొంటిద్రావిడులు. ఇఁక, అట్లాంటియనులలో మూఁడవ పిల్లతెగవారును, త్లవత్లిల కంటెను నాజూకుతనము గడించినవారు నగు తొత్తైక్కులు ఇప్పటి అఫ్ఘనిస్థానముమీఁదుగా వచ్చి, ఇండియాలో చొచ్చి, దక్షిణదేశమువఱకును వ్యాపించి, అచ్చటి తొలిద్రావిడులతో కలసిపోయిరి.

తొలిద్రావిడులు తమ పుట్టుపట్టగు దక్షిణదేశమున రాజ్యముచేయుచు, పిదప ఉత్తరదేశమంతయు లోఁబఱుచుకొని, అప్పుడు మంచుకొండకు ఉత్తరమున ఉండిన కడలివఱకు ఏలిరి; వారే ఇండియాలో మొట్టమొదటి సామ్రాజ్యము స్థాపించినవారు. హరప్ప, మహెంజోదారోల నాగరికత దానిలో చేరినదే. సర్ జాన్ మార్షల్ పండితుఁడు రెండవదాని నాగరికత ద్రావిడులదని ఊహించె; అది నిజమే. ఆ మహాసామ్రాజ్యములో నిషాదులరాజ్యములును, తొత్తైక్కుల రాజ్యములును చేరిపోయె. వారు సుమారు ౫౦ వేల యేండ్లు, ఆర్యులు తమ్ము త్రోసిరాజుచేయువఱకును ఇండియాను ఏలి, తమ నాగరికతయు—తమ భాషయు కన్యాకుమారినుండి కాశ్మీరమువఱకును నెలకొల్పిరి. అందుచేతనే, భరతఖండపు తొలిభాష ద్రావిడభాష అంటిని; అనుచున్నాను; అనఁగలను. సంస్కృతము భరతఖండపు తొలిభాష అనుకొనుట వట్టి భ్రమ; అది ఎల్లభాషలకును తల్లి అనుట అతిశయోక్తి; నిజమునకు, సుమారు ౪-౫ వేల యేండ్ల క్రిందట ఏర్పడినభాష అది; అది వేదభాషనుండి పుట్టినది; అది సుమారు ౨౦ వేలయేండ్ల క్రిందటిది కావచ్చును. ఇఁక, తొలి ద్రావిడభాష అన్ననో సుమారు రెండులక్షల యేండ్ల క్రిందటనే ఏర్పడి, తమిళము-తెనుఁగు మొదలగు పలుకులుగా విడిపోవువఱకును తన జెండా ఎగురవేయుచుండిన మేటిపలుకు. ప్రాకృతములను పేరను, దేశభాషలను పేరను వాడుకగు పలుకులెల్ల దాని బిడ్డలు. అది తొలుత వేదభాషకును, పిదప సంస్కృతమునకును, తోడుగా ఉండెను. సంస్కృతము పెంపొందిన పిదప ఉత్తరదేశభాషలు దానినుండి పుట్టిననుడులతో నానాఁటికి నిండిపోయినవి; అయినను, వాని యెముకలగూఁడు కన్నతల్లి యిచ్చినదే. పలుకులకు గీటురాయి మాటయేర్పాటు. అది యిండియాలోని అన్నిపలుకులలోను ఒక్కతీరుననే కానవచ్చుచున్నది. కావుననే, నానెయ్యురు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ద్రావిడభాషలనుగూర్చి గాలిలో మేడలుకట్టి, తుదకు తమ సిద్ధాంతము సత్యము కానిచో, ప్రాకృతములనెల్ల ద్రావిడభాషలాక్రమించినవనియు- అవి ద్రావిడభాషలనుండి పుట్టినవనియు సిద్ధాంతము చేయవలసియుండునని వ్రాయవలసివచ్చినది. ప్రాకృతములు ద్రావిడభాషనుండియే పుట్టినవనియు, సంస్కృతము వాని నాక్రమించినదనియు పైని నేను తెలిపినదానినిబట్టి తేటతెల్లమే. రావుగారే నిజము తలక్రిందుచేయుటకు ఎంతో పాటుపడి, తెనుఁగు మనుగడ తాఱుమాఱుచేసినారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు అట్టి మనుగడను అచ్చువేయించి, తెనుఁగువారికి మేలుచేయుచున్నామను భ్రమతో డబ్బు దండుగపెట్టుకొనుటకు తోడు,

తెనుఁగుపలుకు తల్లికి ఎంతో కీడు చేసిరని చెప్పవలసివచ్చినందులకు మిక్కిలి వగచుచున్నాను. దీనికి బాధ్యులెవరో! మనకు కావలసినదానికి రాకున్నను, అక్కఱలేనిదానికి డబ్బువచ్చుననుటకు ఇది ఒక నిదర్శనము. అయినను, దీనినిగూర్చి విరివిగా చర్చించుటకు ఇది తఱికాదు.

సుమారు ౧౦ వేలయేండ్లనుండి ఆర్యులు జట్లు జట్లుగా గోబీకడలిదగ్గఱనుండి రాఁదొడఁగి, ఇండియాలో అపుడు ఏలుచున్న తొలిద్రావిడులతో పోరి, తొత్తెక్కులతో కొందఱతో పొత్తుకలిపి, తుదకు గెలుపొంది, హెచ్చుగా ఉత్తరమునను-తక్కువగా దక్షిణమునను స్థిరపడిరి. ఉత్తరమున స్థిరపడిన వారు రాజ్యములు చేసిరి; మొదట గీర్వాణవాఙ్మయమును, పిదప సంస్కృతవాఙ్మయమును పెంపొందించిరి. దక్షిణమునకు వచ్చినవారు రాజులదగ్గఱచేరి, పెద్దఱికము చేసిరి. వారిలో కొందఱు చోళదేశస్థులతో కలసి-చాల్డియాకును, పాండ్యదేశస్థులతోకలసి ఈజిప్టునకు వెళ్ళి, అచ్చట సామ్రాజ్యములు స్థాపింపసాయపడి, పడమటినాడులవారికి తెలివితేటలబ్బుటకు దారిచూపిరని మనకు తెలియును. దక్షిణపుటిండియానే కొందఱు పడమటి వ్రాఁతకారులు తూర్పు-ఎథియోపియా అనిరి. తొంటి పడమటి గ్రంథకర్తలకు ఇండియా అనఁగా భరతవర్షముకాని, భరతఖండము కాదు. భరతవర్షమనఁగా పెద్ద యిండియా; దానిలోని వాటాలకు పై యిండియా, క్రింది యిండియా, పడమటియిండియా అను పేర్లు వాడెడివారు. పడమటి యిండియా అనఁగా పారసీకము. టిబెట్టు, పెద్దతార్తరి, మంగోలియా దేశములును పెద్ద యిండియాలోనివే.

తొంటి ద్రావిడ సామ్రాజ్యసమయమున దక్షిణదేశము చదువులకు పట్టుకొమ్మగా ఉండెడిది. అందు అన్ని తెలలనుగూర్చి తెలుపు మంచిమంచి పొత్తములుండెడివి. ఆర్యులు మొదటిసారి వచ్చినపుడు ఉత్తరదేశమున పోదివ్వరు అను ఱేఁడును, దక్షిణదేశమున హులరయందు (లాహిరి) అను చక్రవర్తియు, ఏలుచుండిరఁట! ఆర్యులా చక్రవర్తి దగ్గఱకుచేరి, చనువుగడించి, మెల్లమెల్లఁగా అచ్చటియెంపుడు పొత్తములు తాము సంగ్రహించిరి. మహాసామ్రాజ్యము వెలయునపుడు పొ. గుడు లుండు ననుకొనుట తప్పుకానేరదు. ఏమందురా? తమకు తెలియనివెల్ల కల్లలను - ఇప్పటి నెఱవాదులును - మేలెఱుకవారును వ్రాసినపొత్తములు పెక్కులు చదివి, అందలి తెలలు చేతనగునంతకు ఱుసు తరిచి, తేల్చుకొనిననిగ్గే నేనిపుడు మీకు తెలుపుచున్నాను. అందలి పొరపాటు లెవరేని చూపిన దిద్దుకొందును.

అట్లాంటిస్ ఖండము పోయినపిదప కడలిపాలుగాక మిగిలి, మునుపేకాక ఇపుడును నాజూకు నాడులని పేరొందినవానిలో మొట్టమొదటిది ఈజిప్టని భ్రమపడిన పడమటి నెఱవాదులు-పదంపడి చాల్డియా అనిరి. నిజమునకు అదియు భ్రమయే. చాల్డియాకంటె ఈజిప్టే మొదటి నాజూకునాడు. కాని, దాని నాగరకత మూఁడుసార్లు పోయినది. మరల దానికి నాగరకత ఇచ్చినది ఇండియాయే. పెక్కుమాటలేల? నాగరకతకు నిలుకడపట్టు ముమ్మాటికిని ఇండియాయే; అది ఒకప్పుడు ప్రాఁత యిండియాయో, మఱొకప్పుడు పెద్దయిండియాయో, ఇంకొకప్పుడు క్రొత్తయిండియాయో, అయిన అగుఁగాక!

“ఇప్పటినేల మానిసిమేనుగా కైకొనుచో, యూరపు దాని కుడి సగము; ఆసియా ఎడమ సగము; ఇండియా గుండెకాయ. ఊరన్ కొండలు ముక్కుదూలము; ఆఫ్రికా కార్జము; ఆస్ట్రేలియా ప్లీహము; రాకీకొండలవరుస వెన్ను; బ్రెజిలు పిఱుఁదులపట్లు. గుండెనుండియే మేనిలోని నలుగడలకు నెత్తురు పోవునట్లు, ఇండియానుండియే అన్ని నాడులకు ఎఱుకపోవును; ఇది తెలిసినవారు కావుననే నేల పెద్దలు— మనువు మొ. వారు- తొలి ఆర్యులను ఇండియాకు చేర్చినారు.” అని మేలెఱుకవారు చెప్పుట ఎంతయు ఒప్పియున్నది.

“అత్రాపి భారతం శ్రేష్ఠం । జంబూద్వీపే మహామునే
యతోహి కర్మభూరేషా । తతోఽన్యా భోగ భూమయః॥

అత్రజన్మ సహస్రాణాం । సహస్రైరపిసత్తమ
కదాచిల్లభతే జంతు । ర్మానుష్యం పుణ్యసంచయాత్."

"జంబూద్వీపమునందలి నవవర్షములలో కర్మభూమి అగుటచే భారతవర్షమే శ్రేష్ఠము; తక్కినవి భోగభూములు; భారతవర్షమున పుట్టుట దుర్లభము; మనుష్యజన్మ మెంతో పుణ్యము చేసికొన్నఁగాని కలుగదు" అని పెద్దలు చెప్పియున్నారు. ఇది నిజమని ఆస్తికులు నమ్మెదరు. కాని, ఇది అరయుచో, ప్రాఁతముచ్చట. అరండేలుగారు చెప్పినట్లు ఇండియా తొల్లి ఋషులది; ఇపుడు నవనాగరకులది. అపుడు సత్యమునకు ఆటపట్టు; కాన, ఎంతో మహిమతో ఒప్పుచుండెడిది. ఇప్పుడో ఆస్థితి మారినదనక తప్పదు. మతములో నేమి, రాజనీతిలో నేమి, చదువులో నేమి, పాటలో నేమి, పనులలో నేమి, తుదకు నడతలో నేమి, నిక్కపుతనముపోయి కక్కుర్తి బలసి, నాగరకతలని పైనాడులవారనుకొను దొంగవాలకములోనికి దిగిపోవుటచే, అప్పటి నిక్కపు పస చాలవఱకు తగ్గినది; తమనాడు తనకుతానే పెద్దగా ఉండునట్లు చేయుటకుమాఱు దానిని ఏ పైనాటికో బానిసగా చేయఁజూచు కూళలు ఇక్కడను కొందఱు బయలుదేఱినారు. వారు తమ తల్లివైపుచూడక తక్కిన అన్నివైపులను చూచెదరు! ఆమె ముక్తి ఆమెలోపలనే కలదని యెఱుఁగక పైని అంతటను వెదకెదరు. సరిగా అరయునెడల, ఇండియా మేలు ఇండియాలోనే కలదు. కాని, ఆమేలు చేకూరుటకు మన దొంగవాలకము పోవలె; తమ మేలే తాము చూచుకొను జబ్బు వదలవలె; అందఱును తమవారే అను ఎఱుక పొడకొనవలె; కలసి కట్టుతనమబ్బవలె; నిజము పాటింపవలె; వలయుచో ఉసుఱయిన ఒసంగఁగల తెగువ కలుగవలె; ఎదుటిపచ్చ చూచి-సంతసించు మంచితెలివి అబ్బవలె. అపుడు, ఇండియా మేలే కాక, అన్నినాడుల మేలును ఇండియాలోనే కానవచ్చును. కాని, అట్టినాఁడెప్పుడు వచ్చునో !

కోల్‌బ్రూక్, సర్ విల్లియమ్‌జోన్స్, లాస్సెన్, వెబర్, బర్నాఫ్ మొదలగువారి వలెఁగాక, ఇండియాలోని పండితుల సాయముగొని పరిశోధించిన జాకొల్లియట్ పండితుఁడు, ౬ వేల యేండ్ల క్రిందటనే ఇండియా తన పాండిత్యముద్రను-నాగరకతాముద్రను, ఈజిప్టు-పెర్షియా-జ్యూడియా-గ్రీసు-రోముల మీఁద వేసెననియు, అవి తమ ముద్రలను తక్కిన యప్పటి పడమటి నాడులమీఁద వేసెననియు, చాటుచున్నాఁడు. ఇది ఎవరు కాదనఁగలరు ?

ఇంత ఏల? తొంటి నిషాదద్రావిడుల యొక్క నిగ్గంతయు వారినుండి తేనెటీఁగలు తేనెపూలనుండి వలె నేర్పుగా కైకొని — కూర్చిన తేనె పెఱవంటి సంస్కృతపువ్రాఁగమివంటి వ్రాఁగమి, నేల నాలుగు వైపులను మేటి నాగరకతకు మానాడులే ఆటపట్టులని ఇపుడు బోరలు విఱుచుకొని విఱ్ఱవీగెడి వారిలో ఎవరుగాని మానాట పుట్టినదని చెప్పఁగలరా?

ఎల్లయెడల నిండియుండెడి యెల్లఁడు తమ యుల్లమునందే కలఁడని యెఱింగిన మేటియెఱుకచే ప్రకృతిని బానిసగా చేసికొనఁగలిగిన మహర్షులుగదా మొట్టమొదటి నడపొత్తపు గురువులు! ఏరీ వారికి సాటివచ్చువారు? వారి నోళ్ళు పలుచదువులను వెలువఱుచు గ్రామఫోనులు!! వేదములు, శాస్త్రములు, స్మృతులు మొదలగునవి పెక్కులు వారికి కంఠస్థములే !!!

అలెగ్జాండ్రియా గ్రంథాలయ మేర్పడకముందు ఎఱుకగడింపఁగోరు పడమటినాడుల వారెల్లరును ఇండియాకే వచ్చెడివారు. పైథాగొరసు (బుద్ధగురువు) ఇక్కడనుండి జ్ఞానము సంపాదించుకొని వెళ్ళినవాఁడే; ఏసుక్రీస్తు మొదలగువారు ఇక్కడ యెఱుక గడించుకొన్నవారే.

ఋషులు నడపొత్తపు గురువులయినంతమాత్రమున నిలుకడ పా. గురువులు లేవనుకొనరాదు. స్వరము కొఱకు వేదములు నోట చెప్పుకొనినను, అవి వ్రాఁతలో ఉండకపోనక్కఱలేదు. అట్టిచో తక్కిన వానిమాట చెప్పనక్కఱలేదు. దశరథుని కాలమున అయోధ్యలో చదువురానివారు లేరని రామాయణము తెలుపుచున్నది. కొంత అతిశయోక్తి అనుకొన్నను అంతయు కానేరదు. కాన, తొంటి రాజుల కాలమునను, తరువాతి యేండ్లతటిని, పా. గురువులుండె ననుటకు సందియపడ నక్కఱలేదు.

అటుకానిచో, అలెగ్జాండరు దండెత్తివచ్చి తిరిగి పోవునపుడు పొత్తము లెన్నో యిక్కడనుండి ఎట్లు పోయియుండును? అప్పటికి — ౨,౨౬౫ ఏండ్లక్రిందట — సంస్కృతపువ్రాఁగమి మిఁటి కొప్పంటు కొనెడి ఉనికి వచ్చుచుండె.

తత్త్వబోధలు, పురాణపఠనము, గ్రామస్వరాజ్యపద్ధతుల చర్చలు మొదలగు వానివలన చదువురాని వారును ఎఱుకగలవారగుచుండిరి.

బౌద్ధజైనులు, పాలివ్రాఁగమియు — ప్రాకృతవాఙ్మయమును పెంపొందించిరి. కాని, వారికిని పొ. గుడులు ఉండెనని వేరే చెప్పనక్కఱలేదు. తమిళనాటిలో తమిళవ్రాఁగమి పెరుఁగుటచే అక్కడను పొ. గుడులు వెలయుచుండెననియే తలంపనగు.

రాజులును, రాజబంధువులును, పండితులును, ఒజ్జలును, పొ. గుడులు కూర్చెడివారు. బౌద్ధసన్న్యాసులకు మతగ్రంథములు వ్రాయుట విధి; జైనభిక్షులకును పొత్తములు కాపాడుట విధి. ఇందువలన నగరి పొ. గుడులు, గుడి పొ. గుడులు, విహారగ్రంథాలయములు, మఠగ్రంథాలయములు, గుహా గ్రంథాలయములు, పండితుల పొ. గుడులు మొదలగునవి వెలసినవి.

తక్కిన పొ. గుడులకంటె విశ్వవిద్యాలయ పీఠముల పొ. గుడులు మిక్కిలి పేరుపొందినవి.

నలంద — ఇందలి విద్యాపీఠమునకు ఆసియాలోని అన్ని దేశములనుండియు విద్యార్థులు వచ్చెడివారు. అక్కడ 'రత్నోదధి' — అను మేటి పొ. గు. ౯ అంతస్తుల మేడపై వెలయుచుండెడిది. హ్యూన్‌త్సాంగ్ — అను చీనాయాత్రికుఁడు ౬౫౭లో వచ్చి, చదువుకొని, కావలసిన పొత్తములు పెక్కులు వ్రాసికొని, తీసికొని పోయినాఁడు. అట్టి పొ. గు. బౌద్ధభిక్షుకులు తమలోతాము దెబ్బలాడుకొని, మంటలపాలు చేసినారఁట! ఇంతకంటె మొఱకుతనమునకు తార్కాణ ఏమి కావలె?

తక్షశిల — ౬ శతాబ్దిని ఇందలి విద్యాపీఠమున ౧౮ విద్యలును నేర్పెడివారు; అప్పటికి యూరపువారు పెక్కురువచ్చి చదువుకొనుచుండిరి. అట్టిచో అక్కడ ఎట్టిమంచి పొ. గు. ఉండెడిదో!

ఉదంతపురి — నలందలో విద్యాపీఠము క్షీణించునపుడు మగధరాజు దీనిలో విద్యాపీఠ మేర్పరిచె. ఇందలి పొ. గుడి ౧౨౦౨ లో భక్తియార్ ఖిల్జీ బీహారుదేశము మీఁదికి దండెత్తివచ్చినపుడు కాల్పించె. ఇచ్చటి కొన్ని పొత్తములు నేపాళము చేరినవి.

విక్రమశిల — ఇక్కడకూడ ఉదంతపురియందు వలెనే విద్యాపీఠమును, గ్రంథాలయమును ఏర్పడి వానివలెనే పోయినవి. ఇందలి పొత్తములు కొన్ని టిబెట్టు దేశము చేరినవి.

దూపాంగ — ఇందలి విద్యాపీఠ గ్రంథాలయము బౌద్ధులకు ఎంతయు పనికివచ్చుచుండె.

పాటలీపుత్రము — ఇచ్చటి విద్యాపీఠమున మంచి పొ. గు. ఉండెడిది. అందు చీనాయాత్రికుఁడగు పాహియాను 3 ఏండ్లుండి, సంస్కృతమును బౌద్ధమతగ్రంథములును చదువుకొని, కావలసిన పొత్తములు పెక్కులు వ్రాసికొనిపోయె.

కాశి — ఇది గొప్ప విద్యాపీఠము. ఇందు అన్నివిద్యలు నేర్పు మహా పండితులుండెడివారు. ఇట్టిచో పొ. గుడులుండవన్న మతి యొక్కడ ఉండును?

కంచి — ద్రవిడదేశమున రాజధానిగా ఉండి పేరుపొందిన యీనగరమున మంచి విశ్వకళాశాల ఉండెడిది. కాన, దానితోపాటు మంచి పొ. గుడియు ఉండుట నిశ్చయమే.

మధుర — ఇది పాండ్యదేశరాజధాని. దీనిలో పండిత సంఘముండి, తమిళపొత్తములను పరికించుచుండెడిది. కావున ఇందు పొ. గుడి వెలయుచుండుటలో వింతలేదు.

చీనాయాత్రికులవలెనే ఆయా విద్యాపీఠములలో చదువుకొన వచ్చినవారు పలువురు తమకు కావలసిన పొత్తములకెల్ల నకళ్ళు వ్రాసికొని తమనాడులకు కొనిపోయి, అక్కడ ఎఱుక పెంపొంద చేసి కొనుచుండిరి.

గుప్తరాజులు ఉత్తరహిందూస్థానమున క్రీ. వె. 300 మొదలు ౬౫౦ వఱకును పాలించిరి. పిదప ఎంతో కాలమునకు వచ్చిన ఎలిజబెత్తురాణి రాజ్యకాలము ఇంగ్లాండునకెట్టిదో, గుప్తరాజ్య కాలము ఇండియా కట్టిదని విన్సెంట్ స్మిత్తు పొగడినాఁడు. అపుడు చదువు మిక్కిలి హెచ్చె. పా. గుడులు దానితోడివే. గుప్తరాజులలో విక్రమాదిత్యుఁడు పేరుపొందిన చక్రవర్తి. అతని సభ లోని నవమణులు విద్యానిధులఁట! అతఁడు పా. గుడులు పెట్టి పోషించుట వింతయా ? పిదప గుప్త సామ్రాజ్యము చీలిపోయి, చిన్నచిన్న తుండ్లపాలయ్యె. కాని, వారును పా. గుడులుపెట్టి, పెట్టించి, వ్రాఁతపొత్తములు పోకుండ కాపాడిరి. అవి తాళ-భూర్జ పత్రములమీఁద ఎంతో ఓపికతో వ్రాసెడి వారు.

౭వ శతాబ్దిని హర్షచక్రవర్తి ఉత్తరదేశమును, చాళుక్యరాజగు రెండవ పులకేసి చక్రవర్తి దక్షిణా పథమును పరిపాలించునపుడు గ్రంథాలయములు ఇండియాలో అంతటను వ్యాపించియుండును.

౧౧వ శతాబ్దిని భోజరాజు పండితుఁడగుటచే గ్రంథాలయము స్థాపించె. చాళుక్యులు మాళవదేశ మును జయించినపుడు ఆపొత్తపు గుడిలోని పొత్తములు తీసికొనిపోయిరి.

చాళుక్యులలో విశాలదేవుఁడు పా. గుడులకొఱకు సొమ్ము హెచ్చుగా వెచ్చించెనఁట. అతని గ్రంథాలయములోని రామాయణము జర్మనిలోని బోన్ విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు చేరిన దందురు.

౧౨వ శతాబ్దిని మహమ్మదుఘోరి ఇండియాపై దండెత్తివచ్చినపుడు ఉత్తరహిందూస్థాన రాజ్యము లలో పా. గుడులు హెచ్చుగాఉండి, మంది తెలివితేటలు గలిగి, వాని నెదిరించి, ఓడించిరి. అదిచూచి, పిదప అతఁడు పా. గుడు లెన్నో పాడుచేయించెనఁట! అతఁడు త్రొక్కినత్రోవనే కొందఱు తురుష్క దండయాత్రికులును త్రొక్కిరి. గ్రంథాలయములు పాడుచేసిరి. బౌద్ధభిక్షులు కొన్నిపొత్త ములు వారికి చిక్కకుండ నేపాళదేశమునకు కొనిపోయిరి. కాని, ఏమి లాభము? అవి అచ్చటి రాజ మంత్రుల మనోదౌర్బల్యము వలననో, ఆంగ్లేయుల ప్రోద్బల ప్రోత్సాహ నైపుణ్యమువలననో, అక్కడ నుండి తరలిపోయి, లండను నగరము చేరినవి. ఇప్పటి గోరిల్లా యుంటలపోరులలో అవి ఏమయినవో! ఏమి కానున్నవో! ఎవరు చెప్పగలరు?

తురుష్కుల దాడులలో ఉత్తరదేశ గ్రంథములు నేపాళమునకు, టిబెట్టుదేశమునకు చేరినట్లు, మధ్య దేశమందలి గ్రంథములు విద్యానగర సామ్రాజ్యమునకు చేరెనందురు. కాని, ఆసామ్రాజ్యమును తురకల దాడికి లోనయ్యె. అపుడు ఎన్ని పోయినవో! ఎన్ని మిగిలినవో! సరిగా చెప్ప వీలులేదు.

భోటాన్ పట్టణమున బౌద్ధవిహారపుపట్టు త్రవ్వునెడ గ్రంథాలయ మొకటి బయలుపడె. తురు ష్కులదాడికి వెఱచి, అది పాతిపెట్టియుందురని డాక్టరు సైన్ గారు వ్రాసిరి. అందు ౭ భాషలలో వ్రాసిన ౪ వేల పొత్తములు కలవు. అది సమగ్రదేవాలయ గ్రంథాలయమని తేలినదఁట! అనఁగా ఒక్కొక విషయమునుగూర్చి ప్రత్యేకముగా ఒక్కొక గ్రంథాలయ మేర్పఱుచుట మంచిదని యిప్పుడు మనమనుకొనుచుండ ఆపద్ధతి మన పూర్వులే వాడుకలోనికి తెచ్చినట్లు దీనివలన తేటపడినది.

కొందఱు మహమ్మదీయులు పొత్తములు కాల్చివేసి, పొత్తపుగుడులు పెక్కులు పాడుచేసినారు. కాని, కొందఱు పొత్తములను కాపాడి, పా. గుడులుపెట్టి పోషించినారు. తుగ్లక్ ఫిరోజిషాచక్రవర్తి ౧౪వ శతాబ్దిలో జ్వాలాముఖి దేవాలయమున ౩ వేల పొత్తములున్నట్లు తెలియవచ్చినపుడు, అవి ఢిల్లీకి చేర్చి, అందలి ముఖ్యగ్రంథములను అరబ్బీ-పారసీ భాషలలోనికి తర్జుమాచేయించె. మొగల్ చక్రవర్తులలో హుమయూన్ ౧౬వ శతాబ్దిని గ్రంథాలయములు స్థాపించి, పోషించెనఁట! అతని కొడుకగు అక్బరుమాట చెప్పనక్కఱయేలేదు. ఆయన గ్రంథములను చదివించి, వినుచుండెడివాఁడు; ముఖ్యగ్రంథములు రెండు మూఁడుసార్లుకూడ వినెడివాఁడఁట. భారతము, రామాయణము, అథర్వ

వేదము, లీలావతీగణితము, తేజకమను జ్యోతిషగ్రంథము, ౪ వేల యేండ్ల కాశ్మీరచరిత్ర, హరివంశము, నలచరిత్ర మొ. పొత్తములు పార్సీలోనికి మార్పించె; కొన్ని క్రొత్తపొత్తములు వ్రాయించె. ఆయన గ్రంథాలయము మఱొకచో దొరకని పొత్తములతో ఒప్పుచుండె. దానిలో ఒకభాగము రాణివాసమున స్త్రీలకొఱకుండినను, హెచ్చుభాగము సభాభవనమున బహిరంగముగానే ఉండెడిదట. ఆ పొ. గు. లోని భారతము ఉత్తర జయపుర గ్రంథాలయము చేరినది. దానిలో చక్కని బొమ్మలును, వానిపైని ఉల్లిపొరవంటి లేడితోలుకప్పులును కలవట. ౧౭ వ శతాబ్దిని జహాంగీరు షాజహానులును గ్రంథాలయపోషకులే. యూసప్ జులెయి—అను పొత్తము వ్రాసిన నూరలీకి జహాంగీరు ౧,౦౦౦ మొహరీలు కానుకచేసెనట! షాజహాను చక్రవర్తి పెద్దకొడుకు దారా తన ముత్తాత అగు అక్బరువలె విద్యాప్రియుఁడేగాక, కృతికర్త; పెక్కు పొత్తములువ్రాసె; ఉపనిషత్తులలో కొన్నిభాగములు పార్సీలోనికి తర్జుమాచేసె. అట్టిచో, అతఁడు గ్రంథాలయ ప్రియుఁడగుటలో వింతఏమున్నది ? ఔరంగజేబు గోలకొండ—హైదరాబాదులు జయించి, అందు వ్రాఁతపొత్తములు ఢిల్లీ గ్రంథాలయమునకు చేర్చె. కాన, ఢిల్లీగ్రంథాలయ మపుడు మిక్కిలి గొప్పదయి ఉండవలె.

అప్పటి వ్రాఁతపొత్తములలో చిత్రకారులు బొమ్మలు చేర్చి, వాని వాడుక హెచ్చించుచుండిరి. ఎన్నో పొత్తపుగుడులలో విడిబొమ్మల పొత్తములుకూడ ఉండెడివి. చక్రవర్తుల పోషణమున ఎంతో పెంపొందిన ఢిల్లీ పొ. గు. మొగల్ సామ్రాజ్యము నాశనముతో నశించెనని తెలియవచ్చినపుడు గ్రంథాలయాభిమానుల డెందములు కుందకుండుటెట్లు? ౧౮ వ శతాబ్దిలో ఢిల్లీ పొ.గు.లోని పొత్తములు పెక్కులు అయోధ్యనవాబు పొ. గుడికి చేరె. కాని, ౧౮౫౬ లో అయోధ్య ఆంగ్లేయులకు లోఁబడినపుడు, అచ్చటి పొత్తములు చాలవఱకు కలకత్తాకు చేరినవి; కొన్ని లక్నోకుచేరినవి. ౧౮౫౭ లో జరిగిన సిపాయీల తిరుగుబాటులో ఢిల్లీ-లక్నో నగరములు పాడైనవి; అపుడు పొ. గుడులును పాడయ్యెనని వేఱె చెప్ప నేల ? లక్నో ముట్టడిలో కిటికీల కడ్డుపెట్టుకొనుటకు పొత్తములు వాడిరి. అది ముగిసిన పిదప అవి సిపాయీలకు వంటకట్టెలుగా పనికివచ్చినవి! ఏలమువేయఁగా కొన్ని ఏష్యాటిక్ సొసైటీవారు కొనినారఁట ! అపుడు రామపుర నవాబు అరబ్బీ పార్సీపొత్తములెన్నో కొని, తన పొత్తపుగుడి పెంచెనఁట. ఆ పొ. గు. లోని అరబ్బీ పొత్తములు ౪,౪౬౭; పార్సీపొత్తములు ౪,౨౫౩ బ్యాంకిపుర సంస్థానమందును పోగా మిగిలిన పొత్తములు భద్రపఱచిరఁట.

ఉత్తరదేశమున ఖుదాబక్షును, దక్షిణదేశమున తంజావూరిలో శరభోజీమహారాజును పొ. గు. కడంకలో మిక్కిలి పాటుపడిరి.

నేపాళము, జమ్ము, బికనీరు, అళ్వారు, మైసూరు, నైజాము మొ. సంస్థానములవారు గ్రంథాలయములు పెట్టి పోషించిరి. టిప్పుసుల్తాను మంచి పొ. గు. కూర్చె; అందలి పొత్తములుకొన్ని ఇంగ్లాండు చేరె; కొన్ని విల్లియమ్‌కోట కాలేజీకి చేరె.

అల్వారు పొ. గుడికి భానుసింగు మహారాజు ఎన్నో పొత్తములు చేర్చెనఁట. పదునైదు దినములకు ఒక పొరటచొప్పున అఘామీర్జా వ్రాసిన 'గుల్‌స్థాన్' పొత్తము, దీనిలో తలదాఁచుకొనినది. ఇందు ఎన్నో వన్నెకెక్కిన బొమ్మలుగలవు. దీని అంచులపై నగిషీలు, గులాము ఆలీఖాను- బలదేవు- అను పనివాండ్రు చేసిరఁట! ఇది తయారగుటకు లక్షరూపాయలై యుండునఁట! ఒక అల్వారుప్రభువు రు ౩ వేలును, కొసరు మంచి దుస్తుల కానుకయు ఇచ్చి, చక్కని ఖురాను వ్రాఁతపొత్తము కొనెనఁట! మూలము ఊదా సిరాతోను, టీక ఎఱ్ఱ సిరాతోను వ్రాసినారఁట!

మొగల్ సామ్రాజ్యము రూపుమాసి దేశ మరాజకమైనపుడు, అప్పటికే మన దేశమున చేరి — కొంత అధికారమును పలుకుబడియు గడించిన పలుతెగల తెల్లవారు - పోర్చుగీసువారు, ఒలాందులు, డేనులు, ఫ్రెంచివారు, బ్రిటీషువారు - తమకు నచ్చిన పొత్తములను ఎట్లో సంగ్రహించి, తమ తమ దేశములకు

చేర్చిరి. అవి యూరపుఖండములోని - ఆయా నాడులలోని గ్రంథాలయములకు అలంకారములయ్యె. ఇట్లు మన యిండియానుండి కలిమి చెలిమియే కాక, పలుకు వెలఁదియు తన కొన్ని రూపులతో వెడలి, వెలినాడులపాలై పుట్టినవాటికి జంట బీదతికము సమకూర్చె. ఇందువలన ఇండియాలో పుట్టిన పొత్తములుకూడ పైకిపోయి మన పొ. గు. కడెంకకు కొఱఁత కలిగె. ఒక అరిది జైనలిఖిత పుస్తకము అమెరికాలోని స్మిత్ సోనియన్ ఇన్స్టిట్యూట్ వారు రంగులతో వెల్లడించిరి! శివాజీపటము పారిసు చేరె!! అక్కన్న, మాదన్నల పటములు ఆమ్స్టెర్ డము చేరె!!!

ఈకొఱఁత ఏల కలిగెనని తలపోయుచో, భరతఖండములోని వారికి అప్పటికే ఏర్పడిన కలసికట్టుతనములేమి - ఎదుటిపచ్చచూచి ఓర్వలేమి - సోమరితనము - తొలితెగువ - వెనుకతీఁత మొదలగు లోట్ల వలననే అని తేలును. ఇంతఏల? మన బానిసతనమే ఇది నిజమని చాటుచున్నది. దీనికంటె మఱి వేఱు తార్కాణ మేమి కావలె?

## ఇండియా పొ. గు. మనుగడ – ఇప్పటిది

ఢిల్లీ సామ్రాజ్యము నశించిన పిదప ఏర్పడిన సంస్థానములలోను - జమీందారీలలోను నష్టశేషములగు గ్రంథాలయములును, తెల్లతెగలవారి సంబంధమువలన వారి వారి భాషల పొత్తములతోడి పొ. గుడులును దేశమున వెలసె. సర్వకలాశాలలు, కలాశాలలు మొ. విద్యాసంస్థలలో ప్రత్యేక గ్రంథాలయములు బయలుదేఱె. గృహస్థపండిత గ్రంథాలయములు మఱికొన్ని ఏర్పడె.

కలకత్తాలోని 'ఇంపీరియల్ లైబ్రరీ'యును (సామ్రాజ్య గ్రంథాలయమును) చెన్నపురిలోని కానిమరా లైబ్రరీయును, అడియారు దివ్యజ్ఞానసమాజ గ్రంథాలయమును, పూనాలోని భండార్కరు లైబ్రరీయును, ఇంకను మఱికొన్నియును మాత్రమే ఒకమోస్తరు పెద్ద గ్రంథాలయము లనఁదగును.

నేపాళమున రతాన్ పురమున ౪౦ పెట్టెల వ్రాఁత పొత్తములును, జసల్ మీరునందలి పరశురామ గ్రంథాలయమున వేలకొలఁది వ్రాఁత పొత్తములును, ఇట్లే కనరాజిల్లాలోని మురచిద్రిలోని జైన గ్రంథాలయమందును, అహమ్మదాబాదు- నద్వాను- సూరతు- కాంబే- తరాదు- భట్నీరు గ్రంథాలయములందును వేలకొలఁది పొత్తములును కలవని తెలియవచ్చుచున్నది.

౧౯౧౦ లో అమెరికా పద్ధతినిబట్టి బరోడాలో బయలుదేఱిన పొ. గు. కడెంక అచ్చటి దొరతనమువారి తోడ్పాటుతో బాగుగా జరుగుచున్నదని ఇదివఱకే అనుకొంటిమి. అదే ఇండియాకెల్ల ఆదర్శముగా ఉన్నది. అచ్చటి పొ. గుడులలోని పొత్తము లెక్కకు సుమారు ౮ లక్షలుండును.

బంగాళ- పంజాబు- చెన్నపురి- బిహార- బొంబాయి రాష్ట్రములలో గ్రంథాలయోద్యమము ఒక మోస్తరుగా పనిచేయుచున్నది. కొన్ని పట్టణములలోను- కొన్ని పల్లెలలోను పొ. గు. పని కొంత వఱకు జరుగుచున్నను, జరుగవలసిన పని దీనికి ఎన్నోరెట్లు హెచ్చనక తప్పదు. పట్టణములలోని పని ఇప్పటికంటె బాగుగా ప్రయత్నించుచో కొంతవఱకేని తృప్తికరముగా జరుగవచ్చును. కాని, పల్లెలలో పనినిగూర్చి అటు చెప్ప వీలులేదు. ఏమందురా? మన పట్టణములు ౨,౫౦౦; మన పల్లెలు ౭,౫౦,౦౦౦! కాన, మనదేశమున పల్లెలలో పని బాగుగా జరిగినపుడే మనము సంతసింపవలసి యుండును. దీనికి తోడు మన ఇండియా పొ. గు. కడెంకకును, పైనాడుల పొ. గు. కడెంకకును ఎంతో తేడాకలదు. చదువుకొనినవారికి తోడ్పడునది అక్కడిది; చదువు వచ్చిన కొలఁదిమందితో పాటు చదువురాని పెక్కువమందికి తోడ్పడవలసినది ఇక్కడిది; అక్కడ చదువుకున్నవారు ౧౦౦కి షుమారు ౯౦ మంది; ఇక్కడ ౮ మంది. ఈ తేడాకు కారణము, పైనాడులలో మంది చదువుకొఱకు సొమ్ము హెచ్చుగా వెచ్చించుచుండ, మననాట మిక్కిలి తక్కువగా వెచ్చించుటయే దీనికొక తార్కాణ. – లండనులోని ౪౪ లక్షలమందికి చదువు ఖర్చు రు ౧౭ కోట్లు; ఇండియాలో బ్రిటిషుప్రభుత్వముక్రిందనున్న సుమారు ౨౭ కోట్లమందికి చదువు ఖర్చు సుమారు రు. ౧౭ కోట్లు– అనఁగా అక్కడ తల ౧ కి

ఈ విషయముల నన్నిటిని మనమున నుంచుకొని సంఘమునకు స్థిరవసతిని కల్పించి కార్యాలయమునకుగా నొక భవనమును నిర్మింపదలచి బెజవాడలో పటమటలంకకు సమీపమున బెజవాడ–బందరురోడ్డు ప్రక్కన 1 ఎకరము స్థలమును రు 1800–0–0 లకు కొనియుంటిమి. ఇందు రు 1000–0–0 పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మూరి సీతారామయ్యగారిచ్చిరి. ఇదిగాక ఇప్పటికి క్రింది మొత్తములు వసూలైనవి.

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ నాగినేని వెంకయ్యగారు, గుంటూరు జిల్లాబోర్డు సభ్యులు ధేనువకొండ, ఒంగోలు తాలూకా | రు | 100 | 0 | 0 |
| ,, వెనిగళ్ళ సత్యనారాయణరావుగారు, దుగ్గిరాల | రు | 50 | 0 | 0 |
| ,, యలవర్తి శ్రీరాములుగారు, యలవర్రు | రు | 50 | 0 | 0 |
| ,, వల్లూరు వెంకటసుబ్బయ్యగారు, పటమటలంక | రు | 25 | 0 | 0 |
| ,, పూటుకూరు జయరామదాసుగారు, వేటపాలెం | రు | 25 | 0 | 0 |
| ,, చుండూరు కన్నయ్యశ్రేష్ఠిగారు, నెల్లూరు | రు | 25 | 0 | 0 |
| ,, డాక్టరు ఉప్పల సుందరరామయ్యగారు, యం బి.,బి.యస్., తెనాలి | రు | 25 | 0 | 0 |
| ,, రావి సత్యనారాయణగారు, బి. ఏ, తెనాలి | రు | 25 | 0 | 0 |
| ,, ఆలపాటి వెంకటకృష్ణయ్యగారు, గోవాడ | రు | 25 | 0 | 0 |
| ,, గిడుగు నరసింహమూర్తిగారు, బి. ఏ., ఎల్. టి., తురుమెళ్ళ | రు | 25 | 0 | 0 |
| ,, డాక్టరు గాధిరాజు కోటంరాజుగారు, పెదపాలెం | రు | 25 | 0 | 0 |
| తెనాలి తాలూకా గ్రంథాలయసంఘము | రు | 25 | 0 | 0 |
| ,, చల్లపల్లి చినఆదెయ్యగారు, గ్రామమునసబు, చేవేంద్రపాడు | రు | 25 | 0 | 0 |
| ,, నన్నపనేని వెంకట్రావుగారు, ఆయితానగరప్పాడు–తెనాలి | రు | 25 | 0 | 0 |
| ,, యడ్ల శివలింగవరప్రసాదరావుగారు, చేవేంద్రపాడు | రు | 25 | 0 | 0 |
| ,, ఆలపాటి రవీంద్రనాథచౌదరిగారు, గోవాడ | రు | 25 | 0 | 0 |
| ,, వెలువోలు సీతారామయ్యగారు, అమృతలూరు | రు | 25 | 0 | 0 |
| ,, డాక్టరు వెంపటి సూర్యనారాయణగారు, యల్.యం.పి., తెనాలి | రు | 25 | 0 | 0 |
| ,, శరణు రామకోటయ్యగారు, పెదపూడి | రు | 25 | 0 | 0 |
| ,, వాసిరెడ్డి రంగనాయకులుగారు, పెదపాలెం | రు | 25 | 0 | 0 |
| ,, తాళ్లూరు వెంకటసుబ్బయ్యగారు, కొలకలూరు | రు | 5 | 0 | 0 |
| వసూళ్ల మొత్తం | రు | 1630 | 0 | 0 |

వాగ్దత్తములు

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ ఆలపాటి సూర్యనారాయణగారు, గోవాడ | రు | 50 | 0 | 0 |
| ,, బెజవాడ శివకోటారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం | రు | 25 | 0 | 0 |
| ,, వెలగా కోటీశ్వరరావుగారు, మాచవరం | రు | 25 | 0 | 0 |
| ,, యడ్లూరి సత్యనారాయణగారు, మాచవరం | రు | 25 | 0 | 0 |
| ,, మరెడ్డి గురవారెడ్డిగారు, తూములూరు | రు | 25 | 0 | 0 |
| ,, కొమ్మూరి రత్తమ్మగారు, పటమటలంక | రు | 25 | 0 | 0 |
| ,, డాక్టరు కూచిభొట్ల వెంకటేశ్వరశర్మగారు, యల్. ఐ. యమ్. | రు | 25 | 0 | 0 |

| | | | | |
|---|---|---|---|---|
| ,, వల్లపల్లి ఆదెయ్యగారు, శేవేంద్రపాడు | రు | 25 | 0 | 0 |
| ,, పిడికిటి సీతారామయ్యగారు, గుండిమెడ | రు | 25 | 0 | 0 |
| ,, శాస్త్రి నారాయణరావుగారు, బెజవాడ | రు | 25 | 0 | 0 |
| ,, శాస్త్రి బసవపున్నయ్యగారు, కూచిపూడి | రు | 25 | 0 | 0 |
| ,, కొల్లూరు కోటయ్యగారు, మూల్పూరు | రు | 25 | 0 | 0 |
| ,, వేజెళ్ల రాఘవయ్యగారు | రు | 25 | 0 | 0 |
| రావలసిన మొత్తములు | రు | 350 | 0 | 0 |

ఈ మొత్తములు వసూలైన స్థలము బాకీ పూర్తిగ తీరిపోవును. తదుపరి ఈ స్థలములో రు 1500-0-0 సుమారు వెచ్చించి ఒక చిన్న భవనమును నిర్మించవలసి యున్నది. ఈ భవననిర్మాణము పూర్తియగు లోపల ముఖ్యమగు గ్రంథముల కొన్నింటిని సేకరించదలచుచున్నాము. ఇప్పటికి కొందఱు దాతలు మాకీవిషయమున తోడ్పడి యున్నారు. ఈ సంఘమువారు మున్ముందు నడుపబూను కేంద్ర గ్రంథాలయమున కీపుస్తకములు ప్రాతిపదికగ నుండగలవు.

ఆదాయము

పైని వివరింపబడిన కార్యక్రమమెల్ల క్రమముగ సాగుటకు ధనమెంతయో కావలసియుండును. ఉదారులగు వ్యక్తులనుండియు, జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, కోఆపరేటివ్ బ్యాంకులు మున్నగు సంస్థలనుండియు విరివిగ మనము విరాళములను సంపాదించవచ్చును. ఇట్లు వసూలుపఱచు ధనముతో ముందు భవన నిర్మాణమును మనము పూర్తిచేయవచ్చును. కాక సంఘముయొక్క నిత్యకార్యక్రమమున కుపయోగపడుటకై అభిమానులగు వ్యక్తులను, గ్రంథాలయములు, పంచాయతీబోర్డులు మున్నుగాగల సంస్థలను సాధారణ సభ్యులుగ వందలకొలదిని మనము చేర్చుటవసరము. పైన ౨వ పేరాలో వివరించిన పంచాయతీ జర్నల్ లోని లోకల్‌బోర్డు ఇన్‌స్పెక్టరువారి 527వ సర్క్యులరు మన కీవిషయమున చాలగ సాయపడగలదు. దీని ఆధారముతో గ్రంథాలయసేవకు తెచ్చుటెవారచ్చుట పని చేయుచో సంఘముయొక్క మామూలు కార్యక్రమమునకు సరిపడు ధనమును మనము సేకరించగలుగుదుము. మఱియు ఆంధ్రావనిగల అన్ని గ్రంథాలయములు తమ అభివృద్ధికొరకై శ్రమించు నీసంఘమున విధిగ సభ్యులగుటకు ప్రారంభించిన గాని దీని యునికి సార్థకము కాజాలదు. సహకారసంఘములు సహితము విద్యాప్రచారమునకై తమ సాముదాయిక నిధులను వినియోగించుటకు వీలుకలదు గాన ఆంధ్రజాతి ఔన్నత్యమున కన్నివిధముల తోడుపడు గ్రంథాలయోద్యమ వ్యాప్తికై కృషిసల్పు మా సంఘమున సభ్యులుగ జేరియు, దీనికి చేతనైన విరాళముల నొసంగియు చేయూతనిచ్చునట్లు సహకారోద్యమ నాయకులు తోడ్పడగలరని నా యాశ.

## ముగింపు

అయితే ఐకమత్యములేక మనకార్యము గట్టెక్కుట దుస్తరము. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్కయు, దీనిశాఖలుగ నున్న జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయ సంఘములయొక్కయు నిర్వాహకులందఱును శిక్షణతోను, నిష్కల్మషమైన సేవాభావముతోను పనికిబూనిన మన అభివృద్ధి నెవ్వరుగాని అరికట్టజాలరు. ఇట్టి శక్తిని మనకు పరమేశ్వరుడు ప్రసాదించుగాక! అచిరకాలములో ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము అత్యంతముగ వ్యాప్తిజెంది భరతఖండమునను ఖండాంతరములందును నశించని యశము నార్జించగలుగు నట్లాశీర్వదించుటకై ఇచ్చటజేరిన పెద్దలను వేడుచు నింతటితో ముగింతును.

రాజమహేంద్రవరము,
౧౫—౧—౧౯౪౧.

పాతూరి నాగభూషణం
కార్యదర్శి

# సమాచారాలు - సలహాలు

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

### ఆం. దే. గ్రం. సంఘ సమావేశములు

21-11-40 వ తేదీ గురువారం సాయంత్రం 3 గంటలకు బెజవాడలోని శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయభవనమున ఆం. దే. గ్రం. సం. పాలకవర్గసభ్యులు సమావేశమై చేసిన తీర్మానములు.

హాజరు: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి, శ్రీ సూరపనేని వెంకటరత్నం,
శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ కొమ్మా సీతారామయ్య, శ్రీ వేగేశన సూరపరాజు,
శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు, శ్రీ మల్లెల శ్రీరామమూర్తి.

తీర్మానములు :

౧. ఈ సమావేశమునకు అధ్యక్షులుగాని, ఉపాధ్యక్షులుగాని హాజరుకానందున శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారిని అధ్యక్షులుగా ఎన్నుకోవడమైనది.

౨. కీ. శే. బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీ కూచి నరసింహంపంతులుగార్లయొక్క మరణముల కీసభవారు చింతించుచు వారల యాత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచున్నారు.

3. 1940-41 వ సం॥నకు ఈసంఘ పాలకవర్గమునందలి ఖాళీస్థానములకు క్రిందివారిని ఎన్నుకోవడమైనది.

శ్రీ యక్కలి రామయ్యగారు, సహాయ కార్యదర్శి, ఎర్రగొండపాలెం, కర్నూలుజిల్లా
సభ్యులు: శ్రీ యం. వి. పాపన్నగుప్తగారు, మదనపల్లి
శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు, కడప
శ్రీ హాలాహర్వి సీతారామరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్., ఎం. ఎల్. ఏ., బళ్లారి.

౪. 1940 వ సం. మే నెలారంభమునుండి 20-11-40 వ తేదీవరకు గల సంఘముయొక్క ఆదాయవ్యయ లెక్కలూ, కార్యాలయ భవననిర్మాణపు లెక్కలూ చదివి అంగీకరించడమైనది.

౫. ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్లో ఈసంఘము సభ్యత్వమును పొందుట కంగీకరించుచూ కార్యదర్శికి చందా ధనమును పంపుటకు అధికారము ఇవ్వడమైనది.

౬. ఇండియన్ లైబ్రరీ అసోసియేషనుకు ఈ సంఘప్రతినిధిగ కార్యదర్శి పాతూరి నాగభూషణం గారిని ఎన్నుకోవడమైనది.

౭. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారికి అరువదియేండ్లు నిండుటచే వీరి షష్టిపూర్తి ఉత్సవము చేయ సంకల్పించిన పెద్దల ప్రయత్నమున కీ సంఘమువారు తమ సంతసమును వెలిబుచ్చుచు, ఆ యుత్సవమురోజున వారి కీ సంఘపక్షమున సన్మానపత్రమును సమర్పింప తీర్మానించుచున్నారు.

౮. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులుగ నుండియు, తెలుగున చక్కని గ్రంథములు వ్రాసియు ఆంధ్రుల విద్యాభివృద్ధికి తోడ్పడుటయే గాక ఈసంఘము స్థాపింపబడిన నాటినుండి ఆంధ్ర గ్రంథాలయోద్యమ వ్యాప్తికి సహితము చాలగ తోడ్పడుచున్న శ్రీవారిని ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమునకు శాశ్వత గౌరవ సభ్యులుగ ఎన్నుకొనుటకు సర్వసభ్య సభవారికి సూచించడమైనది.

౯. పై సందర్భమున శ్రీ రెడ్డిగారిచే రచించబడిన 'ముసలమ్మమరణము' అను గ్రంథమును పునర్ముద్రణ చేయుటకై సంఘాధ్యక్షులగు శ్రీ హరిసర్వోత్తమరావుగారు చేసిన సూచనను అంగీకరించడమైనది.

౧౦. ఆంధ్రప్రముఖులును, బహుగ్రంథరచయితలును నగు శ్రీయుత డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి షష్టిపూర్తి మహోత్సవసందర్భమున ఈ సంఘపక్షమున వారికి సన్మానపత్రమును సమర్పించుటకు తీర్మానించడమైనది.

౧౧. సుప్రసిద్ధ గ్రంథాలయోద్యమసేవకులగు మధురకవి నాళం కృష్ణరావుగారి షష్టిపూర్తి మహోత్సవసందర్భమున ఈ సంఘపక్షమున వారికి సన్మానపత్రము సమర్పించుటకు తీర్మానించడమైనది.

౧౨. తమబోర్డు ఏరియాలోనున్న సెకండరీ, హాయ్యర్ ఎలిమెంటరీపాఠశాలల కన్నిటికి 'ఆంధ్ర గ్రంథాలయం' పత్రికను ఒకసంవత్సరముపాటు తెప్పించుటకు తీర్మానించిన గుంటూరుజిల్లా బోర్డువారి నీ సంఘమువా రభినందించుచు, ఆంధ్రదేశములోని తక్కిన జిల్లాబోర్డులుకూడ వీరి మార్గము ననుసరించునని నమ్ముచున్నారు.

౧౩. ఈసంఘమునకు రు 20-0-0 విరాళమిచ్చిన విజయవాడ కో-ఆపరేటివు బ్యాంకివారికి ఈ సంఘమువారు కృతజ్ఞతను వెలిబుచ్చుచు, ఆంధ్రదేశములోని సహకారసంఘములన్నియు ఇదే విధమున విరాళములిచ్చియు, ఈ సంఘసభ్యులుగ జేరియు మా కార్యక్రమమునకు తోడ్పడ గోరుచున్నారు.

౧౪. ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు చిహ్నముగ ఒక పతాకమును తయారు చేయవలసినదిగ దుగ్గిరాల భాషాభిలాషిణిసంఘమువారు చేసిన సూచననుసరించి క్రిందివారిని ఇందునిమిత్తమై ఉపసంఘముగ నేర్పాటుచేయుచు వారి ఆలోచన ననుసరించి దీనిని సిద్ధపరచి వెల్లడించుటకు కార్యదర్శి కధికారమీయడమైనది.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్.
డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ఎం. ఏ., పిహెచ్. డి. (లండను)
శ్రీ అడివి బాపిరాజుగారు, బి. ఏ., బి. ఎల్.
శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.,
శ్రీ పాతూరి నాగభూషణంగారు, కార్యదర్శి.

౧౫. 22 వ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభను 1941 వ సం. జనవరి మాసములో రాజమహేంద్రవరములో జరిపించుటకు గౌతమీగ్రంథాలయము వారిని కోరడమైనది.

(సం.) వ. ఆళ్వారుస్వామి
సభాధ్యక్షులు

22-12-40 వ తేదీ ఆదివారము రాత్రి 10 గంటలకు బెజవాడ తాలూకా కోలవెన్ను గ్రామములోని శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయ భవనమున ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గ సమావేశము జరిగినది.

హాజరు: శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ కొమ్మా శీతారామయ్య.

ఈసభకు కనీససంఖ్య హాజరు కానందున సమావేశము నిలుపుదల చేయడమైనది.

(సం.) పాతూరి నాగభూషణం
కార్యదర్శి

14-1-41 వ తేదీ రాత్రి 10½ గంటలకు ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గ సమావేశము రాజమహేంద్రవరమునందలి శ్రీ గౌతమీగ్రంథాలయ భవనమున శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎం. ఏ. గారి అధ్యక్షతను కూడినది.

హాజరు: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శ్రీ వేగేశన సూర్యపరాజు,
శ్రీ మల్లెల శ్రీరామమూర్తి, శ్రీ నరసింహదేవర సత్యనారాయణ,
శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, శ్రీ పాతూరి నాగభూషణం.

తీర్మానములు :

౧. శ్రీ నాగినేని వెంకయ్యగారు (ఉపాధ్యక్షులు), శ్రీ యక్కలి రామయ్యగారు (సహాయ కార్యదర్శి) లోగడ పంపిన రాజీనామాల నంగీకరించడమైనది. వీరిస్థానే శ్రీ పాలుట్ల విశ్వనాథరావుగారిని (వకీలు, మార్కాపురం) ఉపాధ్యక్షులుగను, శ్రీ వుప్పల రాజగోపాల కృష్ణయ్యగారిని సహాయ కార్యదర్శిగను ఎన్నుకొనడమైనది.

౨. భవన నిర్మాణోప సంఘమును రద్దుపఱచి దీని కార్యక్రమమును పాలకవర్గమువారే నిర్వహించ వలసినదిగ తీర్మానించడమైనది.

(సం.) గా. హరిసర్వోత్తమరావు
అధ్యక్షులు

9-3-41 వ తేదీ ఆదివారం మధ్యాహ్నం 3 గంటలకు ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గము బెజవాడలోని గాంధీనగరమందున్న శ్రీ హనుమంతరాయ గ్రంథాలయమున సమావేశమైనది.

హాజరు: శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ కొమ్మా శీతారామయ్య,
శ్రీ మల్లెల శ్రీరామమూర్తి.

తీర్మానములు :

౧. ఈ సమావేశమునకు అధ్యక్ష, ఉపాధ్యక్షులలో నెవ్వరుగాని హాజరుకానందున శ్రీ కొమ్మా సీతారామయ్యగారిని అధ్యక్షులుగ నెన్నుకొనడమైనది.

౨. ప్రస్తుత నివేదిక సంవత్సరము త్వరలో ముగియనున్నందున తమ చందాల చెల్లించనట్టియు, ప్రస్తుతము కారాగారములలో నున్నట్టియు పాలకవర్గ సభ్యుల స్థానమున క్రొత్తవారిని నియమించుటనవసరమని ఈసంఘమువా రభిప్రాయపడుచున్నారు.

3. 1941 వ సం. మే మాసములో గ్రంథాలయ శిక్షణతరగతుల నేర్పాటుచేయుటకును, ఇందు కవసరమైన ఏర్పాటులనన్నిటిని జేయుటకును, కార్యదర్శి కధికారమీయడమైనది.

౪. సంఘ కార్యాలయములో పనిచేయుటకు నెల 1కి రు 12-0-0 లకు మించని వేతనముపై వెంటనే ఒకరిని మేనేజరుగ నియమించుటకు తీర్మానించడమైనది.

౫. ప్రస్తుత నివేదిక సంవత్సరపుగడువును మార్చి నెలాఖరువరకు పొడుగించుటకు తీర్మానించడమైనది.

౬. సంఘాధ్యక్షులు శ్రీ గా. హరిసర్వోత్తమరావుగారు రచించిన 'వయోజనవిద్య — మొదటి పుస్తకము'ను సంఘపక్షమున ప్రచురించుటకు తీర్మానించడమైనది.

(సం.) కొమర్రాజు సీతారామయ్య
సభాధ్యక్షులు

1-6-41 వ తేది ఆదివారం సాయంత్రము 4 గంటలకు ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గము రేపల్లెం(ద్ర)పాడు 'నవ్యభారతి' గురుకులంలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను సమావేశమైనది.

హాజరు: శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు,
శ్రీ మల్లెల శ్రీరామమూర్తి, ,, కొమర్రాజు సీతారామయ్య.

తీర్మానములు :

౧. 1940-41 వ సం. కార్యనివేదికను తయారుచేసి ప్రకటించి సర్వసభ్యసభలో నివేదించుటకు కార్యదర్శికి అధికారమీయడమైనది.

౨. 1940—41 వ సం. సంఘముయొక్క లెక్కలను పరిశీలించుటకై వేటపాలెం వాస్తవ్యులైన శ్రీ యస్. రామసుబ్బారావుగారిని కోరడమైనది.

3. సుప్రసిద్ధ దేశనాయకుడు, అఖండ మేధానిధి, ఒకప్పుడు దేశీయ మహాసభాధ్యక్షుడు, వయోజన విద్యాభిమాని యైన శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారి మరణమునకు ఈ సంఘమువారు హృదయపూర్వకముగ విచారమును తెలుపుచు, వారి ఆత్మశాంతికై పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

(సం.) గా. హరిసర్వోత్తమరావు
అధ్యక్షులు

---

## దశమ కృష్ణాజిల్లా గ్రంథాలయమహాసభ—కోలవెన్ను

పై మహాసభ 22-12-40 వ తేదీ బెజవాడ తాలూకా కోలవెన్ను గ్రామమున శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయ ప్రాంగణమున ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షులు డాక్టరు తేతలి సత్యనారాయణ మూర్తిగారి అధ్యక్షతను సమావేశమైనది.

పశ్చిమగోదావరిజిల్లా గ్రంథాలయ సంఘ కార్యదర్శి డాక్టరు పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు సభను ప్రారంభించుచు బ్రిటిష్‌వారి పరిపాలనలో మన విద్యాభివృద్ధియొక్క మందగమనమునుగూర్చియు, రష్యాదేశమున పంచవర్ష ప్రణాళికలద్వారా అచ్చటిప్రభుత్వము విద్యావిషయమై గావించిన యేర్పాటులనుగూర్చియు, స్వరాజ్యసంపాదనకు విద్య ఎంత ఆవశ్యకమో, విద్యాప్రచారమునకు గ్రంథాలయము లెట్లుపకరించునో, గ్రంథాలయాల నిర్వహణమునకు ధనావశ్యకతఎట్టిదో, స్థానిక సంస్థలు- సహకారసంఘములు ఈవిషయమై ఎట్లు తోడ్పడగలవో, ప్రభుత్వమువారు గ్రంథా

లయాల విషయమై గావించిన ఉత్తర్వులెట్లు ఈ ఉద్యమాభివృద్ధి కాటంకములుగనున్నవో, గ్రంథాలయ నిర్వహణ మెట్టిచిక్కులతో కూడియున్నదో విపులముగా చెప్పి దేశౌన్నత్యము నభిలషించు ప్రతియొక్కరును కష్టసాధ్యమగు గ్రంథాలయనిర్వహణ కార్యమును విడువక పూనుట విధియని హెచ్చరించిరి.

అధ్యక్షులు డాక్టరు సత్యనారాయణమూర్తిగారు అచ్చటి గ్రంథాలయ భవననిర్మాతలగు యార్లగడ్డ ఈశ్వరమ్మగారి నభినందించుటతో తమ ప్రారంభోపన్యాసము నుపక్రమించిరి. మన సర్కారువారు సైన్యసంరక్షణకై తమ ఆదాయములో నూటికి 75 రూపాయలను వెచ్చింతురుగాని దేశ సౌభాగ్యమునకు మూలకందమగు విద్యనిమిత్తము కావలసిన మొత్తము ఖర్చుచేయరనియు, జస్టిసు పరిపాలనలో సహితము సాలుకు 10 వేల రూపాయలకు తగ్గని విరాళములు గ్రంథాలయముల కీయబడగా కాంగ్రెసు మంత్రుల కాలములో దీనిని బొత్తుగ తీసివేయుట విచారకరమనియు, గ్రంథాలయాల అభివృద్ధికి లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరువారి ఉత్తరువు లెంతయు ఆటంకములుగా నున్నవనియు, పరపతిసంఘాలవలె గ్రంథాలయములును నిర్బంధముగ రిజిష్టరు చేయబడవలెననియు, గ్రంథభాండాగారులకు శిక్షణతరగతుల నేర్పఱచుట చాల అవసరమనియు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ప్రభుత్వ సహాయము లభించకున్నను, లోకల్ బోర్డులు, పరపతిసంఘాలు, దానశీలురు పూనుకొని దేశాభివృద్ధికి దోహదమొసగవలెననియు చెప్పి తమ గంభీరోపన్యాసమును ముగించిరి.

అనంతరము సభకు విచ్చేసిన ప్రతినిధులయు, పెద్దలయు ఫోటో తీయబడెను. తరువాత శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ కిన్నెరసాని పాటలను కొన్నింటిని పాడి సభికుల నానందింప జేసిరి. కృష్ణాజిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శి శ్రీ మాజేటి రామచంద్రరావుగారు తమ సంఘనివేదికను సభలో చదివి వినిపించిరి.

శ్రీమతి ఈడుపుగంటి వెంకటరత్నమాంబగారి ఉపన్యాసానంతరము శ్రీ పువ్వాడ శేషగిరి రావుగారు (బందరు హిందూకాలేజీ తెలుగుపండితులు) తమ రచనలలో సంక్రాంతి, శ్రీకృష్ణదేవరాయలను గూర్చిన పద్యములను చక్కగ చదివి శ్రోతల సంతోషపెట్టిరి. బందరు హిందూహైస్కూల్ ఉపాధ్యాయులు శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ ఎం. ఎ. గారు 'కవిత్వము' ను గూర్చి ఉపన్యసించిరి.

అధ్యక్షులవారు అవసరముగ వెళ్లవలసివచ్చుటచే వారు బెజవాడకాలేజీ ప్రిన్సిపాలు. డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ., పి హెచ్. డి. (లండను)—గారిని అధ్యక్షస్థానమున నియమించి వెళ్ళిరి.

క్రింది తీర్మానములు అంగీకరింపబడినపిమ్మట శ్రీ కాకుమాను లక్ష్మినారాయణ (కోలవెన్ను), అన్నె సూర్యసూర్యనారాయణ (ఉప్పలూరు) గార్లు తమ ప్రదర్శనములచే ప్రేక్షకులకు ఆనందమును ఉద్రేకమును కలిగించిరి. అధ్యక్షుల ఉపసంహారవాక్యములు, కార్యదర్శి వందనసమర్పణములతో మహాసభ రాత్రి 11 గంటలకు సమాప్తమైనది.

తీర్మానములు :

౧. కీ. శే. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, కూచి నరసింహంపంతులు, చలికొండ నారాయణస్వామి నాయుడుగార్ల మరణములకు సానుభూతి.

౨. గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన వార్తలు వగైరాలను ఎప్పటికప్పుడు ప్రకటించుచు దోహదముగనున్న ఆంధ్రప్రభ పత్రికాధిపతులకు అభినందనము.

3. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి షష్టిపూర్త్యుత్సవసందర్భమున ఆంధ్రవిజ్ఞానమునకు వారు గావించుసేవకు ప్రశంస.

౪. గ్రంథాలయముల రిజిస్ట్రేషనుఫీజును తీసివేయవలసినదిగ ప్రభుత్వమునకు విజ్ఞాపన.

౫. గ్రంథాలయములు - వయోజనవిద్యకు సంబంధించిన ఉపన్యాసములను తెలుగులో తఱచు చెప్పించవలసినదిగ మద్రాసులోని ఆల్ ఇండియా రేడియో స్టేషనువారిని కోరుట.

౬. కృష్ణాజిల్లాలోని గ్రంథాలయములన్నియు ఆం. దే. గ్రం. సంఘములోను, కృష్ణా జి. గ్రం. సం. లోను, ఆయా తాలూకా సంఘములలోను సభ్యులై 'ఆంధ్రగ్రంథాలయం' పత్రికకు చందాల చెల్లించుచు, గ్రంథాలయ మహాసభలకు తమ ప్రతినిధులబంపి స్వాభివృద్ధికై పాటుపడ వలసినదిగ కోరుట.

౭. గ్రంథాలయముల నిర్వహణ విషయమై పంచాయతీబోర్డులకు ఆటంకము గల్పించు సర్క్యులరును రద్దుపరచి వానికి స్వేచ్ఛనీయవలసినదిగ మద్రాసుప్రభుత్వమునకు విజ్ఞప్తి

౮. కృష్ణాజిల్లాలోని పంచాయతీబోర్డులు లోకల్ బోర్డు ఇన్ స్పెక్టరువారి పంచాయతీజర్నల్‌లోని నెం 527 రు. సర్క్యులరు ననుసరించి ఆం. దే. గ్రం. సంఘసభ్యులగుటకు హెచ్చరిక.

౯. జిల్లాలోని గ్రంథాలయములకన్నింటికి విరాళముల నిప్పించవలసినదిగ కృష్ణాజిల్లాబోర్డువారిని కోరుట.

౧౦. మద్రాసుప్రభుత్వము లోగడ గ్రంథాలయముల కిచ్చుచున్న గ్రాంటును తీసివేసినందుల కసమ్మతిని తెల్పుచు ఏటేట కనీసము ఏబదివేలరూపాయల గ్రాంటును ఇప్పించుటకై కోరుట

౧౧. జిల్లాలోని గ్రంథాలయములను క్రింది ప్రణాళికప్రకారము పనిచేయవలసినదిగ హెచ్చరిక.

(i) గ్రంథాలయముతరఫున చదువురాని ప్రజలలోకూడ విద్య, విజ్ఞానం వ్యాపింపజేయడంకోసం కొద్దిగోప్పా చదువుకున్నవారికి విద్య నభివృద్ధిచేయటానికి రాత్రి పాఠశాలలను ఏర్పాటుచేయుట-పత్రికలను చదివి వినిపించుట - నూతనపద్ధతులప్రకారం త్వరలో అక్షరజ్ఞానము కలగడంకోసం నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం సాగించుట, మ్యాజికులాంతరు ప్రదర్శనాలు ఏర్పాటుచేయుట మొదలైన కార్యక్రమాన్ని ఏర్పాటుచెయ్యాలి.

(ii) పక్షానికొకసారో, నెలకొకసారో ఆయా విషయాల్లో ఆరితేరిన ఉపన్యాసకులచే ప్రజాసామాన్యానికి అవసరమైన విషయాలపై అనగా ఆర్థిక, రాజకీయ, శారీరక, వైజ్ఞానిక, వ్యావసాయిక విషయాలపై ఉపన్యాసాల నిప్పించు యేర్పాట్లుచేయుట.

(iii) గ్రంథాలయాలు లేని చుట్టుప్రక్కల గ్రామాల్లోకూడా విద్యావ్యాప్తి జరగడంకోసం సంచార గ్రంథాలయాల నేర్పాటుచేయుట.

౧౨. కృష్ణాజిల్లా గ్రంథాలయసంఘము ఆంధ్రదేశగ్రంథాలయసంఘముయొక్క శాఖగ పనిచేయుటకీవరకు చేసిన తీర్మానమును బలపరచుట.

## దివితాలూకాచతుర్థ గ్రంథాలయ మహాసభ, చల్లపల్లి

పై మహాసభ 1-9-40 వ తేదీ సాయంత్రము ౬ గంటలకు చల్లపల్లి రాజాగారి హైస్కూలులో శ్రీమంతు రాజాయార్లగడ్డ శివరామకృష్ణప్రసాద్, బి. ఏ (ఆనర్సు) గారి ఆధిపత్యమున సమావేశమైనది. కృష్ణాజిల్లా విద్యాశాఖాధికారులు శ్రీ డి. రామయ్యనాయుడు, బి. ఏ., ఎల్. టి. గారు సభను ప్రారంభించిరి. శ్రీ కాపూరి కోదండరామయ్యగారు తమ ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమునొసంగి ప్రతినిధులకు, పెద్దలకు స్వాగతముచెప్పిరి. అధ్యక్షుల తొలిపలుకుల తదుపరి కార్యదర్శి నివేదికను శ్రీ మాజేటి రామచంద్రరావుగారు చదివిరి. పై హైస్కూలు ప్రధానోపాధ్యాయులు

శ్రీ గొల్లపూడి సత్యనారాయణ, ఎం. ఏ., ఎల్. టి. గారు ఉపన్యసించిరి. శ్రీ కొడాలి రాజారావు గారిచే 'హంపీక్షేత్రము' నందలిపద్యములు కొన్ని చదువబడెను.

దివితాలూకాలోని గ్రంథాలయముల పరిస్థితులనుగూర్చి నివేదిక తయారుచేయుటకును, జిల్లాలోని గ్రంథాలయములన్నిటికి విరాళములనీయగోరుచు కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులవద్దకు రాయబారులుగ వెళ్లుటకును రెండుపసంఘము లేర్పాటుచేయబడెను. గ్రామ గ్రంథాలయములన్నియు తాలూకా సంఘసభ్యులుగ జేరుటకును, తాలూకాగ్రంథాలయ సంఘముయొక్క ఆర్థికస్థితిని పెంపొందించుటకును, గ్రామాదులలో నేర్పడియున్న తల్లిదండ్రుల సంఘము లవారా యా గ్రామములలోని గ్రంథాలయములకు తోడ్పడుటకును కోరబడెను. చల్లపల్లిలో తాలూకా గ్రంథాలయము నేర్పాటుచేయవలసినదిగ శ్రీ రాజా గారిని ప్రార్థించుచును, అచ్చటి శ్రీ మంతు క్లబ్బులో పత్రికలు వగైరా చదువుటకు చదువుకొన్న వారందరికి అవకాశమిప్పించ వలసినదిగ క్లబ్బు నిర్వాహకులను కోరుచును, శ్రీ రాజాగారి హైస్కూల్ గ్రంథాలయము ప్రజాబాహుళ్యమున కుపయోగపడున ట్లేర్పాటు చేసినందుకు సదరుపాఠశాలా నిర్వాహకుల నభినందించుచును తీర్మానములు చేయబడెను. దివి తాలూకా పంచమ గ్రంథాలయమహాసభను ఆహ్వానించిన కోడూరు శ్రీశారదా పుస్తక భాండాగారము వారికోరిక అంగీకరింపబడెను.

అధ్యక్షుల ముగింపువాక్యములు, ఆహ్వానసంఘాధ్యక్షుల వందన సమర్పణముతో సభముగిసెను.

## బందరుతాలూకా ప్రథమగ్రంథాలయ మహాసభ, పెడన

పై మహాసభ 8-9-40వ తేదీ సాయంత్రము పెడనగ్రామములో బొద్ధవాఙ్మయబ్రహ్మ శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. తాలూకాలోని గ్రంథాలయములనుండి వచ్చిన ప్రతినిధులు గ్రామజనులేగాక, కృష్ణాజిల్లా, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘనిర్వాహకులు సహితము సభ నలంకరించిరి.

ముందుగ ఆహ్వానసంఘాధ్యక్షులు మహాసభయొక్క ఉద్దేశములవివరించి సభకువచ్చిన పెద్దలకూ, పిన్నలకూ స్వాగతమును చెప్పిరి. శ్రీ ఎ. కె. రామచంద్రయ్యర్, ఎం.ఎ., బి.ఎల్. (బందరు జిల్లాకోర్టుమునసబు) గారు సభను ప్రారంభించుచు విద్యావ్యాప్తికి గ్రంథాలయముల అవసరమును నొక్కిచెప్పిరి. పెడన సబ్ రిజిస్ట్రారు శ్రీ నందివాడ సత్యనారాయణగారు నెలకొల్పిన గ్రంథాలయమును స్థానికులందఱు ఉపయోగించుకొనవలసినదిగ వారు హెచ్చరించిరి.

శ్రీయుతులు భట్టు జ్ఞానకోటయ్య, ఉ. భా. ప్ర. పింజల సుబ్రహ్మణ్యకవి, మల్లెల శ్రీరామమూర్తి, అయ్యంకి వెంకటరమణయ్య, భట్టు జ్ఞానప్రసూనాంబిక (బాలిక), తెన్నేటి సూర్యప్రకాశరావు దంపతులు, తేకుమళ్ళ రామచంద్రరావు, పోతరాజు శోభనాచలపతిరావుగార్లు మఱికొందఱు గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన అనేకవిషయములపై ఉపన్యసించిరి. స్వవిరచితమగు తాజ్ మహల్ కావ్యమునుండి రసవంతమగు ఘట్టములను చదివి శ్రీ పువ్వాడ శేషగిరిరావుగారు సభికులను త్తేజితులజేసిరి.

అధ్యక్షులు తమఉపన్యాసములో విద్యావ్యాపనకు గ్రంథాలయముల ఆవశ్యకతనుగూర్చియు, కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారు గ్రంథాలయోద్యమవ్యాప్తికి, ఆంధ్రోద్యమాభివృద్ధికి గావించిన సేవనుగూర్చియు, అయ్యంకి వెంకటరమణయ్యగారు మున్నగువారి నిరంతరకృషిమూలమున ఆంధ్రరాష్ట్రములో గ్రంథాలయములు వ్యాప్తిచెందిన విషయమునుగూర్చియు, ప్రతియొక్కరును జాతిమత వివక్షతలేక గ్రంథాలయముల నుపయోగించుకొనవలసిన అవసరమును గూర్చియు విపులముగ ముచ్చటించిరి.

తాలూకాలోని పంచాయతీబోర్డులను ఆం. దే. గ్రం. సంఘసభ్యులుగ చేరగోరుచును, పంచాయతీలు స్వేచ్ఛగ గ్రంథాలయముల నిర్వహించుటకు ప్రభుత్వమువారి నవకాశమీయవలసినదిగను, జిల్లాలోని అన్నిగ్రంథాలయములకు విరాళముల నిచ్చుటకై కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులవద్దకు రాయబారము పంపుటకును, తాలూకాలోని గ్రంథాలయముల దర్శించి వానిపరిస్థితులను నివేదికరూపమున వెల్లడించుటకును బందరు తా. గ్రం. సం. వారిని కోరుచును, గ్రంథాలయోద్యమ ప్రచారమునకు దోహదమొసగుచున్న 'ఆంధ్రప్రభ' నభినందించుచు వారిమార్గము ననుసరించవలసినదిగ ఆంధ్రపత్రికాధిపుల కోరుచును, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘభవన నిర్మాణమునకు విరివిగ విరాళముల నొసగవలసినదిగ తాలూకావాసులను హెచ్చరించుచును తీర్మానములు చేయబడెను.

ఆం. దే. గ్రం. సంఘమునకును, కృష్ణాజిల్లా గ్రం. సం. నకును శాఖగ బందరుతాలూకా గ్రంథాలయసంఘము నేర్పఱచి ఇతరులను చేర్చుకొనునధికారముతోను, నిబంధనల నేర్పఱచుకొను హక్కుతోను ఈసంఘమునకు క్రిందివారు పాలకవర్గముగ నెన్నుకొనబడిరి.

శ్రీ భట్ట కుమారస్వామిగారు, అధ్యక్షుడు, శ్రీ భట్ట వీరభద్రయ్యగారు, ఉపాధ్యక్షుడు

శ్రీ వార్త సుబ్బారాయుడుగారు, కార్యదర్శి, శ్రీ నందివాడ రామారావుగారు, సహాయకార్యదర్శి

శ్రీ కూర్మా వెంకటసుబ్బయ్యసిద్ధాంతి, నార్ని చిననాన్న, పేరిశెట్టి పానకాలుగార్లు సభ్యులు.

## బెజవాడతాలూకా గ్రంథాలయసంఘము

### కంకిపాడు ఫిర్కాయాత్ర

బెజవాడ తా. గ్రం. సం. వారు 2-11-40 వ తేదీ మొదలు 7-11-40వ తేదీ వరకు కంకిపాడు ఫిర్కాలో క్రింది కార్యక్రమమునను సరించి గ్రంథాలయయాత్ర నేర్పాటుచేసిరి. వీరు తిరిగినతావులందెల్ల గ్రంథాలయ, పఠనాలయములు లేనిచోట్ల స్థాపించుచు, ఉన్నవిబాగుగ పనిచేయునట్లు ప్రోత్సహించుచు, గ్రంథాలయోద్యమముయొక్క తత్త్వము నాయాచోటులప్రజలకు విరివిగ వెల్లడించిరి. ఈయాత్రాకార్యక్రమము 2వ తేదీ రాత్రి 8 గంటలకు తెన్నేరుగ్రామములో ప్రారంభమైనది. ఇచ్చటనేర్పాటు చేయబడినసభకు శ్రీ పాతూరినాగభూషణం గారధ్యక్షతవహించిరి. కృష్ణాజిల్లా గ్రం. సం. కార్యదర్శి శ్రీమాజేటి రామచంద్రరావుగారు యాత్రను ప్రారంభించుచు ఉపన్యసించిరి. బెజవాడ తా. గ్రం. సం. కార్యదర్శి శ్రీగొంది కోటేశ్వరరావుగారు గ్రంథాలయయాత్రోద్దేశములను సభికులకు తెలిపిరి.

| తేది | ఉదయము | మధ్యాహ్నము | సాయంత్రము | రాత్రి |
|---|---|---|---|---|
| 3-11-40 | ఉప్పటూరులో బహిరంగ సభ | కేల్వూరులో సభ<br>జయభారతి గ్రం. పునరుద్ధరణము | | నిడమానూరులో బహిరంగసభ<br>పఠనాలయస్థాపనము |
| 4-11-40 | ఎనికేపాడులో బహిరంగసభ<br>నెహ్రూ గ్రం. స్థాపన | రామవరప్పాడులో బహిరంగసభ<br>సీతారామ గ్రం॥ స్థాపన | ... | కానూరులోసభ<br>శ్రీ రామలింగేశ్వర గ్రం. స్థాపన |
| 5-11-40 | తాడిగడపలో బహిరంగసభ | ... | పెదపులిపాకలో సభ<br>శ్రీ రామ గ్రం. స్థాపన | ... |

| తేది | ఉదయము | మధ్యాహ్నము | సాయంత్రము | రాత్రి |
|---|---|---|---|---|
| 6-11-40 | పోరంకిలో బహిరంగసభ? | ... | గోసాలలో బహిరంగసభ శ్రీ వేణుగోపాల గ్రం॥ స్థాపన | ఈడుప్పుగల్లులో బహిరంగసభ |
| 7-11-40 | పెనమలూరులో బహిరంగసభ? | కంకిపాడులో బహిరంగసభ? | ... | కోలవెన్నులో బహిరంగసభ |

ఈ యాత్రలో పాల్గొనినవారిలో శ్రీయుతులు అయ్యంకి వెంకటరమణయ్య, ఆం. దే. గ్రం. సం. స్థాపకుడు, కొమ్మ సీతారామయ్య, ఆం. దే. గ్రం. సం. కోశాధిపతి, గొంది కోటేశ్వరరావు, బె. తా. గ్రం. సం. కార్యదర్శి, పిన్నమనేని సీతారామయ్య, మిక్కిలినేని పరంధామయ్య, చోడవరపు మధుసూదనరావు, బి. ఏ. బి. ఎల్., బె. తా. గ్రం. సం. అధ్యక్షులు, చాగర్లమూడి హనుమాయమ్మ, (కృష్ణాజిల్లాబోర్డు ఉపాధ్యాయులు) కంభంపాటి వెంకటరత్నం, మల్లెల శ్రీరామమూర్తి, ఆం. దే. గ్రం. సం. సహాయకార్యదర్శి గార్లు కలరు. గ్రంథాలయములనుగూర్చియు విజ్ఞానసంబంధమైన వివిధవిషయములను గూర్చియు గ్రామములలో చాల ఉపన్యాసము లీయబడెను. తాలూకా గ్రంథాలయసంఘమువారు ప్రకటించిన మొదటి కరపత్రమును యాత్రికులు పోయిన గ్రామములలో పంచిపెట్టబడెను.

## ప్రథమ ఒంగోలు తాలూకా గ్రంథాలయమహాసభ, ఉప్పుగుండూరు

పై మహాసభ 1-1-41 వ తేదీ ఉదయం 10 గంటలకు ఉప్పుగుండూరులో శ్రీ దేశోద్ధారక గ్రంథాలయభవనము ముందట గుంటూరుజిల్లాబోర్డు ఉపాధ్యక్షులు శ్రీగోగినేని వెంకటసుబ్బయ్య గారి అధ్యక్షతనుకూడినది. గుంటూరు మం. గ్రం. సంఘాధ్యక్షులు శ్రీ శరణు రామస్వామి చౌదర గారు గ్రంథాలయప్రదర్శనమును బహిరంగపఱచిరి. శ్రీపాతూరి నాగభూషణం, కస్తూరి కుటుంబరావు, గంజాం అనంతలక్ష్మణాచార్యులుగార్లు గ్రంథాలయోద్యమమునుగూర్చి ఉపన్యసించిరి.

కీ. శే. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, గిడుగు వెంకటరామమూర్తిపంతులు, పానుగంటి లక్ష్మీనరసింహం, కూచి నరసింహంపంతులు, పిల్లలమర్రి ఆంజనేయులుగార్ల మరణములకు సానుతాపము తెలుపుచును, తాలూకాలోని గ్రంథాలయములనన్నిటిని ఆంధ్రదేశ- గుంటూరుమండల- ఒంగోలుతాలూకా గ్రంథాలయసంఘములలో సభ్యులై 'ఆంధ్రగ్రంథాలయం' పత్రికకు చందాల చెల్లించగోరుచును, తాలూకాలోని పంచాయతీబోర్డులన్నియు ఆం. దే. గ్రం. సంఘసభ్యులుగ చేర హెచ్చరించుచును, తాలూకాలోని పౌరులను అన్నిగ్రామములలో గ్రంథాలయములుపెట్టి అవి క్రమముగ సాగునట్లు చేయవలసినదిగను, తమజిల్లాలో రిజిస్టరైన గ్రంథాలయములకు 1940 వ సం॥లో రు 50-0-0 చొ॥ విరాళములనిచ్చిన గుంటూరుజిల్లాబోర్డువారి నభినందించుచును, గ్రంథాలయముల స్థాపననిర్వహణములలో పంచాయతీబోర్డులకు ప్రబలాటంకముగనున్న పంచాయతీ జర్నల్‌లోని నెం 445రు సర్క్యులరుకు అసమ్మతి తెలుపుచును, పూర్వమువలెనే ఏటేట గ్రంథాలయములకు విరాళములిచ్చి ఉద్యమవ్యాప్తికి తోడ్పడవలసినదిగ ప్రభుత్వమువారినికోరుచును తీర్మానములు చేయబడెను.

కడకు ఆం. దే. గ్రం. సంఘమునకును, గుంటూరుమండల గ్రంథాలయసంఘమునకును శాఖగ ఒంగోలు తాలూకా గ్రంథాలయసంఘము నేర్పాటుచేయుచు దీనికి క్రిందివారిని కార్యనిర్వాహకులుగ ఎన్నుకొనుట జరిగినది.

అధ్యక్షులు: శ్రీ గోరంట్ల చినరామయ్యగారు, ఉపాధ్యక్షులు: శ్రీ ఘుడియారం రామలింగయ్యగారు, కార్యదర్శి: శ్రీ గంజాం అనంతలక్ష్మణాచార్యులుగారు, సహాయకార్యదర్శి: శ్రీ అమ్మనబ్రోలు వేంకటేశ్వరరావుగారు, సభ్యులు: శ్రీ అచ్యుతుని గోపాలశర్మ, వావిలాల వేంకటసుబ్బయ్య, మంత్రి గోపాలకృష్ణయ్య, కోడూరి చెంచయ్య, చెరుకూరు సుబ్బయ్య, పొన్నలూరి కోటీశ్వరరావుగార్లు.

అధ్యక్షుల ముగింపు మాటలతోను వందన సమర్పణములతోను సభ ముగిసెను.

## గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘము

పైసంఘ సాధారణసమావేశము 1940 సెప్టెంబరునెల ఆఖరువారములో ఉన్నవ గ్రామములో కూడి 1940–41 వ సం. నకు క్రిందివిధముగ కార్యనిర్వాహకవర్గము నెన్నుకొనెను.

అధ్యక్షుడు:— శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మగారు, ఎం. ఏ.,

ఉపాధ్యక్షులు:— శ్రీ నిశ్శంకరావు రత్తయ్య, ఉన్నవ రామలింగముగార్లు

కార్యదర్శులు:— శ్రీ పెమ్మారి నాగభూషణం, మేడూరి నాగేశ్వరరావుగార్లు

కోశాధిపతి:— శ్రీ కొర్నెపాటి రామకృష్ణయ్యగారు, మఱిఆర్గురు సభ్యులు.

ప్రభుత్వమువారు గ్రంథాలయములకు విరాళములనిచ్చి ప్రోత్సహించవలసినదిగను, శ్రీ నాళము కృష్ణరావుగారికి షష్టిపూర్తి మహోత్సవమును జరుపనెంచిన రాజమహేంద్రవరపు పౌరుల నభినందించుచును, తమతాలూకా సంఘమును గుంటూరుజిల్లా, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘములకు శాఖగా అంగీకరించుచును తీర్మానములు చేయబడెను.

## గుంటూరు తాలూకా గ్రంథాలయ మహాసభ

పైసభ 14–12–40 వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు గుంటూరులో ఏకా దండయ్యపంతులు గారి హాలులో సుప్రసిద్ధ గ్రంథకర్తలును, శ్రీ శారదానికేతన సంస్థాపకులును నగు శ్రీ ఉన్నవ లక్ష్మి నారాయణ పంతులుగారి అధ్యక్షతను సమావేశ మయ్యెను.

ఉ. భా. ప్ర. నాళం నాగలక్ష్మిగారు సభను ప్రారంభించుచు గ్రంథాలయోద్యమ చరిత్రను సంగ్రహముగ తెలిపిరి. అధ్యక్షులు తమ యుపన్యాసమున గ్రంథాలయముల అభివృద్ధికి మార్గములను సూచించిరి.

గ్రంథాలయోద్యమ ప్రాశస్త్యమునుగూర్చి డాక్టరు కూచిభొట్ల వేంకటేశ్వరశర్మ, శ్రీ పాతూరి నాగభూషణంగార్లుపన్యసించిరి.

సభాంతమున గుంటూరుతాలూకా గ్రంథాలయసంఘ పాలకవర్గము శ్రీ మండలపర్తి ఉపేంద్ర శర్మగారి అధ్యక్షతనుకూడి తమ సంఘము ముందు చేయదగిన కార్యక్రమమునుగూర్చి ఆలోచించి ఒక విధానమును నిర్ణయించిరి. షష్టిపూర్తియైన డాక్టరు పట్టాభిగారిని వీరభినందించిరి.

## రేపల్లె తాలూకా గ్రంథాలయ సంఘము
## చెరుకుపల్లి ఫిర్కా యాత్ర

పై గ్రంథాలయసంఘమువారు 2-10-40 వ తేదీనుండి 7-10-40 వ తేదీవరకు చెరుకుపల్లి ఫిర్కా లోని 9 గ్రామములలో తిరిగి గ్రంథాలయప్రచారము గావించిరి. ఈయాత్రాఫలితముగ ఒకగ్రామ ములో నూతనముగ నొకగ్రంథాలయము స్థాపింపబడెను. ఈసందర్భమును పురస్కరించుకొని 6 గ్రామములలోని గ్రంథాలయములు వార్షికోత్సవముల జరుపుకొనినవి. తక్కినచోట్ల బహిరంగసభ

ఏర్పాటుచేయబడి గ్రంథాలయప్రబోధము గావింపబడెను. కొన్నిచోట్ల మ్యాజిక్‌లాంతరుప్రదర్శనములు సహిత మేర్పాటుచేయబడెను.

2-10-40 వ తేదీ సాయంత్రం 5 గంటలకు రాంభొట్లపాలెం గ్రామమున నీయాత్ర ప్రారంభమయ్యెను. దీని ప్రారంభోత్సవసభకు గుంటూరుమండల గ్రంథాలయ సంఘోపాధ్యక్షులు శ్రీ కాండూరి సీతారామయ్యగా రధ్యక్షతవహించిరి. తెనాలితాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీ వడ్లమూడి వేంకటరత్నంగారు తమ ప్రారంభోపన్యాసములో గ్రంథాలయయాత్రలవలన గొప్పప్రబోధము జరుగుతుందని తెనాలితాలూకాలో తమ అనుభవంద్వారా తెలుసుకొంటిమనియు, చక్కనిసమయంలో నీయాత్ర ప్రారంభమైనదనియు, జ్ఞానరాసులగు గ్రంథాలయాలు వయసువచ్చినవారికి మిగుల ప్రయోజనకరములనియు, సకల జీవితశాఖలకు సంబంధించినవిషయాలను గ్రంథాలయాలద్వారా తెలిసికొని మానవు లభివృద్ధిపొందవచ్చుననియు చెప్పిరి.

అధ్యక్షులు ప్రస్తుత దేశదారిద్ర్యానికి కారణం అజ్ఞానమనియు, దీనిని పోగొట్టుకొనుటకై గ్రంథాలయములు చాలగ నుపయోగపడుననియు, గ్రంథాలయాలద్వారా ప్రజలు జ్ఞానవంతులైనగాని దేశాభివృద్ధికి మార్గములేదనియు చెప్పిరి. తదుపరి ఇచ్చట 'నవయుగగ్రంథాలయ'మను పేరిట నొకగ్రంథాలయము నూతనముగ స్థాపింపబడెను.

తరువాత క్రింది కార్యక్రమము ననుసరించి యాత్ర సాగింపబడినది.

3-10-40 వ తేదీ సాయంత్రము 5 గంటలకు కావూరులో శ్రీ సీతారామాంధ్రగ్రంథాలయ వార్షికోత్సవము—అధ్యక్షులు : శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

4-10-40 వ తేదీ ఉదయం ఆరేపల్లి అగ్రహారములోని శ్రీ యువజనగ్రంథాలయ వార్షికోత్సవము
అధ్యక్షులు : శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్.
సాయంత్రం చెరుకుపల్లిలో పంచాయతీబోర్డుగ్రంథాలయ వార్షికోత్సవము
అధ్యక్షులు : శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

5-10-40 వ తేదీ ఉదయం 9 గంటలకు పొన్నపల్లిలో శ్రీ సరస్వతీగ్రంథాలయ వార్షికోత్సవము
అధ్యక్షులు : శ్రీ జొ. స. నా. మూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్.
సాయంత్రం 6 గంటలకు నడింపల్లి శ్రీ తిలక్‌గ్రంథాలయ వార్షికోత్సవం
అధ్యక్షులు : శ్రీ పాతూరి నాగభూషణంగారు

6-10-40 వ తేదీ సాయంత్రము 3 గంటలకు గూడవల్లిలో బహిరంగసభ
అధ్యక్షులు : శ్రీ శరణు రామస్వామిచౌదరిగారు
రాత్రికి రాజవోలులో బహిరంగసభ- అధ్యక్షులు : శ్రీ జొ. స. నా. మూర్తిగారు

7-10-40 వ తేదీ సాయంత్రం 3 గంటలకు కనగాలలో బహిరంగసభ
అధ్యక్షులు : శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

శ్రీ కస్తూరి కుటుంబరావుగారు, గుంటూరు మం. గ్రం. సంఘకార్యదర్శి, శ్రీ ఘంటా సీతారామయ్యగారు, రేపల్లె తా. గ్రం. సం. కార్యదర్శి, తటవర్తి వేంకటేశ్వర్లుగారు, మఱికొందఱు గ్రంథాలయాభిమానులు ఈయాత్రలో పాల్గొని దీనివిజయానికి తోడ్పడ్డారు.

## గుడివాడ పట్టణగ్రంథాలయ మహాసభ

పై మహాసభ 22-9-40 వ తేదీ గుడివాడ హైస్కూలుభవనమున సమావేశమయ్యెను. నాటి ఉదయం అచ్చట ఏర్పాటుచేయబడిన గ్రంథాలయప్రదర్శన ప్రారంభోత్సవసభకు బెజవాడ కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు ఎం. ఏ., పిహెచ్. డి. గా రధ్యక్షతవహించిరి.

ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ వెంపటి పురుషోత్తం, ఎం. ఏ., ఎల్. టి., (హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు) గారు సభ్యులకు స్వాగతమొసంగిరి.

ప్రదర్శనప్రారంభకులగు శ్రీ చిట్టా బాలకృష్ణశాస్త్రి, ఎం. ఏ., ఎల్. టి. (బందరు హిందూ కాలేజీ లెక్చరరు) గారు ప్రజలలో 100 కి 90 మంది నిరక్షరాస్యులుగ నున్నంతకాలము గ్రంథాలయోద్యమము సర్వతోముఖాభివృద్ధిని పొందజాలదనియు, ముమ్మందు పిల్లలలో విద్యాసంపాదనయందనురక్తిని కల్గించి, వయోజన విద్యాప్రచారమును సాగింపవలెననియు, గ్రంథాలయములలోని పొత్తములు ఆయా ప్రదేశములలోని ప్రజలఅవసరములబట్టి సేకరించవలెననియు మున్నగాగల సంగతుల నుపన్యసించిరి.

అనంతరము అధ్యక్షులవారు విదేశములందలి గ్రంథాలయములు చేయుచున్న అమూల్యమగు సేవ, వానియందు తాముపొందిన అనుభవములు చెప్పి, తగుశ్రద్ధయు ఆదరణమును లేనికారణమున అత్యుత్తమ గ్రంథరాజములెన్నియో మనదేశమున నశించెననియు, ఆధునికశాస్త్రవేత్తలకు సైతము విస్మయముగలిగించు విజ్ఞానసంపదతో నిండిన ప్రాచీనార్యగ్రంథములను కాపాడుట ప్రతిభారతీయుని విధ్యుక్తమనియు, ప్రతివిషయమునను మనవా రంధప్రాయముగ పాశ్చాత్యుల ననుకరించుట నష్టదాయకమనియు, గ్రంథములను పాఠభేదముల గమనించి పరిష్కరించక ప్రకటించుటవలన చాలముప్పు వాటిల్లుచున్నదనియు మున్నగాగల విషయములను సోదాహరణముగ వినిపించి సభ్యులను ప్రాచీనవిజ్ఞానరక్షణాసక్తులను గావించిరి.

సాయంకాలము గ్రంథాలయమహాసభ రాజమహేంద్రవరములోని ఆంధ్రచారిత్రక పరిశోధకమండలికి జెందిన శ్రీ భావరాజు కృష్ణారావుపంతులు బి. ఏ., బి. ఎల్. గారి అధ్యక్షతను సమావేశమయ్యెను. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ తుమ్మల సీతారామబ్రహ్మంచౌదరి, బి. ఏ., బి. యల్., గారు ఇంతకాలమునకైనను గ్రంథాలయోద్యమవ్యాప్తికి గుడివాడపౌరులు సంకల్పముసేయుట శుభప్రదమని చెప్పి మునిసిపాలిటీపక్షమున తాము తప్పక తోడ్పడెదమని అభయప్రదాన మొసర్చిరి. డిస్ట్రిక్టుమునసబు శ్రీ ఉన్నవ వెంకటసుందరరావుపంతులుగారు, బి. ఏ. బి. యల్. సభాప్రారంభోత్సవమును గావించుచు గ్రంథాలయముల విలువను ముఖ్యముగ సంచారగ్రంథాలయముల ప్రయోజనమును కొనియాడిరి.

అధ్యక్షులు ప్రసంగించుచు గ్రంథాలయములతోబాటు ప్రాచీన వస్తునిలయముల స్థాపనావశ్యకతను నిరూపించుచు, ఆయా పరిసరములందు లభించు ప్రాచీననాణెములు, విగ్రహములు, శిలాతామ్రశాసనములు, మృణ్మయ లోహపాత్రలు మొదలగువానిని జాగ్రత్తపెట్టినచో నాటిప్రజల చారిత్రక, శిల్పరచనా వైదుష్య విశేషముల దెలుసుకొనజాలుదుమనియు, గ్రామములలోని పాటిదిబ్బలు సైతము త్రవ్వబడకుండ కాపాడవలెననియు, రెండువేలసంవత్సరముల క్రితము గుడివాడ గొప్పపట్టణమై సకల వైభవములతో దులదూగుచు రాష్ట్రపతికి ప్రధానస్థానమై అలరారుచుండెననియు చెప్పిరి.

తదుపరి శ్రీ పుచ్చా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగా రుపన్యసించుచు ప్రాచీనకాలమున ప్రతి పండితునిగృహము గ్రంథాలయముగను, పండితుడు సంచారగ్రంథాలయముగను నుండెననియు, ఉత్సవములు, పండుగలు, పురాణ హరికథా కాలక్షేపములు, సప్తాహములు, జంగంకథలు, వీధినాటకములు, తోలుబొమ్మలప్రదర్శనములు మొదలగువానిద్వారా విజ్ఞానాభివృద్ధి గావింపబడుచుండెననియు, రాజప్రాసాదములందును, దేవస్థానములందును ప్రాచీనగ్రంథములు సంరక్షింపబడుచుండెననియు కొంతకాలమునకు కళలు శాస్త్రములు వేరయ్యెననియు, నేడు విజ్ఞులుగాక ధనికులు అధికారమునందుండుటచే ప్రాచీన విజ్ఞానభారతికి ఆశ్రయము లేకపోయెననియు, వర్తమానమున కొందరు సంస్కృతము మృతభాషయని ప్రచారముగావించుట దురదృష్టమనియు సెలవిచ్చి శాస్త్రపరిశోధకులు దమకు వలయు పొత్తముల సేకరించుటలో గల కష్టముల నేకరువు బెట్టిరి. మఱియు గ్రంథాలయోద్యమాభివృద్ధికి పెక్కు సూచనలగావించిరి.

అనంతరము శ్రీ కాకాని నరసింహారావుగారు తాము రచించిన పద్యముల జదివి వినిపించిరి. మరియు శ్రీ పేకమళ్ళ రామచంద్రరావు, మాజేటి రామచంద్రరావు, పి. శ్రీనివాసాచారి, అయ్యంకి వేంకటరమణయ్య, కాకినాడ రామమోహనరావు, దశిక వేంకటేశ్వరరావు, శోభనరావు, ఆకుల మన్మథరావుగార లుపన్యసించిరి. తుమ్మలపల్లి గోపాలకృష్ణమూర్తి పంతులుగారు వెయ్యిగ్రంథములు గల తమ గ్రంథాలయమును ఎల్లరకు అందుబాటులో నుంచెదమని ప్రకటించిరి.

### బందరుపట్టణ గ్రంథాలయ మహాసభ

పై మహాసభయున్నూ, గ్రంథాలయ ప్రదర్శనమున్నూ ది 21-12-40 తేదీన సాయంత్రం 3గంటలకు శ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజి వైశ్యసమాజ భవనమునందు జరిగినవి. గ్రంథాలయ ప్రదర్శనప్రారంభము శ్రీమతి దుల్లా వెంకటరమణమ్మగారు గావించిరి. సభాప్రారంభమును బందరు సబ్‌జడ్జి శ్రీ పి. ఆర్. ఈశ్వరయ్యరు, బి. ఏ., బి. యల్. గారు గావించిరి. సభాధ్యక్షత శ్రీ ప్రశింగు వేంకటనారాయణగారు (పట్టణ గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులు) వహించిరి. శ్రీయుతులు చిట్టా బాలకృష్ణశాస్త్రి ఎం. ఏ, ఎల్. టి., పి. కేశవరావు బి. ఏ., వైసాని శ్రీరాములు గుప్తగార్లు ఉపన్యసించిరి. ఉభయభాషాప్రవీణ పువ్వాడ శేషగిరిరావుగారిచే కవిత్రయముమీద పద్యములు చదువబడినవి. కార్యదర్శి అభివందనములతో సభ జయప్రదముగా ముగిసినది.

---

# నూతన గ్రంథాలయాలు

## గాంధీజీ గ్రంథాలయము, మల్కీ మహమ్మదుపురము

ఏలూరు తాలూకా పూళ్ళశివారు మల్కీమహమ్మదుపురంలో విద్యాభిలాషులగు అచ్చటి యువకులచే గాంధీమహాత్ముని జన్మదివసము 2-10-40 వ తేదీన పై గ్రంథాలయము స్థాపింపబడినది. దీనిని ప్రారంభించుటకుకూడిన గ్రామస్థులసభకు శ్రీ తమ్మిశెట్టి వెంకట్రామయ్యగా రధ్యక్షతవహించిరి.

## యువజన గ్రంథాలయము, బొడ్డపాడు

కృష్ణాజిల్లా బొడ్డపాడులో 30-11-40 వ తేదీన పై గ్రంథాలయ ప్రారంభోత్సవమును శ్రీమతి ఈడుపుగంటి వేంకటరత్నమాంబగారు గావించిరి. సభకు బెజవాడ తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ చోడవరపు మధుసూదనరావు, బి. ఏ., బి. ఎల్. గా రధ్యక్షత వహించిరి. గ్రంథాలయమున కీసభలోనే కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను.

## శ్రీలక్ష్మీనారాయణ స్మారక గ్రంథాలయము, పెదముత్తేవి

శ్రీకృష్ణభవనమునందు 19-12-40 తేదీ గురువారమునాడు శ్రీ లక్ష్మీనారాయణ స్మారక గ్రంథాలయమునకు బ్రహ్మశ్రీ చావలి సూర్యప్రకాశరావుపంతులు, బి. యే., రిటైర్డు యెడ్యుకేషనల్ ఆఫీసరుగారిచే ప్రారంభోత్సవము జరుపబడెను. మ. రా. శ్రీ. రాజవైద్య అగ్నిహోత్రం విజయసారథి ఆచార్యులువారు, శ్రీ కాజ వెంకటసుబ్బయ్యగారు గ్రంథాలయ ఆవశ్యకతనుగూర్చి, శ్రీ లక్ష్మీనారాయణగారి గుణగణములనుగురించి దీర్ఘోపన్యాసములు గావించిరి. గ్రంథాలయాధ్యక్షులు శ్రీ కాకర్ల కామేశస్వామిగారి అభివందనములతో సభ ముగింపబడెను.

## వార్షికోత్సవములు వగైరా

### శ్రీ నాగేశ్వరరాయు పఠనమందిరము, నరసరావుపేట

2–9–40 వ తేదీ సాయంత్రం 5 గంటలకు స్థానిక పురపాలకోన్నత పాఠశాలావరణములో, సదరు పాఠశాల విద్యార్థులచే నిర్వహింపబడుచున్న శ్రీ నాగేశ్వరరాయ పఠనమందిర ప్రథమ వార్షికోత్సవము శ్రీయుత కాసు బ్రహ్మానందరెడ్డి, బి. ఏ., బి. యల్., గారి యధ్యక్షతను జరిగెను. సభకు పలువురు పురప్రముఖులు విచ్చేసిరి. కార్యదర్శి నివేదిక తర్వాత మునిసిపల్ కమీషనరు శ్రీ యస్. కృష్ణయ్య శెట్టిగారు, హైస్కూలు హెడ్మాస్టరు శ్రీ టి. వి. యల్. నరసింహారావుగారును, యస్. రాజమణి గారున్ను, నాగేశ్వరరావు పంతులుగారి గుణగణముల గురించియు, వారి జీవితాదర్శమును గురించియు, విద్యార్థిసంఘముల ఆవశ్యకతను గురించియు నుపన్యసించిరి.

### వివేకవర్ధనీ గ్రంథాలయము, ఐలవరం

16–10–40 వ తేదీ ఐలవరంలో శ్రీ కోటంరాజు కోటీశ్వరరావుగారి అధ్యక్షతక్రింద శ్రీ వివేకవర్ధనీ గ్రంథాలయమువద్ద బహిరంగసభ జరిగెను. శ్రీ మాచర్ల వరదయ్యపంతులుగారు మహాత్ముని దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్రను గురించి ఉపన్యసించిరి. వైద్యవిద్వాన్ దివి సత్యనారాయణాచార్యులుగారు మహాత్ముని నాయకత్వమును దేశీయులంతా ఆమోదించి అందరు ఐకమత్యముతో పనిచేయవలయునని చెప్పిరి.

### శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయము, బెజవాడ

25–10–40 వ తేదీ సాయంత్రం 6 గంటలకు పై గ్రంథాలయం 21 వ వార్షికోత్సవం గుంటూరు మునిసిపల్ చైర్మన్ శ్రీ తెల్లాకుల జాలయ్యశ్రేష్ఠిగారి అధ్యక్షతను జరిగినది. ఈవార్షికోత్సవ సందర్భమున నీగ్రంథాలయములో నూతనముగ రేడియోను అధ్యక్షులు స్థాపించిరి.

సభను ప్రారంభించిన శ్రీ సి. రాజగోపాలాచారిగారు (బెజవాడ మునిసిపల్ చైర్మన్) గ్రంథాలయ ప్రయోజనములు, విద్యాభివృద్ధికి అచ్చుతోడ్పడువిధము, ఆధునిక యుగములో పత్రికల ప్రాముఖ్యత, వీనిని ప్రజలు పోషింపవలసిన అవసరములనుగూర్చి ఉపన్యసించి పురజనులు విరివిగ నీగ్రంథాలయములో సభ్యులుగ జేరవలసినదిగ ప్రోత్సహించిరి.

అధ్యక్షులగు శ్రీ జాలయ్యగారు వర్తకులు వైజ్ఞానిక విషయములకు దూరముగానుండి రాజకీయములలో పాల్గొనని కారణమున వారు చాలగ నష్టపడుచున్నారనియు, పత్రికాప్రచారము దక్షిణదేశములో నెక్కువగనున్న కారణమున వానిద్వారా అచ్చటి ప్రజలకు మనకంటె ఎక్కువ సౌకర్యములు లభించుచున్నవనియు, విద్యావిహీనతను నశింపజేయ సమర్థములగు గ్రంథాలయములు దేశాభివృద్ధి కెంతయు అవసరమై యున్నవనియు, గుంటూరు నగరమున అచ్చటచ్చట కొన్ని బోర్డుల నేర్పఱచి వానిపై నిత్యమును వార్తల వ్రాయించు తలంపుతో తామున్నామనియు మున్నగు సంగతులను సభికులకు దెలిపిరి.

శ్రీ దంటు సుబ్బావధాని, దాసు త్రివిక్రమరావుగార్ల ఉపన్యాసాల అనంతరము సభ ముగిసెను.

### శ్రీ శారదా గ్రంథాలయము, తాడేపల్లిగూడెము

2–11–40 వ తేదీ ఇచటి సతీహితసమితివారి శ్రీ శారదా గ్రంథాలయముయొక్క అష్టమవార్షికోత్సవం ఏలూరు పురపాలకసంఘాధ్యక్షురాలు, జమీందారిణి శ్రీమతి చుండూరు రత్నమ్మగారి అధ్యక్షతను జరిగెను. స్వాగతపత్ర పఠనానంతరం సతీహితసమితికార్యదర్శిని శ్రీమతి దామోజీపగఫు లక్ష్మీనరసమ్మగారు నివేదికను చదివిరి.

అధ్యక్షురాలు రష్యా గ్రంథాలయాలు ఆదర్శప్రాయములనిరి. క్రయిస్తవ మత ప్రచారకులవలె స్త్రీలు మానవసేవ, విద్యా మత విషయాది వ్యాప్తికి కృషిచేయవలె ననిరి.

గ్రంథపఠన కవకాశంలేనిపట్ల బొబ్బిలి, జంగంకథలు, తోలుబొమ్మలు వగైరాలు ప్రోత్సాహనీయము లనిరి. శ్రీమతి రత్నమ్మగారు క్రొత్తగా యింగ్లీషు నేర్చుకొనుచున్నామనిరి. స్త్రీ జనసంబంధములగు విషయాల వివరించిరి.

పెంటపాడు పట్టం రూపావతమ్మగారుకూడ మాట్లాడిరి. శ్రీమతి ఎర్రా లక్ష్మీకాంతమ్మగారు ఇంగ్లీషు నేర్వవలెననీ, కట్నముల మానవలెననీ ఉద్బోధించిరి. కొత్తూరి సుందరమ్మగారు మాట్లాడినారు.

గాన ప్రదర్శనానంతరం సమావేశం ముగిసింది. ప్రభుత్వంవారు స్త్రీల గ్రంథాలయాల ప్రోత్సహించ కోరబడిరి.

## శ్రీ వేంకటేశ్వరవిలాస పుస్తకభాండాగారము, ఉపమాక

పై గ్రంథాలయముయొక్క 18 వ వార్షికోత్సవము 1940 వ సం. నవంబరు 2,3 తేదీలలో ఆం. దే. గ్రం. సంఘ ఉపాధ్యక్షులును, విశాఖపట్టణముజిల్లా గ్రం. సం. అధ్యక్షులునునగు శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారి అధ్యక్షతనుజరిగెను.

ఈసందర్భమున కీ. శే. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి ఛాయాచిత్రమును సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు బహిర్గతమొనర్చుచు వారిభాషాసేవను గూర్చియు, దేశసేవనుగూర్చియు ముచ్చటించిరి.

కవిభూషణ, శతావధాని శ్రీ గోరుగంతు అచ్యుత సూర్యనారాయణశర్మగారు వారు రచించుచున్న ఆత్మపురాణమునుండి కొన్నిఘట్టములను చదివిరి. శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు మ్యాజిక్‌లాంతరు సహాయముతో 'వేదవాఙ్మయము - నవీనవిజ్ఞానము' అను విషయమునుగూర్చి ప్రసంగించిరి.

3 వ తేదీ ఉదయము శ్రీ డి. ఆర్. మోహన్‌గారు 'హిందూధర్మము'ను గూర్చి 3 గంటలసేపు మాట్లాడిరి. మధ్యాహ్నము 'భగవద్గీత-గీతాప్రచారావశ్యకతల'ను గూర్చి శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగా రుపన్యసించిరి.

అధ్యక్షులు గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన తమ అనుభవముల తెలియజేయుటయేగాక, పై గ్రంథాలయభవననిర్మాణము నిమిత్తముచేయబడిన అప్పునుతీర్చుటకేర్పాటు గావించిరి. విరాళములు వసూలుచేయునిమిత్తముపసంఘమొకటి ఏర్పాటుచేయబడెను.

అధ్యక్షులకు, గ్రామవర్తకులకు, సభాప్రేక్షకులకు వందనములసమర్పించుటతో వార్షికోత్సవకార్యక్రమము ముగిసెను.

## శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, హైదరాబాదు

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ 39 వ వార్షికోత్సవము 1940 వ సం. నవంబరు 4, 5 తేదీలలో వైభవముతో జరిగినది. సభ్యులతోను ప్రేక్షకులతోను రెండు దినములు నిలయము హాలు నిండిపోయినది.

ప్రథమదినమున సభకు లెఫ్టినెంటు కర్నల్ తాడేపల్లి శంకరశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి. ప్రార్థనానంతరము శ్రీ కాశీ కృష్ణమాచార్యులుగారు ఆంధ్ర సంస్కృత భాషలకు గల సంబంధమును గురించి ఉపన్యసించిరి. అటు పిమ్మట గత సంవత్సర నివేదిక చదువబడినది. శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు సంగ్రహముగా భాషానిలయచరిత్రను నేటివరకు సభవారికి తెలియపరచిరి.

సుప్రసిద్ధులగు శ్రీ పాదుపూడి చలమయ్యశాస్త్రిగారు భాషానిలయమును గురించి ప్రశంసాపద్యముల చదివిరి. అంతట అధ్యక్షులు గంభీరంగా ఉపన్యసించిరి. వారు తమ ఉపన్యాసములో కీర్తిశేషులగు ఆదిపూడి సోమనాథరావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు ఆంధ్రులకు చేసిన సేవ విశదపరచిరి. హైదరాబాదు పట్టణములో 39 సం॥ ఇట్టి సంస్థ జీవముతో నుండుటయే గాక సక్రమముగా పనిచేయు చుండుటకు తమ సంతసమును వెలిబుచ్చిరి. గ్రంధముల నొసంగి, ధనము నొసంగి భాషానిలయమునకు తోడ్పడ సభ్యుల హెచ్చరించిరి. మహారాష్ట్రబాలుని గానముతో నాటి సభముగిసినది.

సభానంతరము ఎన్నికలు జరిగినవి. శ్రీ రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారు అధ్యక్షులు, శ్రీయుతులు అక్కనపల్లి జానకీరామారావుగారు, కొండా వెంకటరంగారెడ్డిగార్లు ఉపాధ్యక్షులు, రావాడ సత్యనారాయణగారు, కార్యదర్శి, శ్రీ శిరోమణి రంగాచార్యులుగారు, సహాయకార్యదర్శి. గ్రంథపాలకులుగ బిరుదు వెంకటశేషయ్యగారిని మరి 9 మంది కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొనిరి.

రెండవరోజు విఖ్యాత పండితులు, కవులునగు శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి అధ్యక్షతక్రింద కవి సమ్మేళనము జరిగినది. కవులు తమ కావ్యగానములతో సభ్యుల ఆనందాబ్ధి నోలలాడించిరి.

## యేటుకూరు గ్రంథాలయములో రేడియో ప్రారంభము

12–11–40 వ తేదీ సాయంకాలం గుంటూరు సామీప్యములోనున్న యేటుకూరులోని హరిజనోద్ధారక గ్రంథాలయములో నూతనముగా రేడియో నొకదానిని యేర్పాటుచేసిరి. ప్రారంభోత్సవమును గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులైన శ్రీ తెల్లాకుల జాలయ్యగారు చేసిరి. ఒక గొప్ప బహిరంగసభ జరిగెను. శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు అధ్యక్షతవహించిరి.

శ్రీ జాలయ్యగారు నేటిపల్లెటూళ్ళలో రేడియో చాల ముఖ్యమైన అవసరమనియు, ఎప్పటి వార్తలు అప్పుడు రేడియో మూలమున తెలుసుకొనవచ్చుననియు చెప్పి, గ్రంథాలయ నిర్వాహకులైన శ్రీ మేదూరి నాగేశ్వరరావు, నిశ్శంకరావు, రత్తయ్య, జిడుగు రామదాసుగార కృషికి ఎంతయో కొనియాడిరి.

శ్రీ నరసింహారావుగారు గ్రామములో ప్రజలు కక్షలులేకుండ ఐకమత్యముతో నుండినగాని బాగుపడరనియు, అనేక సంవత్సరములనుండి కక్షలు, కొట్లాటలు లేకుండ ఒకటిగా నుండికొనుటకు యేటుకూరు గ్రామస్థులు, గ్రామనాయకులైన నాగేశ్వరరావు, రత్తయ్య, రామదాసుగార్లు ప్రశంసనీయులనియు చెప్పిరి.

గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ నందలపర్తి ఉపేంద్రశర్మగారి ఉపన్యాసానంతరము అల్పాహారవిందులతోను, అభివందనములతోను సభ ముగిసెను.

## శ్రీ కృష్ణగ్రంథాలయము – ఉచితపుస్తక భాండాగారం, సికిందరాబాదు

1940 డిసెంబరు 21,22 తేదీలలో వైగ్రంథాలయ ద్వాదశవార్షికోత్సవము శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డి, బి. ఏ., బి. యల్ గారి ఆధిపత్యమున జరుపబడెను.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వారి అధ్యక్షోపన్యాసంలో విద్యావిహీనమైన యీ దేశపరిస్థితులలో గ్రంథాలయములు ప్రజలకు అంతగా ఉపయోగించవనియు, వాటిని సేవా కేంద్రములుగా నేర్పరచుకొని వయోజనవిద్యనిమిత్తము రాత్రిపాఠశాలలు సాగించవలెననియు, ప్రపంచపటములను, ఆరోగ్యచిత్రములనుంచి ప్రచారము చేయవలెననియు చెప్పిరి. మన పూర్వవైభవమును కన్నులకు గట్టునట్లుగావర్ణించి యిప్పుడుదానిని తలచుకొని తృప్తిపడిన లాభములేదనియు, మనమందరము కార్యశూరులముగావలెననియు హెచ్చరించిరి.

శ్రీ ఆచార్య కురుగంటి సీతారామయ్య ఎం. ఏ, గారు తెలుగుకవిత్వములోని సరిక్రొత్తపోకడలు అనువిషయమునుగురించి దాదాపుగంటన్నర ఉపన్యసించిరి.

తదుపరి శ్రీ యిల్లిందల సీతారామారావు, యం. యస్, సి. గారు ఆంధ్ర సంస్కృతిపైన మాట్లాడిరి. రాత్రియెనిమిది గంటలకు సభముగింపబడినది.

రెండవరోజు (22-12-40) సాయంకాలము రెండున్నరగంటలనుండి విద్యార్థులవక్తృత్వపరీక్ష 9వ 10వ తరగతుల విద్యార్థులకు జరుపబడెను. నాలుగున్నరగంటలనుండి సభ ప్రారంభమయ్యెను. శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు కావ్యగానము గావించిరి.

తదుపరి శ్రీమతి బూరుగుల అనంతలక్ష్మీదేవిగారు, స్త్రీలు—గ్రంథాలయములు అను విషయముపై మాట్లాడిరి.

పిదప గ్రంథాలయ కార్యదర్శులగు పి. రామచంద్రారెడ్డిగారు గ్రంథాలయ నివేదిక చదివిరి. అందు రూ 3000 లు గ్రంథాలయ అధ్యక్షులగు వుయ్యూరు రామరెడ్డిగారు గ్రంథాలయ భవనమును కట్టుటకుగాను ఒసంగిరనిచెప్పిరి. ఇదియునుగాక రూ 1500 లు భారతభీమాకంపెనీలో యిన్సూరుచేసిరి' అదికూడా గ్రంథాలయముకే వ్రాసిరి. వారికి శ్రీ సరస్వతీదేవి ఆశీస్సులు యిచ్చుగాక! మరి సికింద్రాబాదు కంటోన్మెంటు ప్రభుత్వమువారు 1000 చదరపు అడుగుల భూమిని పైభవనము నిర్మించుటకు యిచ్చిరి.

మొత్తముపొత్తముల సంఖ్య 2075. అందులో 1850 తెనుగు గ్రంథములు; 225 ఆంగ్ల గ్రంథములు. తదుపరి పైపోటీపరీక్షలో కృతార్థులైనవారికి బహుమానము యివ్వబడెను. అధ్యక్షులవారి ఉపసంహారోపన్యాసముతో రాత్రి 8గంటలకు సభ ముగిసెను.

శ్రీ సువానం సత్యనారాయణగారిచే భరతనాట్యము గావింపబడెను. మరియు శ్రీయుత కె. రామలింగారెడ్డిగారు అత్యద్భుతముగా ముక్కు, నోరు, కట్టివేసి హారుమనియం, బ్యాండు, ఫిడేలు, ఇంకా అనేక వాయిద్యములును చేసిరి. వస్తువులు లేకనే వాయించిరి. మరియు చాల ఆసనముల ప్రదర్శించిరి.

## శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము, కోలవెన్ను

22—12—40 వ తేదీ పై గ్రంథాలయ వార్షికోత్సవము బెజవాడ నగరగ్రంథాలయ సంఘాధ్యక్షులు డాక్టరు టి. వి. యస్. చలపతిరావుగారి అధ్యక్షతను జరిగినది. సభకు పూర్వము గ్రామ సంకీర్తన యేర్పాటు చేయబడినది. కవిరాజు విశ్వనాథ సత్యనారాయణగారు సభను ప్రారంభించుచు తెలుగు నుడికారపు సొంపునుగూర్చి గంటకుపైగ నుపన్యసించిరి. అధ్యక్షుల కోరికపై కార్యదర్శి హరినారాయణగారు ముందు తమ గ్రంథాలయ నివేదికను చదివిరి. ఆం. దే. గ్రం. సం. సహాయ కార్యదర్శి శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు గ్రంథాలయోద్యమ ప్రాశస్త్యమును గూర్చియు, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయాల ఆవశ్యకతను గూర్చియు, శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావుగారు వయోజనవిద్య-నిరక్షరాస్యతా నిర్మూలనమునుగూర్చియు ఉపన్యసించిరి. రాజేశ్వరి యను బాలిక గ్రంథాలయోద్యమమును గూర్చిన వ్యాసమును చదివినది. గ్రంథాలయపక్షమున లోగడ జరిగిన చెడుగుడు పోటీలో గెలిచినవారికి బహుమతులు పంచిపెట్టి అధ్యక్షులు తమ ఉపన్యాసమును చెప్పిరి. శ్రీ చోడవరపు మధుసూదనరావుగారి వందనములతో సభాకార్యక్రమము సమాప్తమయ్యెను.

## శ్రీకృష్ణగ్రంథాలయము, అమ్మనబ్రోలు

గుంటూరుమండల గ్రంథాలయ సంఘకార్యదర్శి శ్రీ కస్తూరి కుటుంబరావుగారున్ను, గుం. మం. గ్రం. సంఘ కార్యనిర్వాహకసభ్యులైన శ్రీ గంజాం అనంత లక్ష్మణాచార్యులుగారున్ను, ఒంగోలు

తాలూకాలో గ్రంథాలయోద్యమమునుగురించి ప్రచారముచేయుచు 26–12–40వ తేది యీగ్రామమునకు విచ్చేసిరి. వీరిచ్చట శ్రీ కృష్ణగ్రంథాలయమును తనిఖీచేసి తగు సలహాల నొసంగిరి. తదుపరి గ్రంథాలయ భవనము యెదుట బహిరంగసమావేశము జరుపబడెను. శ్రీ కుటుంబరావుగారు గ్రంథాలయోద్యమమును గురించియు, నిరక్షరాస్యతను తొలగించుటకు గ్రంథాలయములు బాగుగా తోడ్పడు విషయము, ప్రాచీన గ్రంథాలయోద్యమము మున్నగు విషయములగురించి విపులముగా ఉపన్యసించిరి.

## శ్రీ వీరేశలింగకవి సమాజగ్రంథాలయము, కుమ్ముదవల్లి

పై గ్రంథాలయముయొక్క 43 వ వార్షికోత్సవము 29-12-40 వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు శ్రీ రాజా కె. ఆర్. వి. కృష్ణారావుమందిరమున ప్రారంభమైనది. అధ్యక్షులు శ్రీమతి భూపతిరాజు వెంకయ్యమ్మగారు; సభాప్రారంభకులు శ్రీ తల్లాప్రగడ నారాయణమూర్తిగారు.

మామూలుగ ప్రార్థనానంతరము ప్రారంభకులఉపన్యాసము, అధ్యక్షిణి తొలిపలుకులు, కార్యదర్శి నివేదిక ముగిసినపిదప క్రిందిఉపన్యాసములు జరిగెను.

'రైతు - వ్యవసాయము'—శ్రీ తాళ్లూరి లక్ష్మీపతిరావుగారు
'కావ్యప్రయోజనము'—పూర్వకవులు'—శ్రీ పెమ్మరాజు గోపాలంగారు
'అహింసాధర్మము'—శ్రీ లంకా వెంకట్రామశాస్త్రిగారు
'ఆంధ్రసారస్వతము'—శ్రీ కలిదిండి నరసింహరాజుగారు, బి. ఏ.,
'పొగాకువలన అనర్థములు'— శ్రీ వేగేశన సూరపరాజుగారు
'సంఘసంస్కరణ'— కోటమర్తి కనకమహాలక్ష్మమ్మగారు, చింతలపాటి లచ్చిరాజుగారు

పై ఉపన్యాసములు పూర్తియగునప్పటికి మొదట నిశ్చయించుకున్న అధ్యక్షులు శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంగా రచ్చటికి వచ్చిరి. వీరప్పుడు అధ్యక్షపీఠమలంకరించి సంఘాభివృద్ధికిని, దేశాభివృద్ధికిని గ్రంథాలయమెట్లుపకరించునో తెలుపుచు దీర్ఘోపన్యాసమును గావించిరి. అనంతరము శ్రీ వెంకయ్యమ్మగారును స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యములగూర్చియు, గ్రంథాలయముల ఆవశ్యకతను గూర్చియు ముచ్చటించిరి. అధ్యక్షులకును, ఉపన్యాసకులకును వందనముల సమర్పించుటతోను మంగళగానముతోను సభముగిసెను.

## శ్రీ దేశోద్ధారక గ్రంథాలయము, ఉప్పుగుండూరు

పై గ్రంథాలయ ప్రథమవార్షికోత్సవము 1–1–41 వ తేది మధ్యాహ్నం సుప్రసిద్ధ గ్రంథాలయ సేవకులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతను కూడినది. శ్రీ బాచిన సుబ్బారావుగ్గారు గ్రంథాలయ భవనముపై జాతీయ పతాక ప్రతిష్ఠ చేసిరి. వేటపాలెం సారస్వత నికేతన గౌరవ గ్రంథభాండాగారికులగు శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు శ్రీ దేశోద్ధారకుని చిత్రపట బహిర్గతోత్సవమును జరిపిరి. తరువాత గ్రంథాలయ నిర్వహణము- గ్రంథాలయ సంఘములను గురించి శ్రీ పాతూరి నాగభూషణంగారును, ఆంధ్ర విజ్ఞానము- ఆంధ్ర శిల్పమునుగురించి శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారును, ప్రజాసామాన్యానికి గ్రంథాలయము లుపయోగపడు విధానమును గురించి శ్రీ కస్తూరి కుటుంబరావుగారును, రైతు సంఘములు- గ్రంథాలయములు అను విషయముపై శ్రీ పుల్లెల రత్తయ్యగారును, గ్రామగ్రంథాలయ నిర్వహణమును గురించి శ్రీ గంజాం అనంతలక్ష్మణాచార్యులుగారును, అచ్యుతుని గోపాలశర్మగారును, వావిలాల వెంకటసుబ్బయ్యగారును ఉపన్యసించిరి. కార్యదర్శి నివేదిక చదివిన తర్వాత అధ్యక్షులవారు గ్రంథాలయమునకు శాశ్వత భవన ప్రతిష్ఠాపకులగు శ్రీ గోగినేని న్యాపాభక్తరాజుగారిని ప్రశంసించుచు గ్రంథాలయోద్యమాన్ని గూర్చి అఖండోపన్యాసము చేసిరి. విద్యార్థులు 'స్వాతంత్ర్యము' 'అవతరణము' అను రెండు నాటికలను ప్రేక్షకుల మెప్పువడయు నట్లు ప్రదర్శించిరి.

---

# నివేదికలు

## వంగీయ గ్రంథాలయపరిషత్తు

### 1939-1940 సం॥ల నివేదిక

సంఘనిర్మాణమును పూర్తిగ మార్చి నూతననిబంధనల ప్రకారము ఎన్నికలు జరుగవలసివచ్చుటచేతను, లోగడ కార్యదర్శిగనున్న టి. సి. దత్తాగారు ఉద్యోగమునుండి విరమించుటచేతను పై రెండుసంవత్సరముల నివేదిక నొక్కసారిగ ప్రకటించవలసివచ్చెను.

1940 సంవత్సరాంతమున నీ సంఘమునగల సభ్యులు: 6 గురు శాశ్వతసభ్యులు, 274 సంస్థలు, 207మంది సాధారణసభ్యులు.

12-8-39 వ తేదీ కలకత్తాలోకూడిన సంఘ సాధారణసమావేశమున ఎన్నుకొనబడిన పాలకవర్గము నివేదికాంతమువరకు అమలునందుండెను. 51 మందితోకూడిన ఈ పాలకవర్గము కార్యనిర్వాహకుల నెన్నుకొనుచు, ఉపసంఘముల నియమించుచు, సంఘకార్యక్రమమును నడపుచుండును. నివేదికకాలములో పాలకవర్గము 4 పర్యాయములును, కార్యనిర్వాహకవర్గము 13 పర్యాయములును కూడెను. వివిధవిషయములకు సంబంధించిన 11 ఉపసంఘములుకూడ ఏర్పాటుచేయబడెను. వీనిలో గ్రంథాలయశిక్షణకమిటీ, గ్రంథాలయ సంకేతోపసంఘము, అవలోకనసంఘము మొత్తముపై ఎక్కువ చురుకుగ పనిచేసినవి. గ్రంథనిర్ణయసంఘము 1939 వ సం॥లో పలుమారులుకూడి 1937 లో ప్రకటింపబడిన బెంగాలీపుస్తకములయు, ప్రాథమికపాఠశాలల కుపకరించు బెంగాలీ, ఇంగ్లీషుగ్రంథములయు ఎన్నికజాబితాలను తయారుచేసెను. ఈపట్టీలు 1939 వ సం॥ సంఘపత్రికలో ప్రకటింపబడెను. 1938-39 సం॥ లలో ప్రకటింపబడిన ఎన్నికైన బెంగాలీగ్రంథములజాబితా ఒకటి తయారై ప్రకటనకు సిద్ధముగనున్నది. 500 బెంగాలీ ఉత్తమగ్రంథములజాబితా మరొకటి తయారగుచున్నది,

30-4-39 వ తేదీన ప్రారంభింపబడిన 3 వ వేసవిగ్రంథాలయపాఠశాల 6 వారములుసాగెను. 35మంది విద్యార్థులిందుచేరి చదివిరి. పరీక్షకుహాజరైన 32లో 28మంది కృతార్థులైరి. వీరికి 12-8-39 వ తేదీ యోగ్యతాపత్రములీయబడెను. 4వ వేసవిపాఠశాల 1-5-40 వ తేదీ ప్రారంభమై 3 నెలలు నడచినది. ఇందు 25గురు విద్యార్థులుమాత్రము చేర్చుకొనబడిరి; వీరిలో 4 గురు స్త్రీలు. పరీక్షలో నెగ్గినవారు 15 మంది; ఇందు స్త్రీలిరువురు. వీరియోగ్యతాపత్రములు24-11-40 వ తేదీ ఇవ్వబడెను.

పరిషద్గ్రంథాలయమునకు నివేదికకాలములో కొన్ని గ్రంథములు చేర్చబడినవి. ఈగ్రంథాలయము కలకత్తా యూనివర్సిటీ కేంద్రగ్రంథాలయ భవనమున నుంచబడి గ్రంథాలయశిక్షణ సమయమున విద్యార్థులకును, బోధకులకును, కలకత్తాలోనున్న సంఘసభ్యులకును ఉపయోగపడుచున్నది.

సంఘపత్రికయొకటి, గ్రంథకర్తలసూచిక (ఇది పరిషత్గ్రంథమాలలో తృతీయ కుసుమము) నివేదికకాలములోని సంఘప్రచురములు. వంగదేశగ్రంథాలయాల డైరెక్టరీ ఒకటి తయారై అచ్చులోనున్నది. నిషిద్ధవాఙ్మయమునుగూర్చిన భోగట్టాను ఎప్పటికప్పుడు సంఘ కార్యాలయమునకు బెంగాలు ప్రభుత్వమువారు పంపుచున్నారు. ఈభోగట్టావివరములు సంఘపత్రికలో ప్రకటింపబడుచున్నవి.

సంఘమునకు స్థిరమగు స్వంతకార్యాలయము, ఇందులో దినమంతయు పనిచేయు వేతనోద్యోగి ముఖ్యావసరములుగ తోచుచున్నవి. ప్రస్తుతము దీని కార్యాలయము కలకత్తా యూనివర్సిటీ కేంద్రగ్రంథాలయ భవనమున నున్నది. గౌరవోద్యోగులే దీనిపనిని చూచుచున్నారు. యూనివ ్సిటీవారును, రాష్ట్రీయ ప్రభుత్వమును సంఘమువారి శిక్షణకు సంబంధించిన యోగ్యతాపత్రముల గౌరవించుచున్నారు.

| | 1939 వ సంll లో | | 1940 వ సంll లో |
|---|---|---|---|
| | రు అ పై | | రు అ పై |
| ఆదాయము | 1235-12-6 | | 1405- 0-0 |
| వ్యయము | 829-13-0 | | 669-12-9 |
| ఇందు గ్రం. శిక్షణ తరగతుల మూలమున | జమ 521- 0-0 | జమ | 700- 0-0 |
| | ఖర్చు 180-13-9 | ఖర్చు | 243- 0-0 |
| సభ్యుల చందాలవలన | జమ 442- 0-0 | జమ | 279- 0-0 |

## మద్రాసు గ్రంథాలయ సంఘము

### 13 వ సంవత్సర నివేదిక

1-2-1940 వ తేదీనుండి 31-1-1941 వ తేదీవరకు జరిగిన కార్యక్రమ మిందుగలదు. సంఘసభ్యులు 598 మంది. ఇందు 352 మంది శాశ్వతసభ్యులు, 78 సంస్థలు, 170 మంది సాధారణసభ్యులు.

1940వ సంll డిసెంబరు 21, 22, 23 తేదీలలో నీసంఘమువారు అచ్చుయొక్క పంచశతవార్షికోత్సవమును మద్రాసు యూనివర్సిటీ సెనెటుహాలులో జరిపిరి. ఈ సందర్భమున ప్రదర్శనమొకటి ఏర్పాటుచేయబడెను. ఇందు అచ్చుకుపూర్వముగల వ్రాతపుస్తకములు, అచ్చువిధానములు, బ్లాకులు చేయుపద్ధతులు వగైరా ప్రదర్శింపబడెను. నగరములోని ముఖ్యమగు అచ్చుపోత కర్మాగారములకును, ముద్రణాలయములకును యాత్రయొకటి ఏర్పాటుచేయబడెను. ఇందు 100 మంది జనులు పాల్గొనిరి.

నివేదికకాలములో సంఘపక్షమున 18 ఉపన్యాసములు గ్రంథాలయములకు సంబంధించినవి ఇప్పించబడెను. 10 వ్యాసములు వేర్వేరుపత్రికలలో గ్రంథాలయవిషయమై ప్రకటింపబడెను.

'విద్యుచ్ఛక్తిమహిమల'ను గూర్చిన తమిళ్‌గ్రంథము ప్రకటింపబడెను. దీనిని మద్రాసు యూనివర్సిటీలో 1942-44 బి. ఏ. తరగతికి పాఠ్యగ్రంథముగ నిర్ణయించిరి. 'రిఫరెన్సు సర్వీస్ అండ్ బిబ్లియోగ్రఫీ' ప్రథమభాగము నివేదికకాలములో సంఘముయొక్క 9వ ప్రచురముగ ప్రకటితమయ్యెను. దీనికర్తలు యస్. ఆర్. రంగనాథన్, సి. సుందరంగార్లు. తమిళ్ వాఙ్మయ సూచిక కార్యక్రమము సాగింపబడుచునేయున్నది.

ఇండియన్‌లైబ్రరీ అసోసియేషన్ సభ్యత్వము నీసంఘము నివేదికకాలములో విరమించుకొనెను. కాని పాట్నాలోజరిగిన నాల్గవఅఖిలభారత గ్రంథాలయమహాసభలో చదువునిమిత్తము 7 ఉపన్యాసములీసంఘపక్షమున సభ్యులచే పంపబడెను.

ఈరోడ్డు మహాజనహైస్కూలు, కారైకుడి మునిసిపల్‌కౌన్సిల్, బి. యన్. రైల్వే పే ఆఫీసులో పనిచేయుచున్న ఎ. కె. బెనర్జీగారు కోరినపుస్తకాల జాబితాలు వ్రాసిపంపబడెను.

నివేదికకాలములో ఈసంఘసాధారణసమావేశము ఒకపర్యాయమును, పాలకవర్గము ఐదు పర్యాయములును కూడెను. 12-4-40 వ తేదీన ఎస్ప్లనేడులోని వై. యం. సి. ఎ భవనమున కూడిన సాధారణ సమావేశములో పాలకవర్గపు ఎన్నికలు జరిగెను.

ఆదాయము రు 12,043-8-4; వ్యయము రు 3078-10-10; నిల్వ రు 8,964-13-6

## శ్రీ చెన్నపురి ఆంధ్రయువజన సమితి, చెన్నపట్టణము

### ప్రథమవార్షికోత్సవ నివేదిక

స్థాపితము ౧౯౪౦. యువకులలో భావశాశక్తిని, లేఖనాశక్తిని పెంపొందించుటయే గాక వారి శారీరక వికాసముతోపాటు, చేతిపనులలో కూడ తరబీయతునిచ్చుట ఈసంఘాదర్శము. ఈ కార్యసాధనకై గ్రంథాలయ మొక సాధనముగ గైకొనబడినది. మొదట 30మందితో ప్రారంభమైన ఈసంఘమునకు సంవత్సరాంతమున 150మంది సభ్యులేర్పడిరి. హిందువులపండుగలను జరపుచు వాని విశేషమునుగూర్చి పెద్దలద్వారా తెలిసికొనుటకు ఏర్పాటుచేయబడెను. గాంధీజయంతి సమయమునను, నెహూ్రపండితుడు నిర్బంధింపబడినప్పుడును, స్వాతంత్ర్యదినమునాడును ప్రత్యేకముగ సభలేర్పాటు చేయబడెను. ఈసంఘపక్షమున 15 సమావేశములు దేవుడున్నాడా?, రాట్నపరిశ్రమ, యువకులధర్మము, స్వయంకృషి, దేశభావము, శాస్త్రపఠనము మున్నగు వివిధవిషయములనుగూర్చి చర్చించుట కేర్పాటుచేయబడెను. ఈచర్చలలో 199మంది పాల్గొనిరి. కార్యనిర్వాహకసభలు 9 జరిగినవి. భాండాగారమున 800పుస్తకములుగలవు. 6నెలలలో 101మంది సభ్యులు 789 పుస్తకములనుచదివిరి. విద్యావిషయములందును, వ్యాయామక్రీడలందును వార్షికోత్సవమునకు ముందు పోటీలేర్పాటుచేయబడి బహుమతులిచ్చుట కేర్పాట్లుజరిగెను.

ఆదాయము రు 72-13-9; వ్యయము రు 57-15-7

గ్రంథాలయకార్యదర్శులు : చెవుల జానకిరాం, అమృతలూరు రాధాకృష్ణయ్యగార్లు

## సారస్వత నికేతనము, వేటపాలెము

### 22 వ సంవత్సర నివేదిక (1-9-39 నుండి 31-8-40 వరకు)

స్థాపకులు కీ. శే. ఊటుకూరు వెంకట సుబ్బరాయశ్రేష్ఠిగారు. సొసైటీల ఆక్టుక్రింద రిజిష్టరుచేయబడి గుంటూరుమండల కేంద్రగ్రంథాలయముగ నీ.సంస్థ పనిచేయుచున్నది. జాతి మత వివక్షత లేక చందాలతో నిమిత్తములేక స్త్రీపురుషులెల్లరు నీగ్రంథాలయము నుపయోగించుకొనవచ్చును.

నివేదికసంవత్సరములో చేర్చిన 483 గ్రంథములతో చేరి సంవత్సరాంతమున గ్రంథాలయములో 9680 గ్రంథములు గలవు. ఇందు 19 గ్రంథములను చదువరులు పోగొట్టిరి. 49 నిషిద్ధగ్రంథములు గ్రంథాలయమునుండి తొలగింపబడినవి. మఱి ముందు సంవత్సరములలో పోయిన గ్రంథములు 15 లభించని కారణమున వానిపేర్లు జాబితానుండి తీసివేయబడినవి.

నివేదికకాలములో 20,019 గ్రంథములు చదువబడినవి. ఇందు 3,503 పుస్తకములు 2548 మందిచే గ్రంథాలయమునందే పరిశీలింపబడినవి. 16,516 పుస్తకము లింటికుకొంపోబడినవి. వీనిని చదివిన 1040 మంది పాఠకులలో 984 మంది పురుషులు, 56 మంది స్త్రీలు, దీని సంచారశాఖమూలమున నివేదికకాలములో 152 మంది పాఠకులకు 1860 పుస్తకము లందజేయబడెను. ఇవిగాక క్రిందిగ్రంథాలయములకు 342 గ్రంథములరువీయబడినవి.

| | |
|---|---|
| గౌరవ బలిజ సంఘగ్రంథాలయము, స్వర్ణ | 82 |
| దేశోద్ధారక గ్రం॥ ఉప్పుగుండూరు | 175 |
| సత్యజ్ఞానానంద గ్రంథమండలి, మామిళ్లపల్లి | 25 |
| స్త్రీ హితైషిణిమండలి, బాపట్ల | 60 |

గ్రంథాలయమునకు తెప్పింపబడిన పత్రికలు 38. వీనిని చదువుటకై నిత్యము గ్రంథాలయమున కేతెంచు వారు సగటున దినమునకు 60 మందిగలరు. పరిశోధన కుపకరించుపత్రికల సంపుటముల నిరువదియై దింటిని నివేదికకాలములో బైండుచేయించి పుస్తకములపట్టికలో చేర్చిరి.

విజ్ఞానవ్యాప్తినిమిత్తము సుప్రసిద్ధులగువారిచే వివిధవిషయములపై 12 ఉపన్యాసములు నివేదిక కాలములో నేర్పాటు చేయబడెను. ఇవిగాక అప్పుడప్పుడు పురాణ హరికథాది కాలక్షేపములు గ్రంథాలయమున ఏర్పాటు చేయబడినవి. ప్రతి ఆదివారము భజనకాలక్షేపములు యథాపూర్వముగ జరిగినవి. గ్రంథాలయభవనము అనుకూలముగ లేనందున దీని పునర్నిర్మాణమునకై ప్రయత్నములు జరిగెను. ఇందు నిమిత్తము ఊటుకూరు కమలాంబగారు (కీ. శే. ఊ. వెం. శ్రేష్ఠిగారి సతీమణి) రు 2500/- ల నొసంగిరి.

శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు గ్రంథాలయమునకు గౌరవ గ్రంథభాండాగారిగ పనిచేసిరి.

ఆదాయము రు 14941-9-0; వ్యయము రు 14833-5-9. ఆదాయమొత్తములలో మూలధనము రు 10348/- బిల్డింగుఫండు రు 2500/- చేరియున్నవి. ఖర్చు మొత్తములలో పుస్తకములకు రు 158-8-3, పత్రికలకు రు 149-15-6, సిబ్బందికి రు 252-0-0, బైండింగుకు రు 158-12-6 ముఖ్యమైనవి.

ధర్మకర్త: వూటుకూరు జయరామందాసుగారు

## శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ ధర్మసంఘము, చిలకలూరిపేట

1-1-34 వ తేదీనుండి 31-3-41 వ తేదివరకుగల పైసంఘ కార్యనివేదిక మాకు చేరినది. చిలకలూరు పేటలో వేరువేరుగనున్న గ్రంథాలయ, చలివేంద్ర, గోసంరక్షణసంఘము లొకటిగ చేయబడి పైసంస్థయాజమాన్యముక్రిందకు తీసికొని రాబడినవి. ఇందు గ్రంథాలయమునకు సంబంధించి నంతవరకు 1-4-40 వ తేదీనుండి 31-3-41 వ తేదీవరకు జరిగిన కార్యక్రమము మాత్రము చేర్చబడినది. గ్రంథాలయము 'శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము' అను పేరుతోనే వ్యవహరింప బడినది. లోగడ రిజిష్టరైయున్న చలివేంద్ర సంఘ నిబంధనల మార్చి పైవిధముగ పేరునుకూడ మార్పు చేయుటచే గ్రంథాలయమును వేరుగ రిజిష్టరు చేయవలసిన పని లేకపోయినది.

నివేదికకాలములో తొలగింపబడిన గ్రంథములు 75. నూతనముగ చేర్చినవి 295. సంవత్సరాంతమునకు నిల్వయున్న గ్రంథములు 1570. గ్రంథాలయమునకు వచ్చుచున్నవి 3 దినపత్రికలు, 5 వారపత్రికలు, 4 పక్షపత్రికలు, 13 మాసపత్రికలు, 1 త్రైమాసికపత్రిక. నివేదికకాలమున నిత్యము గ్రంథాలయమునకు వచ్చినవారి సగటు హాజరు 55. ఇండ్లకీయబడిన పుస్తకములు 5400. ఇందు 431 గ్రంథములను 8 మంది స్త్రీలు చదివిరి.

హిందీ ప్రేమీమండలి పక్షమున గ్రంథాలయములో ఉచిత హిందీపాఠశాల ఏర్పాటు చేయబడినది. ఈ హిందీపాఠశాల వారేర్పాటుచేసిన 'వాణీవినోదగోష్ఠి' సభలు 4 మాత్రము గ్రంథాలయమున జరిగినవి. విద్యార్థులు పలువు రిందు పాల్గొని ఉపన్యసించిరి.

గ్రంథాలయ, చలివేంద్రశాఖల ఆదాయవ్యయములు కలిసియున్నవి. వీని ఆదాయమునుండి గోసంరక్షణ శాఖకు ఎక్కువగ సహాయము చేయవలసి వచ్చుచున్నది. అయినను రు 203-0-0 పుస్తకములక్రింద ఖర్చు పెట్టబడినది. రు 1065-0-0 విలువచేయు పొలము, రు 1410-12-3 విలువచేయు పుస్తకములు, రు 249-2-0 విలువచేయు సామానులు గ్రంథాలయమునకుగల ప్రత్యేకపుటాస్తి. చందాదారులు 24 మంది గలరు.

గ్రంథభాండాగారి: వంకాయలపాటి శేషావతారంగారు

## యువజనవిద్యామందిరము, మంచికలపూడి

### 1940 జూలై 1 వ తేదీనుండి 1941 ఏప్రిల్ 5 వ తేదీవరకు నివేదిక

స్థాపితము: 1938 జనవరి. రిజిస్టరైనది 1940 జూలై. మొదట జవహర్ విద్యామందిరమను పేరుతో స్థాపింపబడిన పఠనాలయము తదుపరి పై పేరుతో గ్రంథాలయముగ మార్చబడినది. మోరంపూడి పంచాయతీబోర్డువారు గ్రం॥ నకు సహాయపడిరి. భవననిర్మాణమునిమిత్తము ప్రయత్నములు చేయబడినను ఈపని పూర్తికాలేదు. 3 మాసములు వయోజనరాత్రిపాఠశాల గ్రంధాలయపక్షమున నడుపబడి నిరక్షరాస్యతా నిర్మూలములనమునకు కృషిచేయబడెను. ఈ పాఠశాలద్వారా గ్రామములలో నూతనోత్సాహముకలిగెను. గ్రంథాలయసభ్యులు 39 మంది. నివేదికకాలములో సర్వసభ్యసభ 2 పర్యాయములున్నూ, పాలకవర్గము 3 పర్యాయములున్నూ సమావేశమయ్యెను.

ఆదాయము రు 223-12-3; వ్యయము రు 112-12-3. ఆదాయములో రు 98 లు సభ్యులచందాలవలనను రు 50 లు జిల్లాబోర్డువారి వలనను లభించినవి. రిజిస్ట్రేషనుకు రు 58-4-0, పుస్తకాలకు పత్రికలకు చేరి రు 34-7-6 మొత్తము ఖర్చులైనవి.

కార్యదర్శి: **కొండవనేని చలమయ్యగారు**

## శ్రీ దేశోద్ధారకగ్రంథాలయము, ఉప్పుగుండూరు

### ప్రథమసంవత్సర నివేదిక, 1939—40

స్థాపన 1-11-39. గ్రంథములు 520 ఉన్నవి. 9 పత్రికలు తెప్పింపబడుచున్నవి. గ్రంథాలయము రిజిష్టరు చేయబడినది. నివేదికకాలములో గుంటూరుజిల్లాబోర్డువారు రు 50-0-0 లు విరాళమిచ్చిరి. వేటపాలెం శ్రీ సారస్వతనికేతనము (గుంటూరు మండల కేంద్రగ్రంధాలయము)నుండి ఉత్తమగ్రంథములను తెప్పించి పాఠకుల కందజేయుటకు గ్రంథాలయమువా రేర్పాటుచేసిరి. సభ్యులకుమాత్రము ఇండ్లకు పుస్తకము లిచ్చుచున్నారు. నివేదిక సంవత్సరములో చదువబడిన గ్రంథములు: ఉప్పుగుండూరులో 1755; ఇతరగ్రామములలో 256. భవననిర్మాణ విషయమై శ్రీ గోగినేని న్యాపాభక్తరాజుగారు మిగుల శ్రద్ధవహించిరి.

ఆదాయము రు 192-5-1; వ్యయము రు 124-7-9

కార్యదర్శి: **గంజాం అనంతలక్ష్మణాచార్యులుగారు**

## శ్రీ సీతారామ విజయసరస్వతీ పుస్తకభాండాగారము, సింగుపాలెం

### (1—3—40 వ తేదీ మొదలు 28—2—41 వ తేదీ వరకు)

స్థాపితము: 1—9—30. రిజిష్టరైనది. ఇప్పటివున్న పుస్తకములు 1214. ఇందులో నూతనముగ చేర్చినవి 54. గ్రంథాలయమునకువచ్చు పత్రికలు 6. సంవత్సర మొత్తం పై చదువబడిన పుస్తకములు 1692. గ్రంథాలయమునకు నిత్యమువచ్చువారి సగటుసంఖ్య 9. నివేదికకాలములో 2 సాధారణసమావేశములు, 6 పాలకవర్గసమావేశములు జరిగినవి. భవననిర్మాణమునకు కావలసిన స్థలము, రాయి, సున్నము, కొంత కర్ర సంపాదింపబడెను.

ఆదాయము రు 307—14—10; వ్యయము రు 166—2—3

కార్యదర్శి: **కొల్లి వెంకటరత్నంగారు**

## భారత సేవకమండలి, కాపూరు

### 1940 వార్షిక నివేదిక

స్థాపితము : 27–3–29. రిజిష్టరైనది. భవననిర్మాణదాతలు శ్రీ నాగళ్ళ వెంకయ్యచౌదరిగారు ప్రధాన పోషకులు. వీరుగాక 11 మంది రాజపోషకులు, 18 మంది శాశ్వతసభ్యులు, 5 గురు పోషకులుగలరు. మొత్తము పుస్తకాలు 400. 1939–40 వ సం॥లో 1800 పుస్తకాలు చదువబడినవి. ఇతర గ్రామములకు కూడ పుస్తకము లుచితముగ నీయబడు చుండెడివి. 9 పత్రికలు తెప్పించబడినవి. నివేదిక కాలములో 100 పుస్తకములు బైండుచేయబడినవి. రు 578–12–0 వెచ్చించి రేడియో కొనబడినది. రు 4000–0–0 కిమ్మతుచేయు చక్కని భవనము, 250 గజముల ఖాళీస్థలము, రెండెకరముల మాగాణి భూమి, గ్రంథాలయమునకు గల స్థిరాస్తి. జిల్లాబోర్డువిరాళము, అద్దెలు, పెండ్లికట్నములు, స్మారక వాగ్దానములు, ఇతర విధములగు విరాళములు, గ్రామస్థులపాటు మూలమున లభించు ద్రవ్యము గ్రంథాలయాదాయమునకు గల వసతులు.

ఆదాయము రు 872–2–0; వ్యయము రు 871–13–3

కార్యదర్శి : **నాగళ్ల గోపాలకృష్ణయ్యగారు**

## శ్రీ నెహ్రూ గ్రంథాలయము, గూడవల్లి

### పంచమవార్షికోత్సవ కార్యదర్శి నివేదిక (1939–40)

స్థాపితము: 2-1-34. రిజిస్టరైనది. పుస్తకములు 540; పత్రికలు 4. నివేదిక కాలములో 2 సాధారణ సమావేశములు, 4 కార్యవర్గసమావేశములు జరిగినవి. భాండాగారికి నెల1కి రు 4/- వేతనమిచ్చుటకు తీర్మానింపబడినది. గ్రంథాలయమునిమిత్తము నిర్మింపబడిన నూతనభవనమునకు చల్లపల్లి జమీందారు గారు రు 150-0-0, గోగినేని కుటుంబయ్యగారు రు 100-0-0 ఇచ్చిరి. దీనికి మొత్తము రు 2262-8-0 ఖర్చైనది. ఇందుసగము విరాళములవలననే లభించినది. నివేదిక కాలములో 1200 పుస్తకములు చదువబడినవి. నిత్యము గ్రంథాలయమునకు వచ్చువారి సగటుసంఖ్య 32. గ్రామములోని గడ్డిపాటల వగ్తరామూలమున రు 177-8-6, గ్రంథాలయముకాటా అద్దెద్వారా రు 311-11-11 సంపాదించబడినవి. గుంటూరుజిల్లాబోర్డువారి విరాళము, పెండ్లికట్నములు, సభ్యులచందాలు గ్రంథాలయమునకు గల ఆదాయవసతులు.

ఆదాయము రు 253-13-6 : వ్యయము రు 234-8-0

కార్యదర్శి : ఘంటా సీతారామయ్యగారు

## శ్రీ జాతీయ బాలభారతీ గ్రంథనిలయము, కనగాల

### సప్తమ వార్షికనివేదిక

స్థాపితము : 1923. రిజిష్టరైనది. నివేదికకాలములో సాధారణసమావేశములు 2, పాలకవర్గసభలు 11 జరిగినవి. 1940 వ సం. మార్చినుండి నె 1కి రు 5/- వేతనమును భాండాగారి కిచ్చుటకు తీర్మానింపబడినది. కీ. శే. యెండూరి సుబ్బారావుగారి జ్ఞాపకార్థము కనగాలలో నిర్మింపబడిన ధర్మ సత్రములో పడమటిప్రక్క గ్రంథాలయము నుంచుకొనుటకు సత్రంమేనేజింగు ట్రస్టీగారేర్పాటు చేసిరి. గ్రంథాలయమునకు వచ్చు 11 పత్రికలలో ఆంధ్రదినపత్రిక మాత్రము గ్రంథాలయము సొమ్ముతో తెప్పించబడుచున్నది. నివేదిక సం॥లో చేర్చబడిన 69 పుస్తకములతో చేరి మొత్తం

గ్రంథాలయములోని గ్రంథములు 217౦. సభ్యులు 50 మంది. సంవత్సరము మొత్తముపై చదువబడిన గ్రంథములు 3378. గ్రంథాలయమునకు వచ్చువారి దినసరి సగటు హాజరు 48.

ఆదాయము రు 205-2-5; వ్యయము రు 82-4-6

కార్యదర్శి : ధూపం బసవనాగయ్యగారు

## శ్రీ వివేకవర్ధనీ గ్రంథనిలయము, ఐలవరము

### ద్వితీయవార్షిక నివేదిక

స్థాపితము: 1938. రిజిష్టరైనది. గ్రంథాలయము శ్రీవేణుగోపాలస్వామివారి ఆవరణములో నుంచ బడినది.

నివేదిక కాలములో క్రొత్తగచేర్చిన 432 పుస్తకములతోచేరి మొత్తము గ్రంథముల సంఖ్య 1794. 1దిన పత్రిక, 2 వారపత్రికలు, 1 పక్షపత్రిక, 5 మాసపత్రికలు వచ్చుచున్నవి. సభ్యులు 99మంది గలరు. సంవత్సరం మొత్తముపై 7991 గ్రంథములు చదువబడినవి. గ్రంథాలయమునకు నిత్యమువచ్చు వారిసగటు హాజరు 80.




| ఆదాయము | రు.అ.పై. | వ్యయము | రు.అ.పై. |
|---|---|---|---|
| నిల్వ | 39- 0-9 | పత్రికలు | 28- 0-0 |
| చందాలు | 94-10-0 | రిజిస్ట్రేషను | 50- 0-0 |
| విరాళములు | 73-11-6 | భాండాగారి | 30- 0-0 |
| పాతపత్రికలు | 8-12-0 | ఇతరములు | 37-13-3 |
| | 216- 2-3 | | 145-13-3 |
| | 145-13-3 | | |
| | రు 70-5-0 నిల్వ | | |

కార్యదర్శి: అకురాతి వేంకటరత్నంగారు

## కమలానెహ్రూ గ్రంథాలయము, తూములూరు

### 5-5-39 నుండి 31-3-40 వరకు నివేదిక

స్థాపితము 5-5-36. రిజిస్టరైనది. 600 పుస్తకములలో చాలభాగ ముచితముగ సంపాదింపబడినవే. 1-1-40 నుండి 31-3-40 వరకు 400 పుస్తకములు చదువబడినవి. ఆంధ్రదినపత్రికమాత్రము నివేదిక చివరిదినములలో తెప్పించబడినది. గ్రంథాలయ ప్రారంభదినములలోనున్న చందాదారులు 80 మంది. ఈసంఖ్య నివేదిక కాలములో చాల తగ్గినది. శ్రీ డి. వి. యస్. ఆచార్యులుగారు దీని నిర్వహణభార మును వహించిరి. గ్రంథాలయము ప్రారంభమైనప్పటినుండి గ్రంథాలయమునకుగాను రు 343-7-3 ఆదాయము వచ్చెను. నివేదికాంతమునగల నిల్వ రు 7-14-6.

కార్యదర్శి : అవుతు సుబ్బారెడ్డిగారు

## శ్రీకృష్ణదేవరాయ పుస్తకభాండాగారము, కోలవెన్ను

పై గ్రంథాలయ పంచమవార్షికోత్సవ సందర్భమున ప్రకటింపబడిన నివేదిక మాకుచేరినది. 15-9-39 తేదీ నుండి 16-12-40 వ తేదీ వరకుగల కార్యక్రమముతోపాటు 1917 వ సం ॥ లో స్థాపింపబడిననాటి నుండి దినిసంగ్రహచరిత్ర 9-4-34 వ తేదీనుండి ఏటేట దీని ఆదాయవ్యయ వివరములు ఇందుగలవు.

దీని స్థాపకులగు కీ. శే. యార్లగడ్డ వెంకటసుబ్బయ్యగారు 12-3-33 వ తేదీన మరణించుటచే భాండా గారమునకు కలిగిన లోటునుతీర్చి వీరిధర్మపత్ని ఈశ్వరమ్మగారు ఈ సంస్థానిర్వహణమున కన్నివిధ ముల తోడ్పడుచున్నట్లు తెలుపబడినది. 16-8-34 వ తేదీ ఈ సంస్థ రిజిస్టరు కావింపబడినది. ఈలోపల నీయూరిలో స్థాపితమైన వి. జె. పటేల్ క్లబ్ 1934 వ సం॥లో తిరిగి యీగ్రంథాలయముతో చేరిపోయినది. 1935 వ సం॥ లో అంతకుపూర్వ మసంపూర్తిగనున్న భవనము ఈశ్వరమ్మగారి సాయ ముచే పూర్తియైనది. తదుపరి వీరిఅత్తగారు శ్రీ సీతమ్మగారిచ్చిన విరాళముతో ప్రహరీ నిర్మాణముకూడ జరిగినది. 8-11-35 వ తేదీ చల్లపల్లి రాజాగారిచే భవనప్రవేశ మహోత్సవము గావింపబడినది.

1936-37, 1937-38 సం॥ లలో గవర్నమెంటువారీ గ్రంథాలయమునకు వరుసను రు 55, రు 80 గ్రాంటునిచ్చిరి. గ్రంథాలయపరిపాలన క్రమముగ జరుగుటకై ముగ్గురుట్రస్టీలతో నొకట్రస్టుడీడు కూడ రిజిస్టరు చేయబడినది. 1938-39 వ సం॥లో గ్రంథాలయములో స్త్రీశాఖ స్థాపింపబడి స్త్రీచందా దారులకు ఇండ్లకు పుస్తకములు, పత్రికలు పంపబడెడివి.

ఈ నివేదికాంతమున గ్రంథాలయమున 1500 గ్రంథములుగలవు. 16-12-40 వ తేదీనాటికి 5 గురు మహారాజపోషకులు, 4 గురు రాజపోషకులు, 20 మంది ప్రధానపోషకులు, 8 మంది పోషకులు, 26 రు శాశ్వత చందాదారులు (ఇందులో 4 గురు స్త్రీలు), సంవత్సర చందాదారులు—69 మంది పురుషులు, 3 గురు విద్యార్థులు, 23 స్త్రీలు గలరు. భాండాగారమునకు నిత్యమువచ్చువారి సగటు హాజరు 30. గ్రంథాలయ పక్షమున 2 దిన పత్రికలు, 4 వార పత్రికలు, 1 పక్ష పత్రిక, 2 మాస పత్రికలు తెప్పింపబడుచున్నవి. ఇవిగాక గ్రంథాలయభవనమునందున్న పం. బోర్డు పఠనమందిరమునకు దిన, వార, మాసపత్రికలు మరి ఆరు వచ్చుచుండును.

గ్రంథాలయమునకుగల రు 1417-11-0 ల మూలధనముతో యి 1-91 శెంట్లు మాగాణిభూమి కొన బడినది. 12—5—40 వ తేదీ ఈ గ్రంథాలయ యాజమాన్యమున బెజవాడ తాలూకా గ్రం. మహాసభ జరుపబడినది. నివేదిక సంవత్సరములో 10 కార్యనిర్వాహకవర్గ సభలు జరిగినవి. ఏటేట గ్రంథాలయ యాజమాన్యమున వ్యాయామక్రీడలలో పోటీల నేర్పాటు చేయుచున్నారు.

| ఆదాయము | రు. అ. పై. | వ్యయము | రు. అ. పై. |
|---|---|---|---|
| నిల్వ | 1165— 7—9 | పత్రికలు | 54—14—0 |
| చందాలు | 77— 4—0 | గ్రంథములు | 0— 4—0 |
| అద్దె | 64— 0—0 | సామాను | 39— 1—6 |
| ఇతరములు | 612— 6—6 | బైండింగు | 34— 0—0 |
| మొత్తం | 1919— 2—3 | ఎస్టాబ్లిష్ మెంటు | 21— 0—0 |
| | 1804—12—9 | పొలముకొన్నందుకు | 1417—11—0 |
| నిల్వ రు | 114— 5—6 | ఇతరములు | 237—14—3 |
| | | మొత్తం | 1804—12—9 |

కార్యదర్శి: గానుగపాటి వెంకట హరినారాయణగారు

## శ్రీ వేమనగ్రంథాలయము, తేలప్రోలు

### 8 వ వార్షికోత్సవము కార్యదర్శి నివేదిక

స్థాపితము: 14-6-33. రిజిస్టరు చేయబడినది. నివేదికకాలములో 1 సాధారణసమావేశము, 8 కార్యనిర్వా హక వర్గసమావేశములు జరిగినవి. చందాదారులు 75మంది. మొత్తముపుస్తకములు 1231. ఇందులో 106 క్రొత్తగ చేర్చబడినవి. నివేదిక కాలములో 4262 గ్రంథములు చదువబడినవి. 10 పత్రికలు తెప్పించబడినవి.

| ఆదాయము | | వ్యయము | |
|---|---|---|---|
| రు అ పై | | | రు అ పై |
| 353- 2-3 | నిల్వ | పత్రికలు | 80- 3- 0 |
| 202- 0-0 | చందాలు | పుస్తకాలు | 75-15- 6 |
| 61- 0-0 | విరాళములు | సిబ్బంది | 35- 0- 0 |
| 24- 9-6 | వడ్డి, పాతపత్రికలు | బైండింగు | 24- 0-11 |
| 640-11-9 | మొత్తం | సామాను | 21- 2- 3 |
| 268- 1-8 | | ఇతరములు | 31-12- 0 |
| రు 372-10-1 | నిల్వ | మొత్తం | 268- 1- 8 |

కార్యదర్శి: **అరుమళ్ల రామసంబ్బారెడ్డిగారు**

## శ్రీబాలసరస్వతీ పుస్తకభాండాగారము, మాజేరు

### 18వ వార్షికోత్సవ కార్యనివేదిక

31-3-41 వ తేదీనాటికి 1989 గ్రంథములు (తెలుగు 1774, హిందీ 15, ఇంగ్లీషు 192, సంస్కృతము 8) కలవు. ఇందు 3 వంతులకుపైగా శ్రీ మాజేటి రామచంద్రరావుగారివి. నివేదికకాలములో (ఏప్రిల్ 1940-మార్చి 1941) 394 పుస్తకములు గ్రంథాలయమునకు చేరినవి. ఇది కేంద్రగ్రంథాలయముగ పనిచేయుచు చుట్టుప్రక్కల గ్రామములవారికికూడ గ్రంథముల నందజేయుచున్నది. 18-9-39 వ తేదీ ప్రారంభింపబడి 1940 జూన్‌వరకు నిర్వహింపబడిన దీని సంచారశాఖమూలమున ఒక్క లంకపల్లి గ్రామమునకుమాత్రము పుస్తకములు పంపబడినవి. నివేదిక సం॥లో 4 మహాసభలు జరిగినవి. గ్రంథాలయమునకు 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రగ్రంథాలయం', 'విజ్ఞానం' పత్రికలు మాత్రము తెప్పించబడుచున్నవి.

ఆదాయము రు 40-11-0; వ్యయము రు 40-11-0. ఇందులో రు 24-7-0 పుస్తకములకును, రు 12-6-0 పత్రికలకును ఖర్చుచేయబడినది.

కార్యదర్శి : **గొట్టిపాటి కుటుంబరావుగారు**

## శ్రీ వీరేశలింగకవి సమాజగ్రంథాలయము, కుముదవల్లి

### 43 వ వార్షికనివేదిక

స్థాపితము : 22-6-1897. స్వంతభవనముకలదు. రు 2620-0-0 మూలధనమున్నది. గ్రంథాలయ సభ్యులు 54 గురు; నివేదిక కాలములో మహాసభలు 11, కార్యనిర్వాహకసభలు 11 జరిగినవి. 1668 గ్రంథములు కలవు. 12 పత్రికలు తెప్పించబడినవి. గ్రంథాలయమునకు సగటున నిత్యము 24 మంది వచ్చిరి. సంవత్సరముమొత్తము పై పురుషులు 439, స్త్రీలు 540 పుస్తకములు చదివిరి. గ్రంథాలయపక్షమున వెనుకటివలెనే బీదలకు వస్త్రదానము, వైద్యసహాయము చేయబడినవి. ఇందుకు గాను వరుసను రు 13-4-0, రు 21-9-6 మొత్తములు ఖర్చైనవి. గ్రంథాలయము లెక్కలు భీమవరం అసిస్టెంటు పంచాయతీఆఫీసరు శ్రీ కలిదిండి నరసింహరాజు, బి. ఏ., గారు తనిఖీచేసిరి.

ఆదాయము రు 278-12-9; వ్యయము రు 259-4-9

కార్యదర్శి: **కలిదిండి జానకిరామరాజుగారు**

# లేఖలు

## ఏ పుస్తకము యెక్కడ దొరుకును?

ఈ సమస్య యిప్పుడు చాలమంది ఉత్సాహవంతులైన పాఠకులను, గ్రామగ్రంథాలయాలను బాధిస్తున్నది.

'రాష్ట్రగానము యెక్కడ దొరకును?' అని స్నేహితుని అడిగితే, 'ఏమో తెలియదు' అంటాడు. పుస్తకము వెల రెండణాలే-కాని అది లభించటం చాలా కష్టం- స్థానిక పుస్తక విక్రయశాలలలో దొరకదు. ప్రకాశకుల చిరునామా తెలుసుకోవాలంటే నానా అవస్థలు పడాలి. ఏమి ఆ యవస్థ పడకపోతే! పాఠకుని మనస్సూరకోనదు. చదివితీరాలని ఉద్రేకం కలుగుతుంది. ఆంధ్రరాష్ట్ర విషయం కాబట్టి-కొన్ని పత్రికలు గ్రంథసమీక్షక్రింద మంచి అభిప్రాయాలు తెలిపినవి. చిరునామా కూడా ఉన్నది. ఆ పాతపత్రికలు కొన్ని స్నేహితులు పట్టుకవెళ్ళారు. కొన్ని పిల్లలు చింపేశారు. కావాలన్నప్పుడు ఒకటీ దొరకకపోవటం సహజమేగా! ఒకవేళ దొరకినది, చిరునామా తెలసినది. బుక్కుపోస్టుగా తెప్పించి నా రెండణాల పుస్తకమునకు అణన్నర చార్జి. ఖర్చుఅయినా అది బుక్ పోస్టు నమ్మకమే గాని చేరి తీరుతుందని ఆశలేదు. రిజిష్టరు పార్సెలుద్వారా తెప్పిస్తే ఖర్చులు మూడురెట్లగును.

ఇలాగే అనేకకవులు, రాజకీయవేత్తలు, కథకులు, విజ్ఞానులు, సంస్కర్తలు, ప్రసిద్ధిజెందిన రచయితల విజ్ఞానయుతమగు గ్రంథములు పాఠకుడు తెప్పించుకోవాలంటే పైన వివరించిన కష్టాలే అనుభవమగుచున్నవి.

ఈసమస్య ప్రకాశకులు, గ్రంథాలయోద్యమ నాయకులు విచారింపవలసిన అత్యవసరమైన విషయము. దీనివలన ఒకదెబ్బకు రెండుపిట్టలు పడును. ఒకటి, పాఠకులు సులభముగా పుస్తకముల బడయుదురు. రెండు, 25 వేలు గ్రామాలు అనేకవేల పాఠకులలో వారి గ్రంథములు ప్రచారము చేయబడుటచే ప్రకాశకులకు లాభముగల్గును. ఈ సమస్యా పరిష్కార మార్గమేమి?

కేంద్ర గ్రంథనిలయము స్థాపింపబడవలెను. ప్రకాశకులందరు తమ పుస్తకములను విక్రయించుటకు ఏజన్సీ పైనిలయమున కివ్వవలెను. ఈ నిలయము పుస్తక ప్రచారమెక్కువగా చేయవలెను. వివిధ రచయితల గ్రంథములు ఒకేసారి స్వల్పఖర్చులతో తెప్పించుకొనుటకు పాఠకుల కుపయుక్తముగ నుండును. అనామకులైన ఏజంట్లద్వారా విక్రయించుటకు బదులు, ఎక్కువ ప్రచారముచేయు పై మండలిద్వారా సుళువుగా విక్రయించుకొనవచ్చును.

ఈపని నెవ్వరు నిర్వహించవలెను? ఆంధ్రరాష్ట్రసర్వతోముఖాభివృద్ధికై పాటుపడుచుండిన చెన్నపురి ఆంధ్రమహాసభవారు దీనిని చాల సులభముగా, లాభకరముగా నిర్వహింపవచ్చును. ప్రకాశకులందరు ఒకొక్కకాపీ గ్రంథసమీక్షకై యిచ్చినయెడల, సమీక్ష తదుపరి, ఆంధ్రమహాసభాగ్రంథాలయమున జేర్చిన- గ్రంథాలయము కూడ అభివృద్ధియై ఆదర్శప్రాయముగ, అత్యంతోపయుక్తముగ నుండును. ఏ పుస్తకములు కావలసినను ఆంధ్రదేశమం దన్నిమూలలనుండి 'ఆంధ్రమహాసభ-మద్రాసు' అని వ్రాసి చాల సుళువుగా పాఠకులు తెప్పించుకొనగలరు. అందులకు వారు ప్రయత్నించనియెడల గ్రంథప్రకాశకులునైయున్న ఆంధ్రపత్రికాధిపతులే పూనుకొనవచ్చును. లేక స్వలాభమును గుర్తించి ప్రకాశకులందరు గలసి యేర్పరచవచ్చును.

డాక్టరు చౌదరి యన్. దేశాయ్, యల్. యం. పి., ఆంధ్రరత్నగ్రంథాలయాధ్యక్షుడు
చుండుపల్లి-కడపజిల్లా. (ఆంధ్రపత్రిక 24-11-40)

ఈసందర్భమున 1941 జనవరినెలలో రాజమహేంద్రవరమున కూడిన 22వ ఆం. దే. గ్రం. మహాసభవారి క్రింది తీర్మానమును పాఠకులు గమనించ గోరెదము. ఈ కార్యము ముఖ్యముగ గ్రంథాలయములకు సంబంధించిన దగుటచే ఇతరుల సహాయముతో దీనిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారే నిర్వహించుట మంచిది. ఇందు విషయమై పై మహాసభాధ్యక్షులు శ్రీమాారేపల్లి రామచంద్రశాస్త్రిగారును తమ అధ్యక్షోపన్యాసమున ఆంధ్రదేశ కేంద్రగ్రంథాలయమును గూర్చి చెప్పిన మాటలు గమనార్హమైనవి. (ఇదేసంచిక 55వ పేజీ చూడుడు).

తీర్మానము ౨౭.
ఆంధ్రదేశమునందలి గ్రంథకర్తలకు, గ్రంథప్రకాశకులకు, గ్రంథములను సేకరింప దలచినవారికి కేంద్రవిక్రయశాల నొకదానిని స్థాపించుట అత్యంతావసరమని ఈసభ వారభిప్రాయపడుచు అట్టిసంస్థను ఏర్పాటుచేయుటకు తగిన ప్రబోధమును చేయ వలసినదని ఆం. దే. గ్రం. సంఘమువారి నీసభవారు కోరుచున్నారు.

[ఆం. గ్రం. సం.]

## ఉపాధ్యాయ పండిత పరిషత్తు : విజ్ఞాన పరీక్షలు

24-8-40 వ తేదీ పైపరీక్షలనుగూర్చి ఆంధ్రపత్రికలో ప్రకటించబడిన వివరములు చూచితిని. ప్రథమ-పరీక్షకు నిర్ణయింపబడిన గ్రంథములు జూచిన ఇందుచాలభాగము నేటివిద్యాలయములలో నుపయోగింప బడుచున్నవే. నేటివిద్యావిధానమును, ప్రస్తుతము మనపాఠశాలలలో నుపయోగింపబడుచున్న గ్రంథములను పూర్తిగ మార్చినగాని మనజాతి ఉద్ధరింపబడుట కష్టమని పెద్దలు పలువురు అనేకపర్యాయములు చెప్పుచుండుట మనము వినుచునేయున్నాము.

ఈ పరీక్షల నేర్పాటుచేయుటలో పరిషత్తువారిఉద్దేశము, నిత్యము బడికి క్రమముగపోయి తమకాలమును ధనమును వినియోగించి చదువుకొనలేనివారికి స్వయంకృషిచే తమవీలుననుసరించి విజ్ఞానమును సేకరించుకొనుటకై ప్రోత్సహించుటయే యగుచో, పనికిమాలినదని పెద్దలచే చెప్పబడుచున్న ప్రస్తుత విద్యావిధానమునకే మరికొందఱ దాసుల జేయనక్కరలేదు. స్వతంత్రముగ విద్యనార్జించుటకు వారికి ప్రోత్సాహమిచ్చుచు, స్వతంత్రభావములు వారిలో జనించుట కంతగా ఎడమీాని, జాతీయతను బొత్తుగ ప్రోత్సహించని యంత్రప్రాయమగు విధానమునకు వీరిని గురిజేయుట సబబుగ కన్పట్టదు.

ఇట్టిపరీక్షలను ఆంధ్రదేశ గ్రంథాలయసంఘపక్షమున ఏర్పాటుచేయవలెనని చాలకాలముగ నాలోచనలోనుండియు అదనుకొరకు వేచియుంటిమి. ఈపని ప్రస్తుతము పూనిన పరిషత్తువారు తమప్రణాళికను జాతీయతను పెంపొందించుట కనువగునట్లు మార్పగలుచో ఆంధ్రదేశమందలి ముఖ్య గ్రంథాలయములను పరీక్షాకేంద్రములుగా నేర్పాటు చేసి గ్రామగ్రంథాలయములద్వారా ఈపరీక్షలకు అభ్యర్థులు రాగలుగునట్లు ప్రయత్నించవచ్చును. ఈ పద్ధతివలన నెక్కువైన ప్రయోజనముండునని నాయూహ.

ఉపాధ్యాయ పండిత పరిషత్కార్యకర్తలు, ఆంధ్రదేశగ్రంథాలయ సేవకులు ఈవిషయమై పర్యాలోచింతురుగాక!

పాతూరి నాగభూషణం, కార్యదర్శి, ఆం. దే. గ్రం. సంఘము

(ఆంధ్రపత్రికనుండి)

## శారదానికేతనము : ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

**శ్రీ శారదానికేతనము కార్యదర్శి శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిట్లు వ్రాయుచున్నారు:—**

శ్రీ శారదానికేతనముయొక్క గ్రంథాలయమునకు అనుబంధముగా ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము కొంతకాలము క్రిందట స్థాపింపబడినది. ఆ భాండాగారమునకు అనంతపురముజిల్లా, హిందూపురముతాలూకా, కల్లూరు గ్రామవాస్తవ్యులైన శ్రీ కల్లూరు రామప్పపంతులుగారును, శ్రీ కల్లూరు పుండరీకాక్షయ్యపంతులుగారును, శ్రీ కల్లూరు సుబ్బారావుపంతులుగారును, తమ పూర్వీకులైన శ్రీ కల్లూరు చిననారనప్పగారిచే లిఖింపబడిన శ్రీ ఆంధ్రమహాభారతము అన్ని పర్వములును, శ్రీ మద్భాగవతము అన్ని స్కంధములును, శ్రీ రంగనాథరామాయణము అన్ని కాండలును, శ్రీ విజయవిలాసము, శ్రీ వీరభద్రవిజయము, హంసవింశతి వైద్యగ్రంథమునుగల తాళపత్ర సంపుటములను, శ్రీ శారదానికేతనమునకు ఉచితముగా బహూకరించి ఆంధ్రవాఙ్మయమునకు అమూల్యమైన సేవ గావించిరి. ఒక్క వైద్యగ్రంథముతప్ప తక్కిన సంపుటములన్నియు, చెక్కుచెదరక ముత్యాలవంటి అక్షరములతో వ్రాయబడి యున్నవి. పై ముగ్గురికిని నికేతనముయొక్క కృతజ్ఞతాపూర్వక వందనముల సమర్పించుచున్నాను.

ఈ గ్రంథములన్నియు శారదానికేతనముయొక్క విశాలగ్రంథాలయ భవనములో పదిలము చేయబడి యున్నవి. శిథిలమైన వైద్యగ్రంథమునకు ప్రతి వ్రాయించుటకు ప్రయత్నించుచున్నాము. ఆంధ్రదేశములోని వాఙ్మయాభిమానులెల్లరును యిట్టి సంపుటములుగాని, శాసనములుగాని, విగ్రహములుగాని, ఇతర చరిత్రాత్మకమైన వస్తువులుగాని, మా ప్రదర్శన నిలయమునకు పంపినయెడల నికేతనమున భద్రము చేసి, ఇతరులకు ఉపయోగించునట్లు చేయగలము.

(ఆంధ్రపత్రిక 10—10—40)

## పురాతన పశువైద్యగ్రంథము : 2000 యేండ్లనాటి ప్రతి దొరకుట

అ. ప్రె. వార్త—సిమ్లా, జూలై 1, 1940

భారతదేశమున 2000 యేండ్ల క్రిందటి కాలమునాటి పశువైద్యగ్రంథ మొకటి వ్యవసాయపరిశోధన మండలి ప్రత్యేకోద్యోగి పరిశోధనమూలమున లభించెను. భారతదేశమున అనాదినుండి పశువుల రోగాలకు దేశీయపద్ధతి ప్రకారము కొందరు పశువైద్యులు చికిత్సనొసగుచుండుట వాడుకైయున్నది. కాని అట్టి వైద్యులు పరంపరగా వైద్యము చేయుచున్నారేగాని ఈ పురాతనగ్రంథములోని జ్ఞానము వారికి తెలియదు. పూర్వకాలపు భారతీయపశువైద్యులు తమ చికిత్సాపద్ధతులను, మందులను రహస్యముగానుంచుకొనెడివారు. పై తెలుపబడ్డ పురాతన గ్రంథము దొరకినందున అయ్యది చాలా ఉపయోగకరముగా నుండగలదని యెంచి దానివిషయమై పూర్తిగా పరిశోధనలు జరుప విశ్వవిద్యాలయముల పరిశోధననిపుణుల సేవను గైకొనుటకు వ్యవసాయపరిశోధన సలహాబోర్డు నిశ్చయించెను. ఆ గ్రంథము వ్రాతప్రతిలోని ఓషధులు శాస్త్రీయముగా పరీక్షింపవలెనని బోర్డు ఉద్దేశ్యము. ఈ కార్యము జరుపు యూనివర్సిటీ పరిశోధకులకు బోర్డు ధన మొసగును.

(ఆంధ్రపత్రికనుండి)

---

*

# గ్రంథసమీక్షలు

**ముసలమ్మమరణము:** కృతికర్త— డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, ఎం.ఏ. (కాంటబ్), డి.లిట్.
ప్రచురణకర్తలు— ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు
ఇంపీరియల్ సైజు 28 పేజీలు. వెల నాలుగణాలు

నలుబదియేండ్లకు పూర్వమే రచితమైన రెడ్డిగారి మధురకావ్యమిది. గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి తొలిపలుకుతోను, గ్రంథకర్తగారి మొదటికూర్పు ముఖపత్రముతోను ఈ కబ్బము కట్టమంచి వారి షష్టిపూర్తి సందర్భమున కానుకగా మూడవకూర్పునంది సహృదయుల కరకమలముల నలంకరించినది.

కావ్యముపేరు "ముసలమ్మ మరణము". "ఎవరీ ముసలాబిడ? ముసలిదేకదా, చచ్చిననేమి?" అనుకొనుచూ కావ్యపఠన మారంభింతుము. పదునాలుగు పద్యములవఱకు గడముట్ట చదువునప్పటికి, ఆకాశవాణి "బసిరెడ్డికింగడ కోడలు ముసలమ్మయనంగ నొప్పు పుణ్యాంగన..."ను "కడుమెత్తని హృదయముగల పసిదానిని" మనకు బరిచితి యొనర్చును. ఇంతకుమున్నె "బుక్కరాయసంద్రము" నంగల పెద్ద చెఱువు జోరనివచ్చిన వానలకు నిండి పొర్లి కట్ట త్రెంచుకొని గ్రామసీమను ముంపనుండ 'పోలేరమ్మకుపొంగలో'యనుచు రెడ్లు రైతులు నొనర్చిన జాతరను మన మెఱింగియుందుము. ఇపుడు "...ముసలమ్మ యనంగనొప్పు పుణ్యాంగన తావెస బలిగాంబోయిన మీకినుమంతయుం గష్టమెన్నండేలాకలుగుకె?" అని వినుటతోడనే పడుచుంబ్రాయపుమిటారి, నోసములకోటారియగు ముసలమ్మమీద భక్త్యాదరములు మున్పిరిగొన కావ్యముం దుదముట్ట జదువువఱకు డెందము కొందలం పడుచునే యుండును. చదువుదుము. చదివి పడయునదేమి? విషాదమే! అయినను ఈవిషాదములో నొక యానందమున్నది. 'బుక్కరాయసంద్రము' లోని జనము నుద్ధరించుటకు ఆత్మనాథుని, ప్రియకుమారుని, అత్తమామలనువీడి ఆత్మార్పణ మొనర్చిన కాపుంబడంతి మృతి కృతిలోనున్న నిర్వృతి సీతాసావిత్రీ చంద్రమతుల యుదంతములలోని మహత్త్వ మొకయెత్తు. ఈ సత్యచరిత్రలోని సత్త్వ మొకయెత్తు. అనిదం పూర్వమైన యాసామాన్యవనిత త్యాగమునకు పాఠకు డబ్బురంపడి పోవును. ఇందాత్మహత్యా దోషములేదు. అసంఖ్యాక ప్రాణులనుద్ధరింప నాత్మార్పణ మొనరించిన ఈ చేడియ త్యాగశక్తి లాతి నారీలోకమున కాదర్శప్రాయము. గ్రంథకర్త యాశయమునదియే.

అనంతపురమునకు సమీపముననున్న 'బుక్కరాయ సముద్రము'ను గ్రామమున నీచరిత్రము జరిగియున్నదంట. ఆయూర నిప్పటికిని ముసలమ్మను గ్రామదేవతగా నర్చించుచున్నారంట. ఇట్టి యుదంతమును ఆదర్శప్రాయముగా జిత్రించుటలో రెడ్డిగారు కృతకృత్యులయినారు.

బాల్యమునుండియు రెడ్డిగారి కవితారీతి భారతకవితను బురుడించుచునే యున్నదని యీపొత్తము చెప్పుచున్నది. "కవిత్వ తత్త్వ విచారము" తరువాతజేసినను అందలి సూత్రములకు లక్ష్యభూతమగు కవిత యిందు గాననగు. సముచితమైన వర్ణనారీతులతో నను రూపభాషాశరీరమును గైసేసికొని యుదాత్త వస్తుమనోహరమై, శతాధిక పద్యములతో నీకావ్యము పూర్తియగుచున్నది. శ్రీ కొక్కొండ వెంకటరత్నముపంతులు మున్నగు పండితవర్యుల సలహాల నందికొన్నదిగూడను.

రెడ్డిగారి కవితాచాతురిని జూపించు కొన్ని సూక్తులు— "హృదయమన్నొయప్పడెత్తువెన్న"

క. తేసగవును గన్నీళ్ళను
గా, నెద తటతట యనంగ గాంతుని యెదుటన్

వానయును నెండయుఁ గలసెడు
చో నొప్పెడు నభమనంగ సుందరినిలిచెన్"

"జనులకు మేలొనరింపని తనువేలా కాల్పఁదగదొ..." "అరుణోదయచ్ఛాయలు..." "కన్నెఱవారిన ఖరకిరోదయకాలము..." అనుప్రాసములు అద్భుతసృష్టి సమనిత్వములు.

తిక్కన్నయన్న మనరెడ్డియన్న కాదరముమిన్న. అతడు హరిహరనాథోపాసకుడై యాంధ్ర సరస్వతినలరించెను. బ్రహ్మనేలపడ వవలెనని, యీాయన "విష్ణువిరించీశ్వరనాథ తత్త్వో" పాసకుడై యాధుని కాంధ్రవాణికి గ్రొత్తతీరుతీయములు దిద్దెను. అయినను తెనుగుదల్లికి దానుబ్రాయదగిన యన్నికావ్యములను రెడ్డ్యగ్రణి బ్రాయలేదు. ఈకొఱంతతీరునా?

ఈచిఱుకబ్బమునకు లఘుటీకగూడచేర్చి, లక్ష్మి యెదురు తిరుగుచున్నను యథాశక్తి సరస్వతీ సేవచేయు హరిసర్వోత్తమరావుగారు ప్రశంస్యులు.

ప్రతివ్యక్తియు నీకావ్యమును బఠించి మునలమ్మమాదిరి కాకున్నను యథాశక్తి త్యాగధనమును గడించుకొందురని యాశింతును.

కొండూరు వీరరాఘవాచార్యులు

**సఫలత:** కర్త—శ్రీ వడ్లమూడి వేంకటరత్నము వెల ఒకరూపాయి

మనుష్యజీవితాంగణమున దివ్యదీపికలై తేజరిల్లు ఉదాత్తాశయములను గ్రంథకర్తగారిందు జేర్చిరి.

ప్రాచీ ప్రతీచీ సాహిత్యచరిత్రములనుండియును, తత్త్వశాస్త్ర మతశాస్త్రములనుండియును, మహాపురుష జీవితగాథలనుండియును, మహామేధావుల వచనములనుండియును, స్వీయానుభూతి స్వీయ విజ్ఞానములనుండియును ఉదాత్తాదర్శపరంపరను గైకొని శ్రీ వేంకటరత్నముగారు ఈ గ్రంథమున వివరించిరి. ఇది మేలితలపుల పైడిపంటయన జెల్లును; భావమణుల పోగువని పలుకనగును. జిజ్ఞాసువులకును, సాధకులకును ఈ గ్రంథము చిరారాధ్యమైనదనుట అతిశయోక్తి కాజాలదు.

ఈ గ్రంథము ప్రపంచ పరిజ్ఞాన నిక్షేపమనుట నిస్సంశయము. ఆంధ్రమహాజనులు దీని నాదర దృష్టితో వీక్షింతురని విశ్వసించుచున్నాను.

ఈరీతి గ్రంథములను బహుళముగ రచించి, ఆంధ్రభారతికి పెక్కు కైసేతలు సమర్పించి శ్రీ వేంకటరత్నముగారు తమ జీవితక్షేత్రమున సఫలత గాంచెదరుగాక!

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. ఎల్.

**గీతాసూత్రనవతి:** కర్త—శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ

ప్రకాశకులు—పావులూరి రామారావు
కాలవ రామమూర్తి } తెనాలి వెల నాలుగణాలు

వసుంధరలోని మహాగ్రంథములలో అగ్రగణ్యమైనది 'భగవద్గీత.' ప్రపంచమేధావుల పూజాపేఠమున నిది చిరస్థానమునందినది. ఆంగ్లవిద్వాంసులు కార్లైలు, ఎమర్సను లిందలి భావశబలతను కొంతదనుక హృదయంగమ మొనరించుకొని, అంతరంగికముగ తామందిన తాత్త్వికవిభూతిని పురస్కరించుకొనియే సారస్వతారాధనము గావింపజాలితిమని ముక్తకంఠములతో వచించిరి. స్పైనోజా, మేక్సుముల్లరు, థీబాట్ ప్రభృతులు లీగ్రంథరాజముపై పూలుచల్లిరి. దీనియందలి భావమహత్త్వమును పెక్కురీతుల నుగ్గడించిరి. తత్త్వశాస్త్ర మతశాస్త్రములు సాహిత్యముతో

సన్నిహితబాంధవ్యముగలవనియు సాధకుని జీవితాంగణమున నిండలి యుదారాశయములు దివ్యదీపికళికలట్లు తేజరిల్లునియు నీయుద్గ్రంథమును పరిశీలించినపుడు గ్రహింతుము.

ఈ యాశయములు బహుళసూత్రములందు అంతర్భూతములై యున్నవి. ఒక్కొక సూత్ర మొక్కొక శమంతకమణి బోలునదని చెప్పజెల్లును. ఒక్కొక సూత్రమణినుండి బహు భావద్యుతులు ప్రసరించుచుండును.

భగవద్గీతను నిశితదృష్టితో వీక్షించి, శ్రీజమ్ములమడక మాధవరామశర్మగారు సూత్రపరంపరనుదీసి ప్రస్తుతగ్రంథమున క్రోడీకరించిరి. సూత్రస్థభావనిచయమును సరళసలలిత శైలిలో వ్యక్తీకరించిరి. వీరియాశయము శబ్దానువాదముకాదు. భావానువాదమున వీరందెవేసిన చేయి యనుట నిక్కము. కాని అనువాదముతో తమకర్తవ్యము చెల్లిపోయినదని వీ రూహించువారుకారు. ప్రతిసూత్రమునకు చక్కని వ్యాఖ్యానమును వ్రాసిరి. నిహితభావార్థమును వ్యక్తీకరించునపుడును, భావఛాయలను ప్రకాశమొనరించునపుడును తర్కికనిబంధనములను తూచాతప్పకపాటించి, విపులోదాహరణములను వివరించిరి. సహజప్రజ్ఞననుసరించి తత్త్వపరిశీలన మొనరించిరి. వీరిసూత్రభావ్యము నిరుపమానమై వెలయుచున్నది. దీనినిపఠించిన యనంతరము భగవద్గీతనుపరిశీలించు పాఠకులు అందలిభావగాంభీర్యమును ఘనతర ప్రజ్ఞతో హృదయంగమ మొనరించుకొనగలరు. గీతాసూత్రనవతి సాధకకరదీపికయని చెప్పజెల్లును.

గ్రంథకర్తగారికి చేయూతనొసగిన ప్రకాశకులు శ్రీ పావులూరి రామారావుగారును, శ్రీ కాలవ రామమూర్తిగారును పాఠకమహాశయుల ధన్యవాదముల నందగలరు.

జొ. స. నా. మూర్తి

## నవయుగ ప్రచురణాలయమువారి గ్రంథాలు

## పెదసనగల్లు, కృష్ణాజిల్లా

**స్వదేశసంస్థానాలు** : రచయిత— నార్ల వేంకటేశ్వరరావు

తెలుగులో అసలు పుస్తకాలే తక్కువ. అందు రాజకీయాలనుగూర్చి వ్రాసేవారు చాలా అరుదు. అట్టి పరిస్థితుల్లో నార్లవారు రాజకీయాలనుగూర్చి చిన్న పుస్తకాలువ్రాసి సరసమైనధరకు వాటిని ప్రచురింప జేస్తున్నారంటే అది గొప్ప దేశసేవయే.

వీరువ్రాసిన పుస్తకాల్లో స్వదేశసంస్థానాలు మొదటిది. మన దేశంలో సర్వతోముఖాభివృద్ధి కలగాలంటే ఈసంస్థానాలుకూడ ఒక దారిలోకి వస్తేగాని సాధ్యంగాదు. బ్రిటిష్‌ప్రభుత్వంలో ఉన్న లోపాల్ని ఎప్పటికప్పుడు పత్రికలలోను, ఉపన్యాసాల్లోను, కరపత్రాలలోను, పుస్తకాలలోను నాయకులు సామాన్యులుకూడా ఎప్పటికప్పుడు ప్రచురించుచునే యున్నారు. కాని స్వదేశసంస్థానాలలో ఇట్టి అవకాశా లెంతమాత్రమును లేవు. అసలు పత్రికలుండుటే అరుదు. ఉన్న ఒకటి రెండు కూడా రాజకీయాలనుగూర్చి నిష్పాక్షికంగా చర్చిస్తే కొన్నిరోజుల్లోనే ప్రభుత్వాగ్రహమునకు గురియవుతవి. కాబట్టి ఈపుస్తకములో తెలిపిన విషయములు అమూల్యము లనవచ్చును.

నార్లవారు ఉన్నతవిద్యావంతులు. రాజకీయాలను నిష్పాక్షికంగా అర్థంచేసుకొని అతిశయోక్తి, ఉత్ప్రేక్షలకు లోనుగాక ఆకర్షకరంగా వ్రాయగలనేర్పరి. ఈయన ఏవిషయాన్నైనా తగినంత ఆధారంలేకుండా సక్రమంగా చర్చించకుండా వ్రాయడు. తన అభిప్రాయాన్నైనా మరుగుపరచు

కాని సత్యాన్వేషణకు వలయు సామగ్రిమాత్రము చేకూర్చి చదువరి తానైతాను ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చుటకు అవకాశమిచ్చును. ఇందువలన సంస్థానాల్లోని లోపాలు చదువరికి బాగా మనసున నాటిపోవును. చాలమంది సంస్థానాధీశులు బాల్యమునందు క్రమశిక్షణ లేక విశృంఖలముగ పెరిగినందున వస్తుతః అధికారనిర్వహణకు తగరనియు, దురలవాటులకును, దుష్టసహవాసమునకును గురియైనందున సంస్థానమునందలి ఉన్నతపదవులను తగనివారికొసంగి స్వార్థపరులై ప్రజాపీడకు కారకులగుదురని ఈపుస్తకమును చదివిన బోధపడును.

దీనికి కారణము వారికి ఎట్టి బాధ్యతానిర్వహణము లేకుండుటయే. సాధారణంగా బ్రిటిష్ ప్రభుత్వంవారు సంస్థానవిషయాల్లో జోక్యంకలుగజేసికోరు. ఇక సంస్థానప్రజలు తమయధిపతిపై ఎట్టివిమర్శనమును చేయుటకుకూడ వీలులేదు. కనుక ఈపరిపాలనాపద్ధతి ఏర్పడిననేగాని ముక్తి లేదని ఈ పుస్తకముచదివిన స్పష్టమగును. నవయుగ ప్రచురణాలయమువారిట్టిపుస్తకముల చక్కగ ప్రచురించి చేయుచున్న దేశసేవకు విద్యావ్యాప్తికి ఆంధ్రపాఠకలోకము తప్పక దోహదం చేస్తారని నమ్ముచున్నాను.

## రష్యన్ కథలు : రచయిత— నార్ల వేంకటేశ్వరరావు

నార్లవారు నవయుగరచనలలో ముఖ్యులు. వీరు చాలవరకు రాజకీయ విషయాలమీదనే తమ దృష్టిని కేంద్రీకరించియున్నా కథలువ్రాయుటలోకూడ వీరికి మంచి నేర్పుకలదు. ఈరష్యను కథలు అనువాదముకింద లెక్కకువచ్చినా నార్లవారివ్యక్తిత్వము వీనిలో బాగుగ గన్పించుచున్నది. అసలు అనువాదముచేయుట అంతసులభమైనపనిగాదు. ఒకొక సందర్భంలో స్వతంత్రరచనయే అనువాదముకన్న సులభము. అందులో భిన్నజాతికిజెంది సాంఘికాచారములలో మనకన్న భిన్నముగనున్న రష్యనులజీవితమును ప్రతిఫలింపజేయుచున్న ఈ చిన్నికథలను తెనిగించుట చాల కష్టము.

కాని వేషభాషలలోను, ఆచారవ్యవహారములలోను, కొంతవరకు భావములలోను కూడ వివిధజాతులకు చాలభేదము గాన్పించినను మానవజాతికంతటికిని చిత్తవృత్తులు, ఆత్మవిన్యాసము మొదలగువానియందు మాత్రము ఎంతమాత్రమును భేదముగాన్పించదు. రాగద్వేషములు మానవులందరికిని సమానమే. వాటికి గురియైనపుడు మానవులందరును ఒక్కలాగుననే ప్రవర్తింతురు. అన్టన్ షెకావ్ గారి 'ఏయెండకాగొడుగు' అనుకథలో సార్జంటు ప్రవర్తనకును, నేడు మనదేశములోనున్న పోలీసు కనిస్టేబులులకును ఏమీభేదము గాన్పించదు. ఇక 'కులట'ను గూర్చి యోచించినవారికి మనదేశమున నట్టికులట లెంతమంది జ్ఞప్తికిరారు!

రష్యను కథలలోనున్న విశేషము స్వభావచిత్రీకరణము. అనువాదము కడుజాగ్రత్తగ చేసినగాని స్వభావచిత్రము ప్రస్ఫుటముగ గోచరముకాదు. నార్లవారి చాకచక్యమునకు మనమాశ్చర్యము బొందకతప్పదు. తప్పక వీరు ఇంకను కొన్నిరష్యను గ్రంథములను అనువదింతురని ఆశించుచున్నాను.

## పాలస్తీనా : రచయిత— నార్ల వేంకటేశ్వరరావు

ఇదియు నార్లవారి రాజకీయగ్రంథాలలో ఒకటి. రాజకీయవిషయాలను తెలుగులో ఆకర్షకరంగాను, సర్కారువారి ఆక్షేపణకు లోనుగాకుండాను, సత్యము మరుగుపడకుండాను వ్రాయాలంటే చాల కష్టము. కాని విదేశ రాజకీయవ్యవహారాలను చక్కగా అర్థంచేసుకుంటేనేగాని మన రాజకీయవ్యవహారాలు కూడ చక్కగా అర్థంకావు. ఈ విదేశవ్యవహారపరిజ్ఞానంవల్లనే జవహరులాలుగారి అభిప్రాయాలకు అట్టి యాధిక్యత ఏర్పడినది.

సామ్రాజ్యతత్వం బాగుగా బోధపడాలంటే పాలస్తీనా సమస్యను అర్థంచేసుకోవాలి. పాలస్తీనా రాజకీయరంగంలో ఉన్న పాత్రలు మూడు. ఒకటి అరబ్బులు, రెండు యూదులు, మూడు పరిపాలకులైన బ్రిటిషువారు. చారిత్రకంగా పాలస్తీనా యూదులది. కాని వెయ్యిసంవత్సరములకు పైగా అది అరబ్బీలదేశముగానే ఉన్నది. జనసంఖ్యలో చాలభాగము అరబ్బీలు. భాష, సంస్కృతి అంతా అరబ్బీ. కాని ఇటీవల యూదులకు ఇతరదేశాలలో ఎంతమాత్రమును గౌరవము లేకపోవుటచేతను, కొన్ని దేశములలో ప్రభుత్వమువారు యూదులను బలాత్కారంగా తరిమివేయుట వలనను వారు తమ ప్రాచీనదేశమునకు వెళ్ళిపోయి అక్కడే వసతి యేర్పరచుకొనన నిశ్చయించినారు. అయితే అరబ్బుల గతి ఏమి?

చాలకాలము పాలస్తీనా టర్కీ బానిసత్వముక్రింద నుండెను. టర్కీవారుకూడా తురకలైనా బానిసత్వము అవమానకరమైనందున అరబ్బులు స్వాతంత్ర్యంకోసం బ్రిటిష్‌వారి పలుకులకు మొగ్గి గత జర్మను యుద్ధమునందు టర్కీపై తిరుగుబాటొనర్చిరి. యుద్ధపరిసమాప్త్యనంతరం స్వాతంత్ర్యం వచ్చునుగదా యని ఆశపడిరి. కాని బ్రిటిష్‌వారు యూదులకు ఈదేశములో ముఖ్యస్థానమున్నిచ్చెదమని వీకే ఒక వాగ్దానము ప్రత్యేకముగా యూదులకు చేసియుండిరి. కనుక యూదులకు అరబ్బీలకు మధ్య పోరాటమారంభమాయెను. బ్రిటిష్‌వారు మధ్యవర్తిత్వమును చాలా నేర్పుతో జరిపించినను పాశ్చాత్య నాగరికతలో అతిప్రావీణ్యమును గడించి పాశ్చాత్యదేశములలో అధికముగ పరపతి సంపాదించియున్నందున యూదులకే అరబ్బులకన్న ఎక్కువగ పాలస్తీనాలో సౌకర్యములు దొరకుచుండెను. నానాటికి యూదులసంఖ్య అధికమై దేశమునందున్న వ్యవసాయముపైనను, పరిశ్రమలపైనను, ప్రభుత్వమునందును యూదులకు పట్టుజిక్కెను. ఇది నానాటికి అధికమై అరబ్బీ విధ్వంసమునకు హేతువగునేమో యని భయపడి అరబ్బీలు విప్లవమార్గమును అవలంబించుచున్నారు. బ్రిటిష్‌వారు ఈతరుణమున ఏపథకము నవలంబించుచున్నది ఎంతవరకు సమంజసమైనది నార్లవారి పుస్తకమును జదివిన స్పష్టమగును. ఇంత సులభశైలిలో బాలురకుగూడ స్పష్టముగ బోధపడునట్లు వ్రాయుట నార్లవారికి సహజమే. ఈ పుస్తకము ఆంధ్రుల మన్ననకు పాత్రమగుననుటకు సందియమేలేదు. —డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ., పి హెచ్.డి. (లండను)

## దేశోద్ధారక గ్రంథమాలా ప్రచురణములు

### ఇమాంబావివీధి, సికిందరాబాదు (దక్కను)

౧ **హైందవ ధర్మవీరులు** (హైందవ ధర్మపోలీలు): కర్త—శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, బి.ఏ.,బి.ఎల్.
క్రౌను సైజు ౨౮ పుటలు; వెల ౬ అణాలు

ఈ 'ధర్మపోలీలు' గరమ్‌పోలీల వంటివి. హిందూదేశ చరిత్రలో, సామాన్యముగ కానరాక, పౌరుష ప్రధానములై పాఠకుల రక్తము నుడుకులెత్తించు నిప్పుకణికలవంటి ౧౮ కథల సంపుటి.

౩, ౪ **కమాల్‌పాషా జీవితము ౧, ౨ భాగములు**: కర్త—శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం,
ఒక్కొక్కటి ౧౪౮ పుటలు; ఒక్కొక్కటి ౬ అణాలు బి. ఏ. (ఆనర్సు)

అయిరోపాఖండములో రోగిష్ఠియయి, జవసత్వము లుడిగియున్న తురుష్కదేశమునకు చక్కని నిదానముతో, రోగమునకు చికిత్సచేసి బలవర్ధకౌషధము నిచ్చి పరిపూర్ణారోగ్యమును, బలసంపదను కలిగించి సంస్కారము నొసగి క్రొత్తదేశమును చేసివైచిన దేశభక్తులలో అగ్రగణ్యుని జీవితచరిత్ర. ముల్లు.

దరిదాపుగ పూర్వపు తురుష్కస్థానమువలె నున్న మన భారతదేశ సంస్కరణమును గోరువారు గమనింపదగిన విషయములు ఇందు పెక్కులు గలవు.

౫ **ప్రజలు-ప్రభుత్వము :** కర్త—టాల్‌స్టాయి; అనువాదకుడు-శ్రీ జానపాటి సత్యనారాయణ
౧౦౦ పుటలు; వెల ౬ అణాలు

ప్రభుత్వములు, వానివలన కలుగు నష్టములు, జాతీయము, దేశభక్తి మొదలగు ఉద్రేకభావములను ప్రజలకు గల్గించి అవి చేయుచున్న దుండగములు, సర్వనాశము గల్గించు యుద్ధములను ప్రభుత్వములు కల్పించుటలోని రహస్యములు, వానిని మన మొగరొక్కనవలసిన పద్ధతులు మొదలగు సర్వ విషయములను సమగ్రముగా చర్చించిన ఉత్తమ గ్రంథము.

౬ **ఔంధు సంస్థానము:** కర్త— శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు, బి. ఏ.,
౪౬ పుటలు; వెల ౫ అణాలు

ఔంధు సంస్థానముయొక్క ప్రస్తుత రాజకీయ చరిత్ర—ప్రజల స్వాతంత్ర్యపిపాస, వారి ప్రయత్నములు, వైస్రాయిగారి హెచ్చరిక, రాజుగారొసగిన సంస్కరణలు, గాంధిమహాత్ముడు మున్నగు వారిచ్చిన సందేశములు వివరింపబడినవి.

౭ **కాంగ్రెసు-సంస్థానములు:** కర్త—డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య
౭౨ పుటలు; వెల ౬ అణాలు

సంస్థానప్రజా మహాసభాధ్యక్షులు గానున్న శ్రీ పట్టాభి సీతారామయ్యగారు ఆ సభా కార్యకర్తల సమావేశ సందర్భమున నిచ్చిన యధ్యక్షోపన్యాసము. ఇందు ఆ సభాభివృద్ధి, సంస్థానములను గూర్చి కాంగ్రెసు అప్పుడప్పుడు చేయుచు వచ్చిన తీరుమానములు, వాని భావము, సంస్థానములలో సత్యాగ్రహోద్యమముయొక్క ప్రభావము, సంస్థానముల భవిష్యత్తు మొదలగు విషయము లిందు వివరింపబడినవి. ఈ విషయములను మనకు వివరించుటకు శ్రీ పట్టాభి సీతారామయ్య గారికంటె అర్హు లింకెవరుందురు ?

౮ **సంస్థానసమస్యలు:** కర్త— డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య
పుటలు ౬౫; వెల ౬ అణాలు

సంస్థానప్రజలు, సంస్థానములతో ఫెడరేషనుకు గల సంబంధము, కాంగ్రెసు - సంస్థానములు మొదలగు విషయములను గూర్చి పట్టాభి సీతారామయ్యగారు ఒరిస్సాలో జరిగిన సంస్థానప్రజల మహాసభలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసమును, బెంగుళూరులో ఇచ్చిన ఉపన్యాసమును ఇందు కూర్చబడినవి

౯, ౧౦ **గాంధీమహాత్ముడు** ౧, ౨ భాగములు కర్త—"విష్ణుచక్రం" ౫౫, ౬౫ పుటలు
ఒక్కొక్కటి ౬ అణాలు

మహాత్ముని సిద్ధాంతములను తానెంతవఱకు గ్రహించెనో గ్రంథకర్త యీ పుస్తకములందు తెలిపియున్నాడు.

(i) భారతదేశమున నిపుడు అధర్మము పెచ్చుపెరిగి ధర్మము క్షీణించినది గావున మహాత్ముని యవతార మావశ్యకమయినదని గ్రంథకర్త నిరూపించినాడు. అట్టి పరిస్థితులన్నియు ఇందు విపులముగ

వర్ణింపబడుటయే గాక యంత్రములు, చేతిపరిశ్రమలను గూర్చి మహాత్ముని యభిప్రాయములును ప్రకటింపబడినవి.

(ii) ఇందు కొన్ని విషయములు-సందేహాస్పదములు-ఉన్నవి. మచ్చునకు—

"భారతదేశమందు మొత్తము జనాభాలో 3 కోట్లకు పైగా హరిజనులున్నారు" (౧ పుట)

"ఏడుకోట్ల హరిజను లితరమతములలోన జేర్పబడిన లాభమేమి? (౧౪ పుట)

ఈ సంఖ్యలను సమన్వయము చేయుట యెట్లు ?

"ధర్మచింతన గలిగి ఆధ్యాత్మిక విజ్ఞాన మితరులకు బోధింపవలసిన బ్రాహ్మణులు తక్కినవారితో వివాహ మొనర్చుకొనిన బోసగునా? వంశానుగతముగ నభిప్రాయములు ప్రతి వర్ణమువారికి వచ్చుచుండును గనుక వీలుండదు." (౪ పుట)

వీరు పురాణములలోని వర్ణాంతర వివాహముల నెట్లు సమన్వయింతురో! పొసగని యీ వర్ణాంతర వివాహములలోను ఉత్తమజాతి పురుషుడు తక్కువజాతి స్త్రీని వివాహమాడుట కంగీకారము గలదు. ఈ విషయమును గ్రంథకర్త చర్చించియున్న బాగుగనుండెడిది.

"బ్రాహ్మణస్త్రీలు తక్కిన మూడు వర్ణములవారితో గాని, క్షత్రియ స్త్రీ మిగతా రెండువర్ణముల వారితో గాని, వైశ్యస్త్రీ శూద్రులతో గాని, శూద్రుడు పైవర్ణ స్త్రీలతో గాని సంపర్క మొనర్పరాదని శాసించినారు. అట్లా సంపర్క మొనర్చిన స్త్రీలను కులమునుండి బహిష్కరింపవలె ననినారు. అట్టి స్త్రీలకు బుట్టిన సంతానమును కూడ వెలివేయవలెనినారు...దానినొనర్చినవారిని వారి సంతానమును బహిష్కరించినారు. సంఘసభ్యులు వారి నస్పృశ్యులుగా పరిగణించినారు. సంఘములో వారి కే హక్కు గౌరవములు లేవు. సంఘబహిష్కారమునకు వెలిచి సవర్ణులు వారిని దగ్గఱకు రానీయకుండా అంటరానివారుగా నిర్ణయించినారు. ఇది అసలురహస్యము" (౪పుట)

గ్రంథకర్త గాంధీమహాత్ముని అస్పృశ్యతా నివారణోద్దేశములను సమర్థించుట ప్రశంసాపాత్రమే గాని అస్పృశ్య జాతి యేర్పడుటకు చారిత్రకు లూహించు కారణములను తలపెట్టక 'ఇది అసలు రహస్యము' అని చట్టున గట్టిగ చెప్పివైచుటకు దొరకిన కీలక మేదో తెలియదు. మొత్తముమీద పుస్తకము చదువదగినది.

చక్కని గ్రంథములను, సమర్థులగు గ్రంథకర్తలచే వ్రాయించి ప్రచురింపబూనిన దేశోద్ధారక గ్రంథమాలాధ్యక్షులగు శ్రీ వట్టికోట ఆళ్వారు స్వామిగారు సంస్తుతిపాత్రులు. ఈ గ్రంథమాల యిట్లే చిరకాలము భాషాసేవ చేయుచు వన్నెకెక్కును గాక!

ఉ. భా. ప్ర. వడ్లమూడి వేంకటరత్నము

## సమీక్షకు చేరిన గ్రంథములు

**శ్రీకృష్ణరాయాభ్యుదయ సంచిక** : 'మధురకవి' నాళము కృష్ణరావుగారి షష్టిపూర్తిసందర్భమున ప్రకటింపబడినది. ౧/౪ క్రౌను సైజు ౨౦౦ పుటలు. దళసరి గ్లేజు కాగితము. వెల ఒక రూపాయి. గ్రంథాలయములకు అర్ధరూపాయి. పోస్టేజి ప్రత్యేకము.

ప్రతులకు : ప్రతిభా ఎలక్ట్రో ఇండస్ట్రీస్, మెయిన్ రోడ్డు
రాజమహేంద్రవరము

**శ్రీ నిరంజనవిజయము :** కీ. శే. వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి జీవితచరిత్రము. కర్త-ఉ. భా. ప్ర. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు. క్రౌన్ సైజు 97 పుటలు. రఫ్ కాగితము వెల నాలుగణాలు. పోస్టేజినిమిత్తము అణా కాని బిళ్లలు పంపు గ్రంథాలయముల కుచితము.

వలయువారు : గ్రంథకర్త, ఉప్పుగుండూరు, ఒంగోలుతాలూకా.

## తాడేపల్లిగూడెంతాలూకా గ్రామసేవాసమితివారి ప్రచురణములు

| ప్రచురణసంఖ్య | | ౧/౮ క్రౌనుసైజు పుటలు |
|---|---|---|
| 4. | **సహకారోద్యమము :** | |
| 5. | **పశుసంరక్షణ :** కర్త-శ్రీ రెడ్డివారి నారాయణరెడ్డి | 46 |
| 6. | **వ్యవసాయము :** కర్త-శ్రీ తొల్లూరి లక్ష్మీపతిరావు | 50 |

పై ప్రచురణములు ఒక్కొక్కటి వెల రు 0-2-0; సాలుచందా 2-0-0

గ్రామసేవాసమితి, తాడేపల్లిగూడెం, ప. గోదావరిజిల్లా

## అణా గ్రంథమాలవారి పుస్తకాలు

| ప్రచురణసంఖ్య | | ౧/౮ క్రౌనుసైజు పుటలు |
|---|---|---|
| 7. | **కాంగ్రెసుచరిత్ర—మొదటిభాగము :** శ్రీ జానపాటి సత్యనారాయణ | ౪౦ |
| 8. | డిటో రెండవభాగము : డిటో | ౩౩ |
| 9. | **జాగీరులు :** కర్తలు—శ్రీ ఉమ్మెంతల కేశవరావు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి | ౪౨ |
| 10. | **మొగలాయికథలు :** కర్త- శ్రీసురవరము ప్రతాపరెడ్డి; బి. ఏ., బి. ఎల్. | ౩౩ |
| 11. | **పండిత జవాహర్లాలునెహ్రూ :** కర్త-శ్రీ కె. రంగదాసు | ౩౬ |

౧౦౦ పుస్తకములకు చందా రు ౫ లు మాత్రమే. తపాలాచార్జీలు రు ౨ లు.

అణాగ్రంథమాల కార్యాలయము, 3౬–౧ తురుపుబజారు

హైద్రాబాదు (దక్కను)

**దయానంద గ్రంథాలయము—ఆంధ్రాంగ్ల హిందీపుస్తకముల సూచిక, 1940**

1/8 డెమ్మీసైజు. 56 పేజీలు. సభ్యులకుమాత్రం అణన్నర వెల

గుడివాడతాలూకాలోని యలమర్రు గ్రామమునందున్న పై గ్రంథాలయములోను, పంచాయతీ బోర్డు లైబ్రరీలోను గల గ్రంథముల విభజన పట్టిక లిందు గలవు.

**శ్రీ సరస్వతీ నిలయ గ్రంథముల బాబితా, 1937**

1/8 ఫూల్స్కేప్ సైజు. 36 పేజీలు. వెల అణన్నర

బాపట్ల తాలూకా ఖాజీపాలెంలోని పై గ్రంథాలయమందలి ఆంధ్ర, హిందీ గ్రంథముల విభజన పట్టిక లిందు గలవు. ఇది సైక్లోస్టయిలుపై తయారుచేయబడినది. ముత్యములవంటి అక్షరములతో బహు ముచ్చటగ నున్నది.

